

దక్షిణ భాషా పుస్తక సంస్థ సహకారమున ప్రకటితము.

రూ. 1.25

# సిద్ధార్థ

ర్మన్ హెస్ నవలనుండి

బెల్లంకొండ రాఘవరావుచే అనువాదము

యం. శేషాచలం & కంపెనీ

మూలరచన :

హెర్‌మన్ హెస్ (స్విస్)

(నోబెల్ బహుమానగృహీత.)

# సిద్ధార్థ

ఆంగ్లానువాదం : హిల్డా రోజ్నర్

ఆంధ్రానువాదం : బెల్లంకొండ రాఘవరావు

యం. శేషాచలం అండ్ కంపెనీ,

మచిలీపట్టణము : : మద్రాసు : : సికిందరాబాదు

Rs. 1—25 NP.

SIDDARTHA by HERMANN HESSE {SWISS}

# సిద్ధార్థ

అంగ్లానువాదం : హిల్డా రోజ్నర్

ఆంధ్రానువాదం : బెల్లంకొండ రాఘవరావు

ప్రథమ ముద్రణము 1957

DIGITALISED EDITION 2015

UP-LOADED BY : BELLAMKONDA CHAKRADHAR.

Sri Bellamkonda Rama Raya Kavindrula Trust.

NARASARAOPET.

14-01-2015

please send your comments to this mail

-- bvlnckumar@gmail.com.

# పరిచయం



దక్షిణభాషాపుస్తకసంస్థవారు ప్రోత్సహించిన ఉత్తమ గ్రంథ సంచయములోని తొలిప్రచురణ లివి. తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం—నాలుగు దక్షిణాదిభాషలలో విద్యా సాంస్కృతిక వికాసాలకు దోహద మిచ్చే ఉత్తమ గ్రంథాలను చౌకగా ప్రచురింప జేయాలనే సత్సంకల్పముతో; సముదార దూర దృష్టితో ఫోర్డు ధర్మనిధివారు ఈ సంస్థ నిర్మాణాన్ని తలపెట్టారు. ఇందుకోసం వారు దక్షిణదేశంలో ఉన్న ఏడు విశ్వ విద్యాలయాల ఉపాధ్యక్షులతోను సంప్రదించి ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలకు, మంచి మంచి పుస్తకాలను, ప్రచురణకర్తలచే అందముగా అచ్చువేయించి అందరికి అందుబాటులో ఉండే సరసమైన ధరలకు అందచేయాలనే ఆదర్శంతో మూడేళ్ల కార్యక్రమాన్ని రూపొందించారు. వీరి కృషివలన మనకు లభించిన ప్రథమ ఫలా లివి. దీన్ని కూర్చడంలో వీరు ప్రౌఢశైలిలో ఉండే విద్వత్కావ్యాల జోలికి పోకుండా కేవలం మాతృభాషలో మాత్రమే అక్షరాస్యులైన ఆంగ్లభాషావాసన లేని అసంఖ్యాక సామాన్య ప్రజానీకాన్ని అలరించి, ఆకర్షించి, వారికి విజ్ఞానాన్ని, వినోదాన్ని, వికాసాన్ని పూర్తిగా అందించగల సులభ సుందర శైలిలో ఉన్న ఉత్తమ గ్రంథాలను మాత్రమే ఎన్నుకొన్నారు.

ఉన్నత సారస్వతశ్రేణికి చెందిన స్వతంత్ర రచనలనే కాకుండా వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథాలనూ, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమ గ్రంథాల అనువాదాలనూ కూడ ప్రచురింప చేయడం వీరి ప్రధాన లక్ష్యం.

ఒక్కమాటలో చెప్పాలంటే ఉత్తమ గ్రంథాలను చౌకగా అందించడం అనేది దక్షిణభాషా పుస్తక సంస్థవారి పరమాశయం. ఇందులో వీరెంతవరకు కృతకృత్యులైనదీ ఇప్పుడీ గ్రంథాలను బట్టి ప్రజలే నిర్ణయించవలసి ఉంది. ఇప్పుడు ప్రారంభమైన ఈ కృషిఫలితం బహుశా వచ్చే పదిసంవత్సరాలవరకు అంతగా కనబడక పోవచ్చు. కాని, ఈప్రణాళిక అద్భుతమైనదని, అత్యంతప్రధానమైనదనిమాత్రం దూరదృష్టి గలవారందరూ ఒప్పుకొనక తప్పదు. ఇందుకు గల అవకాశాలు అనేకం.

అందమైన అచ్చుతో చౌకగా అందరికీ అందుబాటులో ఉంటే ఈ ఉత్తమ గ్రంథాలు దేశంలో మారుమూల పల్లెలలో నివసించే లక్షలాది స్త్రీ పురుషులందరి జీవితాలకు క్రొత్త వెలుగును, విజ్ఞానాన్ని అందించగలవు.

దక్షిణభాషా పుస్తక సంస్థవారి కార్యక్రమాలు ప్రస్తుతానికి తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం—నాలుగు దక్షిణాది భాషలకే పరిమితమై ఉండటం వింతకాదు. ప్రాచీన కాలంలో వింధ్యకు దక్షిణాన ఉండే దేశమంతా దక్షిణాపథ మనే పేరుతో వ్యవహారంలో ఉన్నప్పటికీ, సాంస్కృతికంగా ఇక్కడ నివసించే ప్రజలందరూ ఈ నాలుగు భాషలను వాటి ప్రాంతీయ వికృతులను మాత్రమే వాడుకచేసేవారు. నిజానికి ఈ నాలుగు భాషలున్నూ ఒకే కోవకు చెందినవి. వీటిని 'ద్రావిడ' భాష లనడం నా అభిమతం కాదు. ఈ రోజుల్లో 'ద్రావిడ' పదం జాతి, భాషాపరమైనదిగా కాక ప్రత్యేకమైన రాజకీయ ప్రాధాన్యాన్ని సంతరించుకోవడమే నా యీ సంకోచానికి కారణం. ఈ నాలుగు భాషలకు మధ్య సహజమైన సన్నిహిత సంబంధాలు చాలా ఉన్నవి. పైగా ఆర్యావర్తములో వ్యాప్తిలో ఉన్న సంస్కృతికంటె భిన్నమైన దక్షిణ భారతీయ సంస్కృతికి ఈ ప్రాంతం ఆటపట్టు. కర్ణాటక సంగీత సంప్రదాయం ఇక్కడిదే. అలాగే ఇక్కడి వాస్తు, శిల్ప సంపద ఉత్తరాది దానికంటె భిన్నమైనది. ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలు అనూచానంగా అనుసరించే సాంఘికాచార వ్యవహారాలన్నీ కూడా ఒక్కటే.

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి ప్రోత్సాహంవల్ల ప్రచురిత మయ్యే పుస్తకాలన్నీ దాక్షిణాత్య సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండగలవని ఆశిస్తున్నాను. అయితే సంకుచితమైన స్వస్థానభాషా వేషానురతి శ్రుతి మించిపోకుండా సమగ్ర భారత సంస్కృతిని ప్రతిబింబింప జేసే పుస్తకాలను, విశ్వమానవసౌభ్రాతృత్వాన్ని, ప్రపంచ కళ్యాణాన్ని కాంక్షించే ఉత్తమగ్రంథాలు అనువాదాలను ప్రచురించడం చాలా అవసరం.

పా. వేం. రాజమన్నారు
(మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి)

# తొలి పలుకు



ఒక మంచికథను మనం మళ్ళీ మళ్ళీ చదువుతాము. దాన్ని మన హృదయంలో నాటుకుని పెరగనిస్తాము. కొన్నాళ్ళకు అదే కథను మళ్ళీ చదివితే మొదట చదివినప్పటికంటే ఎంతో భిన్నమైన అర్థం గోచరిస్తుంది. అందలి నిజమైన అర్థాన్ని రూఢిగా నిర్ణయించుకోవడం కష్టంగా కనిపిస్తుంది. రామాయణాన్ని, జీసస్ వ్యంగ్య కథలను ఈలాటి రచనలకు ఉదాహరణలుగా తీసుకోవచ్చు. వాటిలో అర్థాన్ని మనం వేర్వేరు విధాలుగా గ్రహిస్తాము. ఒక్కొక్క పాత్ర దృష్ట్యా మన జీవితాన్ని సరిదిద్దుకొంటూ ఆనందాన్ని, లాభాన్ని పొందుతాము.

ఆ విధంగా ఎన్నిసార్లు చదివినా మన స్వానుభూతిని, భావనను వృద్ధి పరుస్తూ మనకు గంభీరమైన విస్తారమైన విజ్ఞానాన్ని అందీయగల ఉత్తమరచన ఈ "సిద్ధార్థ." "నీవు సత్యాన్ని గ్రహిస్తే సత్యమే నీకు స్వేచ్ఛను కల్పిస్తుంది" అని జీసస్ పలికినప్పుడు ఈ విధమైన విజ్ఞానాన్నే ఉద్దేశించి వుంటాడు.

కాని "సిద్ధార్థ" వల్ల ఈ ప్రయోజనం పెద్దవాళ్ళకే లభిస్తుంది. దీన్ని అర్థం చేసుకుని ఆనందించడం ఒక పిల్లవాడికి సాధ్యపడదు. సాహిత్యవిమర్శకులు దీన్ని వయోజనులకు ఉపకరించే రచనగా నిర్ధారణ చేయడం న్యాయం కాక పోదు. వయసు వచ్చి ఆధ్యాత్మికతృష్ణ పెంపొందిన వారిని ఈ గ్రంథం తన్మయులను కావిస్తుంది. నిరీశ్వర వాదుల మని చెప్పుకునేవారుకూడా దీన్ని మళ్ళీ మళ్ళీ చదివి ఆనందించ గలరని నిస్సందేహంగా చెప్పవచ్చు.

"ఈ విషయంలో దేవునికి, వేదమంత్రాలకు, యజ్ఞకర్మలకు, దక్షిణలకు స్థానం లేదు. ఆత్మనిష్ఠమైన ఆత్మను ఆత్మద్వారా ఎల్లప్పుడూ ఏకాగ్రతతో ధ్యానించు".

ఈ మాటలు మతవిరోధులు చెప్పినవికావు. ఇవి శ్రీరమణమహర్షి వాక్యాలు. అన్ని మతాలలోనూ సామరస్యాన్ని సాధించిన శ్రీ రమణ

మహర్షి; అన్ని మతాలను నిరాకరించిన శ్రీ జె. కృష్ణమూర్తి అనుభవ పూర్వకంగా గ్రహించిన సత్యాన్నే "సిద్ధార్థ" ప్రకటించడానికి ప్రయత్నించింది.

బుద్ధుడు జీసస్ సత్యాన్ని గ్రహించడం మూలంగానే మోక్షాన్ని పొందారు. వారి సిద్ధాంతాలను పట్టుకుని వాగ్వాదాలు చేసేవారికి అపరోక్షమైన అనుభూతి వుండదు. అంగ.కే వారు మోక్షాన్ని పొంద జాలరు. అట్టివారు ఇతరులకు మోక్షాన్ని ఏలాగు సంపాదించి పెట్ట గలరు ?

"ఆదిగురువు శివుడు దక్షిణామూర్తిరూపంతో బ్రహ్మపదార్థాన్ని మౌనముద్రతోనే ఉపదేశించి నప్పుడు దాన్ని మాటలతో ఇతరులకు తెలపడం ఎవరికి సాధ్యం ?" (శ్రీరమణమహర్షి).

అయినా, మనకు అందని చందమామను వ్రేలితో చూపినట్టుగా ఒక కావ్యము, ఒక కథ వర్ణించరాని ఆనందాన్ని మన మనోనేత్రానికి ప్రదర్శిస్తవి. "భావాన్ని అతిక్రమించిన వస్తువును గూర్చి ఎడ తెగకుండా భావించు" అన్న ఉపదేశాన్ని మనకు అందించి మన ఆత్మలను ఉన్నత భూమికి తీసుకునిపోతవి.

ఈ దేశంలో పుట్టిన బౌద్ధమతం ఈ దేశంలో లేకుండా పోవడం ఏలా జరిగింది? ఈ దేశంలో మామూలు మనుషులకు కూడా పరమార్థాన్ని గ్రహించ గల చిత్తపరిపాకం ఏలా కలుగుతున్నది ?

ఇంద్రజాలికుడు అరగంటలో ఒక మామిడిచెట్టును కృత్రిమంగా పుట్టిస్తాడు. ఒకడు అదే నిజమైన చెట్టు అనుకుంటాడు. నిజంగా నేల మీద పెరుగుతూ వున్న మామిడిచెట్టుకు ఋతువు వచ్చినప్పుడు పండే పండుకోసం ఒకడు సంవత్సరాల తరబడి వేచివుంటాడు. ఈ యిద్దరిలో ఎవడు జ్ఞాని ?

ప్రతి మనిషీ ఒంటరిగానే పుడతాడు. ఒంటరిగానే చనిపోతాడు. ప్రతి మనిషీ జ్ఞానాన్ని, మోక్షాన్ని స్వంతంగానే సంపాదించుకోవాలి. అపరోక్షంగానూ నిరపేక్షంగానూ స్వానుభవంతో తెలుసుకో వలసిన సత్యాన్ని ఒకరిని యాచించి కాని అప్పుగా కాని, కొనుక్కోవడంవల్ల

కాని పొందడం సాధ్యంకాదు. ప్రతి మనిషీ తన మార్గాన్ని తానే సిద్ధపుచ్చుకోవాలి.

జీవితంలో తన ధర్మాన్ని సక్రమంగా నిర్వహించుకోవాలి. తన వ్యక్తిత్వాన్ని సరిదిద్దుకోవాలి. సకాలంలో అదే జ్ఞానంగా పరిపక్వం పొంది మోక్షాన్ని చేకూరుస్తుంది. అయితే మనం ఒకరికొకరు తోడ్పడ వచ్చు. కాని తల్లి బిడ్డలకుకూడా ఎవరినోరు వారిదే. ఎవరిమనసు వారిదే. జీవితమూ, విజ్ఞానమూ ఎవరిది వారిదే.

లోకానికి మోక్షమార్గం ప్రదర్శించడమనే దుర్ఘట కార్యాన్ని పూనుకుని ఈగ్రంథకర్త హెర్మన్ హెస్సీ చాలా వరకు కృతార్థుడై నాడు. ఇందులో సంకీర్ణ సమస్యలను లేవనెత్తి మన ఆలోచనను తీవ్రంగా పురికొల్పుతున్నాడు. ఆ బ్రాహ్మణయువకునికి బ్రాహ్మణ ధర్మం మీద ఎందుకు అసంతృప్తి కలిగింది? బుద్ధుడంతటి వానిని గురువుగా స్వీక రించడానికి ఎందుకు నిరాకరించాడు? తండ్రిని వదిలిపెట్టి శ్రమణులతో చేరినవాడు మళ్ళీ సంసారంలో తగుల్కొని సుఖదుఃఖాలకు ఎందుకు లోనైనాడు? ఆ సంసారం నుంచి తప్పించుకున్న తరువాత కూడా కుమారుని అదుపాజ్ఞలలో పెట్టి మంచిదారిలో నడపాలని ఎందుకు ఆరాట పడ్డాడు? "నేను" నశించిన తరువాత కూడా మనలను "నా" అనేది పట్టుకుంటుంది. అదే మనకు నరకాన్ని సిద్ధపరుస్తుంది. ఈ చిట్టచివరి మాయాస్పర్శను వదిలించుకుని, శాంతిని పొందడానికి ఆ బ్రాహ్మణపండి తుడు నదివల్ల జ్ఞానాన్ని సంపాదించిన ఒక పల్లెకారిపాదాలను ఆశ్రి యించవలసి వచ్చింది.

జ్ఞానాన్ని వెదుక్కుంటూ మనం ఎక్కడికి పోవాలి? తెంపు లేకుండా సాధనలతోనూ, మనన ధ్యానాలతోనూ, జిజ్ఞాసతోనూ శ్రమ పడే వ్యక్తికి హృదయంలోనే జ్ఞానం అంతర్జ్యోతిగా వెలగడంలేదా? మన ఆధ్యాత్మిక దారిద్ర్యాన్ని తుదిముట్టించగల భాగ్యం మనకు అతి సమీపంగానే వున్నది. ఏదూరదేశమో వెదుక్కుంటూపోయి దాన్ని సంపాదించ నక్కరలేదు. అది మన సంసారంలోనే, మన హృదయం లోనే నిక్షిప్తమైవున్నది. దీన్ని మనం వెదికి కనుక్కోవాలి. అందుకు కూడా శ్రద్ధ, ఉపాయం అవసరం. ఒక కలను నమ్ముకుని దూరభూము

లకు పోవాలి. అక్కడ వేరురకమైన కలలను గూర్చి వినాలి. అటు తరువాత ఇంటికి తిరిగివచ్చి లోపల త్రవ్వి చూచుకుంటే పూడివున్న ధనం లభిస్తుంది. ఒకడు పరాయివాడన్న కారణంచేత అతనిని కాదనడం మనకు సాధ్యపడదు.

జర్మన్ తత్వశాస్త్రజ్ఞుడు డాక్టర్ జిమ్మర్‌కు అభిమాన పాత్రమైన ఒక చమత్కార వ్యంగ్యకథ వున్నది. హాస్యవంటి భావుకునివల్ల మనకు ఎట్టి మేలు కలుగుతుందో ఆ కథ ద్వారా గ్రహించవచ్చు. పూర్వం పోలెండు రాజధాని క్రాకో నగరంలో యూదుల దేవాలయమందు ఇజాక్ అనే మతగురువు నివాసంచేస్తూ వుండేవాడు. అతడు చాలా శ్రద్ధతో సక్రమంగా తన మతధర్మాలను నిర్వర్తించేవాడు. ఒక రాత్రి అతనికి నిద్రలో కలవచ్చింది. ఆ కలలో ఎవరో కనపడి బొహీమియా రాజధాని ప్రేగు నగరానికి వెళ్ళమనీ, అక్కడ రాజుదేవిడీవద్ద వంతెన క్రింద పూడ్చిపెట్టిన ధనం వున్నదనీ, దానిని త్రివ్వి తీసుకోమనీ చెప్పారు. అతనికి ఆశ్చర్యం వేసింది. కాని ఆశకలిగింది, నమ్మకం లేక వూరుకున్నాడు. మళ్ళీ రెండుసారులు అదేకల వచ్చింది. ఇక తప్పకుండా వెళ్ళాలని నిశ్చయించుకుని ప్రేగుకు బయలుదేరాడు.

ప్రేగుకు వెళ్ళాడు. దేవిడీదగ్గర వంతెనను చూచాడు. అక్కడ రేయింబవళ్లు రక్షకభటులు కాపలా కాస్తున్నారు. ఇక త్రవ్వడం ఏలాగు? నిధిని తీసుకోవడం ఏలాగు? చాలాదినాలు వంతెనవద్దకు పొద్దున్నే వెళ్ళి, సాయంత్రంవరకు కనిపెట్టుకుని వుండేవాడు. అతని వింతప్రవర్తనను చూచి ప్రధానరక్షకభటుడు అడిగాడు: "అయ్యా! మీరు ఏదైనా పోయిన వస్తువుకోసం వెదుకుతున్నారా? ఎవరికోసమైనా ఎదురు చూస్తున్నారా? ప్రతిరోజు ఉదయాన్నే వచ్చి, సాయంత్రం వరకు ఇక్కడ కూర్చుంటున్నారు. ఏమిటి కారణం?" అని.

ఇజాక్ తన కలసంగతి అంతా దాపరికం లేకుండా చెప్పాడు. ఆ రక్షకభటుడు విరగబడి నవ్వుతూ ఈలా అన్నాడు: "పాపం! కలను నమ్ముకుని ఇంతదూరం వచ్చారు. కలలను నమ్ముకునే వివేకి ఎవడూ నాకు కనబడలేదు. ఈలాంటికల నాకుకూడా వచ్చింది. ఆ కలను నమ్మేటంత అవివేకం నాకూ వుండివుంటే సరిగా మీరు చేసిన

దానికి ఎదురుపనిచేసి వుండేవాడను. మీ అవివేకం మిమ్ములను ప్రేగుకు లాక్కొని వచ్చినట్టుగా నా అవివేకం నన్ను క్రాకోవు లాక్కొని పోయి వుండేది. మీరు రావడం ఎంతవృథా అయిందో నేను పోవడంకూడా అంత వృథా అయివుండేది. నాకు వచ్చినకలను వినండి : కలలో ఎవరో కనబడి క్రాకో నగరానికి వెళ్ళమనీ, అక్కడ ఇజాక్ అనే మతగురువు ఇంట్లో వంటచేసుకునేచోట బండక్రింద ధనం పూడ్చిపెట్టి వున్నదనీ, దానిని త్రవ్వి తీసుకోమనీ చెప్పారు. మీ కలలాగే నా కలకూడా అందంగా లేదండీ ! ” అంటూ ఆ రక్షకభటుడు మళ్ళీ విరగబడి నవ్వాడు.

రక్షకభటుని మాటలు శ్రద్ధగా విని ఇజాక్ అతనికి సలాము పెట్టి వెంటనే ఇంటిదారిపట్టాడు. వంటఇంటిలో బండక్రింద త్రవ్వి చూచాడు. తన పూర్వీకులు పోగుచేసినధన మంతా అక్కడ పూడ్చి పెట్టి వున్నది. దానితో సుఖంగా బ్రతుకుతూ ఒక ప్రార్థనామందిరం కట్టించి పేరుప్రతిష్ఠలు గడించాడు.

ప్రాచ్యపాశ్చాత్య దేశాలలో ప్రతివ్యక్తిహృదయక్షేత్రంలోనూ ఈ నిక్షేపం పూడివున్నది. అట్టిది వున్నదని నమ్మడం, దానికోసం వెదకడం, దానిని కనుక్కొని వినియోగించుకోవడం – ఇదే “సిద్ధార్థ” మనకు బోధిస్తున్నది. అన్ని మతాలలో సామరస్యాన్ని ప్రతిష్ఠించడ మంటే, ఈ నిక్షేపాన్ని వెదికి కనుక్కోవడ మన్నమాట. అట్టి సామరస్యానికి అదే ఏకైకసాధనం. మన తర్కబుద్ధితో ఒకపథకాన్ని నిర్మించుకుని, వేర్వేరు మతసిద్ధాంతాలను దానిలో ఇమిడ్చాలని ప్రయత్నించడంవల్ల అట్టి సామరస్యం కుదరదు. వ్యక్తికి వ్యక్తికి శాశ్వతమైన సౌహార్దాన్ని నెలకొల్పడం అగత్యమని తోచినప్పుడు అన్ని మతాలలో గర్భితమైవున్న మూలసత్యాన్ని గ్రహించడం మన ధర్మంకదా !

అయితే, ఈ గుప్తజ్ఞానం ఇతరవిద్యలవలె సులభంగా దొరికేది కాదు. దీనిని వెలిబుచ్చడానికి ప్రపంచంలోని మతగ్రంథాలు ఎంతో శ్రమచేసినవి. పరతత్వాన్ని వర్ణిస్తూ, కేనోపనిషత్తు ఈలా అన్నది : “దానిని మనస్సు గ్రహించనేరదు. దానివల్లనే మనస్సుకు గ్రహించే శక్తి కలుగుతుంది.” అలాగే కురాను చెప్పుతున్నది : “ఎవనివల్ల కన్ను

లకు చూచేశక్తి కలుగుతున్నదో అతనిని కన్నులు చూడజాలవు ” అని. అయితే, ఈ మతగ్రంథాలవల్ల ప్రయోజనం ఏమిటి ? ఈ ప్రశ్నలకు కేనోపనిషత్తునందే ఈ విధంగా జవాబు వున్నది : “ అది నాకు బాగా తెలుసు నని అనుకోను. అయితే, అది నాకు తెలియనిదికాదని తెలుసును. అది తెలియనిది కాదనీ తెలిసినదనీ ఎవనికి తెలుసునో వాడే తెలిసిన వాడు. ”

మనకు ఛాయామాత్రంగా తెలిసిన ఈ పరమరహస్యాన్ని “సిద్ధార్థ” విప్పిచెప్పడానికి ప్రయత్నిస్తున్నది. అది తెలియనిది కాదు కాబట్టి దాన్ని పూర్తిగా మనం గ్రహించడానికి ముందు, దాన్ని పొందేవరకు విశ్రాంతిలేకుండా వెదకడానికి మనలను ఆంతరమైన వేర్వేరు సాధనల ద్వారా అదేప్రబోధిస్తున్నది. దాన్ని గూర్చి మనం విన్న, చదివిన విషయా లన్నీ మన తృష్ణను ఉద్దీపనచేస్తవి. మన సాధనలు మన భావాలు తాత్కాలిక మైన తృప్తిని కల్పించినా, లోపలి తృష్ణాగ్ని ఇంకా ఇంకా ఇంధనాన్ని అపేక్షిస్తుంది. ఈ విధంగా దినదినమూ సాధనలకు, ఆలోచనకు తట్టుకో గల శక్తి బలీయమూ స్వచ్ఛమూ, అయి చివరకు ఒక చల్లని వెలుగులాగా స్పష్టంగా ప్రకాశిస్తుంది. మన అనుభవా లన్నీ ఈ చరమసత్యానికి వక్రమైన అస్పష్టమైన ప్రతిబింబాలని చిట్టచివరకు మనం గ్రహించగలుగుతాము. ఆ సత్యం మనకు తెలిసిన స్థితి అది.

సిద్ధార్థునికి కలిగిన జ్ఞానతృష్ణతో ఈ కథ ప్రారంభమై సంపూర్ణ జ్ఞానము సంతృప్తి కలగడంతో పూర్తిఅవుతుంది. కథారంభంలో అతనిని ప్రబోధించిన విషయమే కథాంతానికి ఇంధనాపేక్షలేకుండా నిశ్చలంగా వెలిగే అంతర్జ్యోతిని కల్పిస్తుంది. అన్ని సిద్ధాంతాలు కాలిపోయిన వెనక మిగిలిన స్వచ్ఛభస్మం లాగా అవుతాడు సిద్ధార్థుడు.

దాన్ని మనం ఋజువు చేయవలసిన అగత్యం లేకపోయినా, సిద్ధార్థుడు పొందిన అనుభవం ఆపరమజ్ఞానమనీ, ఆనందమనీ మనకు నమ్మకం కలగడం ఏలాగు ? ఆ జ్ఞానాన్ని పొందడానికి దేనిని కాని తుచ్ఛమనీ, అసత్యమనీ, లజ్జాకరమనీ తోసివేయడం తప్పనిసరి అయితే; పాపానికి, దుఃఖానికి, కోరికలకు, అలసటకు, జుగుప్సకు, స్వార్థానికి అందులో

స్థానం లేకపోతే; ఆ జ్ఞానం అసంపూర్ణమైన, అసమర్థమైన భ్రాంతి మాత్రమే కాగలదు. కాని, సమగ్రమైన సత్యం కానేరదు. కళ్ళు మూసుకుని సమాధిలో కూర్చున్నప్పుడు మాత్రం శాంతిని అనుభవించడం చాలునా ? కళ్ళు తెరచిన తరువాత ఏమి జరుగుతుంది ? ఇతరులు చూచే దంతా చూస్తూ తనలో తాను చూచిన సత్యాన్ని ప్రతిదానిలో చూడ గలిగినవానికే జ్ఞాననేత్రం తెరుచుకున్నట్టు చెప్పాలి. అట్టివాడే వెలుగుతోపాటు చీకటిని, మంచితోపాటు చెడును, సుఖంతోపాటు దుఃఖాన్ని, బ్రతుకుతోపాటు మృత్యువును స్వీకరించగల ధీరుడు.

“నీకు దివ్యచక్షువును ప్రసాదిస్తున్నాను. భూత భవిష్యద్వర్తమా నాలలో సార్వకాలికంగా వున్న అన్ని ప్రపంచాలను చూడు.” అన్నాడు శ్రీకృష్ణుడు అర్జునునితో. అర్జునుడు ఎన్నో భయంకర దృశ్యాలను చూస్తాడు. అన్నింటిలోనూ భగవంతుని సచేతనములైన అవయవాలనే చూస్తాడు. అదేవిధంగా “సిద్ధార్థ”లో విశ్వదర్శనం వర్ణించబడింది.

చూడబడని ఒక సత్యం వున్నదని ప్రతిపాదించేవారు ఇప్పుడు ఇక్కడ అన్ని వస్తువులలో ఆ సత్యాన్ని చూడాలి. వారి మౌనంలోనూ, వారి మందహాసంలోనూ ఆ సత్యం విడదీయరాకుండా గోచరించాలి. “అది పూర్ణం, ఇదిపూర్ణం. పూర్ణంలోనుంచి పూర్ణాన్ని తీసివేస్తే ఇంకా మిగిలి వుండేది పూర్ణమే.” ఈసత్యమే భావచిత్రణం ద్వారాను ప్రత్యక్షమైన ఉపదేశంద్వారాను ఈ గ్రంథం మనకు అందిస్తున్నది. ఇదంతా ఉత్తవేదాంతమని ఒకపాశ్చాత్యరచయిత ఊహాచిత్రమునకు ఈ అర్థాన్ని ఆరోపిస్తున్నాను, అని అనుకోరాదు. బుద్ధునికాలమునాటి భారతదేశంలో ఈ కథ జరిగినట్టు కల్పించడంవల్ల వేదాంతవిజ్ఞానాన్ని ప్రచారం చేయడమే ఈ రచయిత వుద్దేశమైనట్టు స్పష్టపడుతున్నది. ఇందలి కథానాయకుడు బ్రాహ్మణయువకుడు. యజ్ఞకర్మలలోనూ, యోగసాధనలోనూ ఆరితేరిన వాడు. బ్రాహ్మణనిష్ఠ కలవాడు. బుద్ధునికి జ్ఞానోదయం కలగక ముందు “సిద్ధార్థ” డని పేరు. ఆ పేరునే ఈ కథానాయకునికి పెట్టడంలో గ్రంథకర్తవుద్దేశం ఏమిటి? ఈ కథలో బుద్ధుడు సిద్ధార్థుడు వేరువేరు వ్యక్తులు. బుద్ధుని దర్శించిన తరువాతగూడా సిద్ధార్థుడు

అతనిని అనుసరించడానికి ఒప్పుకోలేదు. ఒకప్పుడు మాత్రం సిద్ధార్థుడు తనకు బుద్ధునితో తాదాత్మ్యం వున్నట్టు భావించాడు. బుద్ధుని శిష్యవర్గంలో చేరిన గోవిందుడు సిద్ధార్థుని చూచిన ప్రతి సారి బుద్ధుని స్మరించే వాడు. అసలు విషయం ఏమంటే, బుద్ధునికి కలిగిన జ్ఞానానుభవమూ వేదాంతమార్గంలో సిద్ధిని పొందినవారి మోక్షస్థితీ ఒక్కటే!

ఆధ్యాత్మికానుభవం సిద్ధాంతంగా మార్పొందినప్పుడు అదివేర్వేరు రూపాలను తాలుస్తుంది. అనుభవానికి సిద్ధాంతానికి సంబంధం గానానికి సాహిత్యానికి ఉన్న సంబంధం లాంటిది. ఒక్కటే శ్రుతిమేళనంతో రెండు భిన్నార్థాలు కలమాటలను కూర్చవచ్చు. "దేనినీ ప్రేమించ వద్దు" "అద్యంత వస్తువు ప్రేమ ఒక్కటే" అన్న భిన్నవాక్యాలకు శ్రుతి మేళన ఒక్కటే. అలాగే, సంసారం, నిర్వాణం, బంధం, మోక్షం, అన్నవి కూడా. భావాన్ని తెలిపేవీ, వైవిధ్యాన్ని కల్పించేవీ మాటలే. ఎంత ఉత్తమమైనా ఒక్కటే భావానికి అంటిపట్టుకొని కూర్చున్నప్పుడు ఆధ్యాత్మికవికాసానికి ఆటంకం కాకతప్పదు. పరమానుభవం లభించదు. ఏలాంటి బంధమైనా మోక్షానికి ప్రతిబంధకమే. ఈ సందర్భంలో వాసుదేవునికి గోవిందునికి వ్యత్యాసాన్ని గమనించ వచ్చు. "ఏలాగు మాట్లాడవలెనో, ఏలాగు తర్కించ వలెనో నాకు తెలియదు. అందులో నాకు ప్రజ్ఞ లేదు. వినడం గ్రహించడం మాత్రం నాకు తెలుసును." అంటాడు వాసుదేవుడు.

మనహృదయగర్భంలో వున్నశక్తి చెదురుగా వున్నదికాదు. అది మనస్సుద్వారా మాటలరూపాన వెలువడినప్పుడు భిన్నత్వం తాల్చి, లోకానికి భిన్నత్వం కల్పిస్తుంది. మాటలలోని అశక్తతను అర్థంచేసుకో జాలక గోవిందుడు దేశంనలుమూలలు తిరిగి ప్రతివానిని "నీ అనుభవం ఏమిటి ? నీ సిద్ధాంతం ఏమిటి ? నీవు బోధించేది ఏమిటి ?" అని అడుగుతాడు. అందుకే సిద్ధార్థునికి గోవిందునికి విడిపోవక తప్పలేదు. సిద్ధార్థుడు బుద్ధునివద్ద శెలవు తీసుకుంటూ "మీరు ఉత్తమ పురుషులనీ, మీ బోధ ఉత్తమమైందనీ నాకు తెలుసు. కాని వాటిని మించినది మీ అనుభవం. అలాంటి అనుభవం కలిగేవరకు మీ బోధలను స్వీకరించి నాకు ప్రయోజనం వుండదు. అలాంటి అనుభవాన్ని అన్వేషిస్తూ వెళ్ళుతాను."

అన్నాడు. చివరకు వాసుదేవుని సహచర్యంతో సిద్ధార్థుడు లోచూపు వల్ల అలాంటి అనుభవాన్ని పొందాడు.

అసంతృప్తభావంనుంచి అంతిమసిద్ధిలోపుగా సిద్ధార్థుని జీవితంలో కొన్ని సంఘటనలు జరిగినవి. అవి అతని ఆత్మవికాసానికి ఉపకరించినవా ? ఆధ్యాత్మికానుభూతికి పాత్రుడలాడే వ్యక్తి ఇంద్రియ భోగాలకు లోనైనట్టు చిత్రించడంలో అర్థమేమిటి ? శ్రమణుడుగా వుండిన సిద్ధార్థుడు వేశ్యాలంపటుడైనాడు. ధనం ఆర్జించాడు. జూదాలకు దిగాడు. తపోవృత్తిని అభ్యసించినవ్యక్తి ఈలాంటి పాపాలను ఏలాగు చేయగలిగాడు ?

ఈ దీర్ఘయాత్రలో అతనిని ముందుకు నడిపినవి అతని పాపాలే. అతడు సంసారసముద్రంలో ఈదులాడుతున్నా దానిలో మునిగిపోలేదు. అతని మనోవృత్తులను అంటకుండా దూరంగా నిల్చున్న వస్తు వేదో అతనిలో వున్నది. దానినే సాక్షీభావం అంటారు. కామభోగాలలో చిక్కుకున్న కాలంలో వాటికిగ్రింద అణిగిపోకుండా అతనిలో ఏదో దూరంగా నిల్చొని వేచివుండేది. అతడు పూర్తిగా లోబడిపొయ్యే వేళకు మాయతెరను చీల్చుకుని లోపలనుంచి ఒక వెలుగు బైటికి వచ్చేది. అది కేవలం భావకల్పనకాదు. సాక్షీభూతంగా ప్రతీక్షిస్తూ వున్న ఆత్మపరిపాకస్థితి అది. తపస్సులతోనూ, పుణ్యాసంపాదనతోనూ సతమత మవుతూ వుండిన అతని అహంతయొక్క సంక్షోభం అంతరించింది. పరమానుగ్రహం అవతరించింది. అతడు నిత్య శిశువుగా పునర్జన్మ ఎత్తాడు. సత్యమాధుర్యాన్ని రుచిచూచి పరవశుడైనాడు. అతనికి కర్మక్షయం అయింది. పుణ్యపాపాలతోపాటు అతని అహంత భస్మీభూతమైంది.

సిద్ధార్థుడు పరమార్థాన్ని తెలుసుకున్నాడనడానికి వేరేప్రమాణం అక్కరలేదు. ప్రథమదశలో ప్రణవోపాసన అతనిసాధనకు సహకారిగా వుండేది. పక్వదశలో అన్నినాదాలు ప్రణవంలో లీనమై పోయినవి. అన్నిపదార్థాలలో ఓంకారనాదమే వినిపించింది. "ఈ ప్రపంచం ప్రపంచమేకాదు. బ్రహ్మపదార్థంకూడ" అంటాడు. ప్రపంచం మాయ అనడం అహంకారదృష్టి. అహంకారంకూడా మాయాకల్పితమే.

మన హృదయగర్భంలో పూడి వున్న అమూల్యనిక్షేపాన్ని పరమానందాన్ని వెదికి పట్టుకోగల మార్గాన్ని ఈ గ్రంథం ప్రదర్శిస్తున్నది. పరిశోధనాత్మకమైన కథలోని చమత్కార మంతా ఈ గ్రంథంలో కుదురు కున్నది. ఈ గ్రంథం పరిమాణాన్నిబట్టి చిన్నదైనా అర్థ మూల్యాన్ని బట్టి గొప్పది.

ఈ గ్రంథాన్ని శ్రీ బెల్లంకొండ రాఘవరావుగారు తెలుగుభాష లోనికి అనువదించి ఆంధ్రపాఠకలోకం కృతజ్ఞతకు పాత్రులైనారు. ఈలాంటి సద్గ్రంథాలను ప్రచురించి స్వల్ప మూల్యానికి అందజేసే కృషిని ప్రోత్సహిస్తూ తగు సహాయం కావిస్తూ వున్న దక్షిణ భాషా పుస్తకసంస్థ నిర్వాహకులకు మన కృతజ్ఞత తెలపక తప్పదు. వేలకొలదిగా పాఠకులు ఈ గ్రంథాన్ని కొని చదవడం వారి కనీసధర్మం. అందుమూలంగా అనువాదకులయెడలను, ప్రచురణ కర్తల యెడలను, ప్రోత్సాహకుల యెడలను తమ కృతజ్ఞతను తెలపడమే కాక, స్వయముగా ఆత్మవికాసాన్ని కూడా సంపాదించుకో గలరు.

కె. స్వామినాథన్



# 1. బ్రాహ్మణ కుమారులు



బ్రాహ్మణ కుమారులు సిద్ధార్థుడు గోవిందుడు కూడా పెరుగుతున్నారు. ఇంటిపట్టున, ఏటివొడ్డున, అడవులలో, అశ్వద్థవృక్షంక్రింద ఎక్కడవున్నా ఇద్దరు మైత్రితో కలసి మెలసి తిరిగేవారు. నదీస్నానాలవల్లనూ, అనుష్ఠానాల వల్లనూ, అగ్నిహోత్రాది కర్మలవల్లనూ సిద్ధార్థుని సుకుమారశరీరం కొంచెం నల్లపడింది.

ఇంటిలో తల్లి పాటలు పాడుతూ వుండేది. తండ్రి పండితులతో తర్కవాదాలు జరుపుతూ వుండేవాడు. మామిడితోటలో ఆడుకొంటూ వున్న సిద్ధార్థుని కళ్ళ ముందు నీడలు మసలుతూ వుండేవి. సిద్ధార్థుడు పండిత గోష్ఠులలో పాల్గొన్నాడు. గోవిందునితో వాద ప్రతి వాదాలు జరిపాడు. అతనితో కలిసి ధ్యానధారణలు అభ్యసించాడు. మౌనంగా ఓంకారోచ్చారణ చేయడం అతనికి తెలుసును. ప్రణవాన్ని ప్రాణాయామంతో అనుసంధానం చేసినప్పుడు అతని ముఖంలో ఆధ్యాత్మికతేజస్సు తాండ

వించేది. అనశ్వరమైన విశ్వవ్యాప్తమైన ఆత్మను తన హృదయంలో దర్శించడం ఏలాగో ఆతనికి తెలుసును.

కుమారుడు తెలివిగలవాడనీ, జ్ఞానతృష్ణ గలవాడనీ తండ్రి ఆనందించేవాడు. గొప్ప పండితుడు, యాజ్ఞికుడు, బ్రాహ్మణులలో శ్రేష్ఠుడు కాగలడని ఆయన ఆశ. సిద్ధార్థుడు కూర్చున్నా లేచినా అతని శరీరసౌష్ఠవాన్ని, సౌకుమార్యాన్ని చూచి తల్లి గర్వించేది. సిద్ధార్థుడు నగరవీధులలో తిరుగుతూ వుండగా అతని విశాలఫాలంలోనూ వెడదకన్నులలోనూ రాచఠీవిని చూచిన బ్రాహ్మణకన్యలు లోలోపల ప్రణయస్పందన పొందేవారు.

గోవిందునికి సిద్ధార్థునియెడల అనన్యమైన ప్రేమ. అతని చూపులను, స్వచ్ఛోచ్చారణను, నడకలోని ఒయ్యారాన్ని మరీ ప్రేమించేవాడు. సిద్ధార్థుడు ఏమిచేసినా, ఏమి చెప్పినా అతని బుద్ధిబలానికి, భావనాశీల్యానికి, దృఢ సంకల్పానికి, ఉదాత్తప్రవృత్తికి గోవిందుడు మిక్కిలి మురుసుకొనేవాడు. సిద్ధార్థుడు సామాన్యబ్రాహ్మణునివలె యాజ్ఞికవృత్తితో మాంద్యంగా కాలం గడుపుతూ, మంత్ర తంత్రాలతో ధనార్జన చేసుకుంటూ, పనికిమాలిన మాటల పసతో గర్విస్తూ, ఒక కపటపురోహితునిలాగా, మందలోని గొర్రెలమాదిరి కాబోడని గోవిందుడు గ్రహించాడు. తానైనా ఆ మూకలో ఒకడుగా వుండడం గోవిందునికి సమ్మతంకాదు. తన కిష్టుడు పరమోత్తముడు అయిన సిద్ధార్థుని అనుసరించి వుండాలని అతని వాంఛ. ఏనాటికైనా సిద్ధార్థునికి దివ్యత్వం సిద్ధించినప్పుడు అతని అనుచరుడు

గాను, సేవకుడుగాను, అతని నీడగాను వెన్నంటి వుండాలని గోవిందుని సంకల్పం. అందరూ సిద్ధార్థుని ఈ విధంగానే ప్రేమించేవారు. అందరికీ అతడు ఆనందాన్ని కల్పించే వాడు.

కాని సిద్ధార్థునికిమాత్రం సుఖమంటూ లేదు. వృక్ష చ్ఛాయలలో సంచరించేవాడు. ధ్యాననిమగ్నుడై, తోటలో కూర్చునేవాడు. స్నానజపాగ్నిహోత్ర కర్మలను యథా విధిగా నిర్వర్తించేవాడు. అందరికి అతనిని చూస్తే మహా ప్రీతిగా వుండేది. కాని, అతనిమనస్సుకు ఆనందం లేదు. ఆ యేటితరగలవెంట, మినుకు మినుకు మనే నక్షత్రాల నుంచి, సూర్యుని కిరణాలతోను ఏవో కలలు, కలవరపెట్టే భావాలు అతనిలోకి అవతరిస్తూ వుండేవి. యజ్ఞవేదికలోని పొగలనుంచి, ఋగ్వేదమంత్రాలనుంచి, వృద్ధబ్రాహ్మణుల బోధలనుంచి వెడలివచ్చి, ఈ కలలు ఈ కలవరము అతని ఆత్మను ఆవరించేవి.

తనలోని అసంతృప్తిబీజాలను సిద్ధార్థుడు గ్రహించ నారంభించాడు. పితరులప్రేమ కాని, స్నేహితుడైన గోవిందుని కూరిమి కాని తనకు సర్వదా సౌఖ్యప్రదములు కావనీ, శాంతిని సంతృప్తిని కూర్చజాలవనీ అతనికి తెలిసి వస్తున్నది. తనతండ్రి, తనగురువులు బ్రాహ్మణులు తా మెరిగిన జ్ఞానసారాన్ని యావత్తు అదివరకే తనకు అందజేశారనీ దానితో తనఆత్మకు శాంతి సంతృప్తి కలుగలేదనీ సందేహం అతనిని పీడిస్తున్నది. స్నానాదులు మంచివే. కాని, అవి పాపాలను కడిగివేయడానికి, మనోవ్యథను మాన్పడానికీ

ఉపకరించడం లేదు. అగ్నిహోత్రాలు, దేవపూజలు మంచివే. కాని అవే పరమార్థములా ? యజ్ఞయాగాల వల్ల సుఖం కలుగుతున్నదా ? ఇక దేవతల విషయమో ! యథార్థంగా ప్రపంచాన్ని సృష్టించింది ప్రజాపతియేనా ? పరమాత్మకాదా ? నీవలెను నావలెను ఈ దేవతలుకూడా సృష్టించబడినవారు. నశించిపోయేవారు కారా ? కాగా, ఈ దేవతలకోసం యజ్ఞాలు చేయడం వివేకమా ? పూజార్హుడు పరమాత్మ ఒక్కడేకదా !

అయితే ఆత్మవస్తువు ఎక్కడ దొరుకుతుంది ? అది ఎక్కడ వుంటుంది ? ప్రతి జీవిలోనూ నాశనంలేని ఆత్మపదార్థం వున్నది కాదా ? జీవుడు ఎక్కడ ఉన్నాడు ? ఈశరీరము, మనస్సు, బుద్ధి ఇవి జీవుడు కాదంటారు పెద్దలు. అయితే జీవుడు ఎక్కడ వున్నట్లు ! జీవునిలో ఆత్మను తెలుసుకోవడానికి అన్వేషించ తగినమార్గం వేరొకటి ఉన్నదా ? ఆ మార్గాన్ని చూపగలవాడు తెలిసినవాడు ఒక్కడూ లేడే!. తన తండ్రి, గురువులు, పెద్దలు, మంత్రతంత్రాలు, ఎవ్వరూ ఏవీ అందుకు పనికిరావడం లేదు. ప్రపంచసృష్టిక్రమమూ, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపారములూ, ఉచ్ఛ్వాస నిశ్వాసగతులూ, దేవతలూ ఇవన్నీ ఇంకా ఎన్నో విషయాలు బ్రాహ్మణులకు తెలునును. ఇవన్నీ వారి పవిత్ర గ్రంథాలలో వున్నవి. అసలు ముఖ్యవిషయం తెలియకుండా ఎన్ని విషయాలు తెలిసి ఏమి ప్రయోజనం ?

ఈ పవిత్రగ్రంథాలలో ఎన్నో మంత్రాలు – ముఖ్యంగా సామవేదానికి చెందిన ఉపనిషత్తులు – ఈ లోపలి

వస్తువును గూర్చి ప్రతిపాదిస్తున్నవి. ''ఈ ప్రపంచమంతా నీ ఆత్మ'' అని వున్నది. సుషుప్తిలో జీవుడు ఆత్మనిష్ఠుడై వుంటాడని వున్నది. ఆ మంత్రాలలో ఆశ్చర్యకర మైన విజ్ఞానం వున్నది. ఋషులు తమ విజ్ఞానాన్ని యావత్తు మధుమధుర మైన మనోహరభాషలో వర్ణించారు. ఈ బ్రాహ్మణవిద్వాంసులు యుగయుగాల నుంచి సేకరిస్తూ కాపాడుకొని వచ్చిన మహనీయ విజ్ఞానసంచయం ఉపేక్షించ తగింది కాదు. కాని, ఈ విజ్ఞానాన్ని కూడబెట్టడంతోపాటు అనుభవంలోకి తెచ్చుకొన్న బ్రాహ్మణులు, గురువులు, పండితులు ఎక్కడ వున్నారు? సుషుప్తిలో ఆత్మానుభవం కలదని చెపుతూ తమ చైతన్యములోనూ, జీవితంలోనూ వాక్కాయములందునూ దానిని నిలుపుకో గలిగిన సిద్ధులెక్కడ?

సిద్ధార్థుడు బ్రాహ్మణశ్రేష్ఠులను ఎందరినో చూచాడు. అందులో తన తండ్రి మహావిజ్ఞాని. ఉత్తమోత్తముడు - ప్రశంసనీయుడు - అతని జీవితం పవిత్ర మైనది - అతని వాక్కు వివేకపూరిత మైంది - అతని భావాలు ఉదార గంభీరము లైనవి. ఇంత తెలిసిన అతనికైనా ఆనందమూ శాంతీ కలిగినవా? ఇంకా జిజ్ఞాసువుగానే వ్యవహరిస్తున్నాడే! తెంపులేకుండా పుణ్యతీర్థములలో మునుగుతున్నాడు. యజ్ఞాలు చేస్తున్నాడు. బ్రాహ్మణుల ప్రవచనాలను వింటున్నాడు. అంతటి నిష్కల్మషునికి ఆ నిత్య స్నానా లెందుకు? ఆత్మవస్తువు అతని హృదయకోశంలో లేదా? కాబట్టి అసలు మూలం లోపల ఎక్కడ వున్నదో

తెలుసుకోవాలి. దానిని నిత్యసిద్ధంగా నిలుపుకోవాలి. తక్కిన అన్వేషణ అంతా వృథా! సిద్ధార్థుని భావాలు ఈ పంథాలో వున్నవి. అదే అతని తృష్ణ. అదే అతని విచారం.

సిద్ధార్థుడు పెక్కు తడవలు ఛాందోగ్యోపనిషత్తును అధ్యయనం చేశాడు. "సత్యమే బ్రహ్మ – దానిని ఎరిగిన వాడు ప్రతి దినము పరమపదంలో ప్రవేశిస్తాడు" అని అందులో వున్నది. అతనికి ఆ పరమపదం ఎన్ని సారులో అందినట్లే తోస్తుంది కాని అందదు. ఏ నాటికీ ఆ చరమతృష్ణ తీరిందికాదు. అతనికి తెలిసిన పండితులవల్ల గాని, అతడు విన్న బోధలవల్ల గాని పరమపదార్థాన్ని గూర్చిన నిత్యతృష్ణ తీరకుండానే నిలిచివుంది.

"గోవిందా! నా వెంట వటవృక్షంవద్దకు రా–ధ్యానం చేసుకుందాము" అని సిద్ధార్థుడు పిలిచాడు – ఇద్దరు వెళ్ళి వటవృక్షంక్రింద కూర్చున్నారు. సిద్ధార్థుడు ఓంకారోచ్చారణకు ముందు ఒక మంత్రం పఠించాడు. దాని భావం ఇది:—

'ఓంకారము ధనువు – ఆత్మ బాణము
లక్ష్యము బ్రహ్మము–నిస్సంకోచముగా లక్ష్యముపై
బాణమును ప్రయోగించాలి"—

గోవిందుడు ధ్యానాన్ని ముగించి లేచాడు. అస్తమయం కావస్తున్నది. అది సంధ్యావందనం చేయవలసిన కాలం. సిద్ధార్థుని పిలిచాడు. జవాబు లేదు. సిద్ధార్థుడు ధ్యాన నిమగ్నుడై వున్నాడు. అతని చూపులు ఏదో దూర లక్ష్యాన్ని చూస్తున్నట్లుగా వున్నవి. ఊపిరికదలిక కూడా

కనబడడం లేదు. ప్రణవం ధనుస్సుగాను తన ఆత్మ బాణం గాను, బ్రహ్మము లక్ష్యంగాను భావిస్తూ ధ్యానపరవశుడై ఆవిధంగానే కూర్చున్నాడు.

ఒకప్పుడు ముగ్గురు శ్రమణులు ఆ నగరానికి వచ్చారు. వారు దేశాలవెంట తిరిగే సన్యాసులు – చిక్కిపోయి శల్య మాత్రంగా వున్నారు. నడివయసులో వున్నారు. దేహాలు దుమ్ము క్రమ్ముకొని వున్నవి. దాదాపు దిగంబరులనవచ్చు– ఎండవేడిమికి దేహాలు కమిలిపోయినవి. వారికి ఒకరితో సంబంధం లేదు. స్వాంతసుఖాన్ని దుఃఖాన్ని పాటించని నిర్దాక్షిణ్య వైరాగ్యం వారిది.

ఆ సాయంత్రం ధ్యానం ముగించిన తరువాత సిద్ధార్థుడు గోవిందునితో అన్నాడు: 'రేపుప్రొద్దున సిద్ధార్థుడు శ్రమణులలో కలవబోతున్నాడు. అతడు కూడా శ్రమణుడు కాబోతున్నాడు'–అని.

ఆ మాటలు విని గోవిందుడు వెలవెల బోయినాడు. ధనుర్ముక్తబాణం వలె ఏకలక్ష్యలగ్న మైన సిద్ధార్థుని నిశ్చిత సంకల్పం అతనిముఖంలో గోచరిస్తున్నది. సిద్ధార్థుని జీవిత లక్ష్యసాధనకు ప్రారంభసమయం వచ్చినట్టు అతని ముఖ వైఖరినిబట్టి గోవిందుడు నిర్ణయించుకున్నాడు– సిద్ధార్థుడు ఆత్మపథంలో అడుగుపెట్టాడు– అతని భవితవ్యమున్నూ, దానితోపాటు తన భవితవ్యమున్నూ రూపొందే కాలం వచ్చింది.

'సిద్ధార్థా! నీ తండ్రి దీనికి ఒప్పుకుంటాడా?' అన్నాడు గోవిందుడు. సిద్ధార్థుడు అప్పుడే మేలుకున్నట్టు గోవిందుని

వైపు చూచాడు— అతని మనసులోని ఆందోళనను, ఓర్మిని వెంటనే గ్రహించాడు.

'గోవిందా! మనకు మాటలతో పనిలేదు. తెల్లవారగానే నేను శ్రమణ జీవితాన్ని ప్రారంభిస్తాను. ఆ విషయమై మనము తిరిగి చర్చించవద్దు.' అన్నాడు సిద్ధార్థుడు.

సిద్ధార్థుడు తనతండ్రిగదిలోకి వెళ్ళాడు. ఆయన చాపమీద కూర్చొని వున్నాడు. ఆయన తిరిగిచూచేవరకు వెనక నిల్చున్నాడు. తిరిగిచూచి: 'నీవా! సిద్ధార్థా! నీ ఆలోచన ఏమో చెప్పు' అన్నాడు ఆ బ్రాహ్మణుడు.

'నాన్నా! మీ అనుమతితో రేపు ఈ గృహాన్ని వదిలి, సన్యాసులలో చేర దలచాను. ఆ సంగతి మీతో చెప్పడానికి వచ్చాను. శ్రమణుడను కావాలని వుంది నాకు. మీరు అభ్యంతర పెట్ట రని నా నమ్మకం.'

చిన్న గవాక్షముగుండా తొంగిచూస్తున్న నక్షత్రాలు దాటిపోయేవరకు ఆ బ్రాహ్మణుడు మౌనంగా కూర్చున్నాడు. కొడుకుకూడా చేతులుకట్టుకొని, చలనం లేకుండా నిల్చున్నాడు. నక్షత్రాలు దాటిపోయినవి. 'తీవ్రతను కోపాన్ని ప్రకటించడం బ్రాహ్మణుడైనవానికి ఉచితం కాదు. కాని, నా మనస్సుకు సంతోషం కలిగించేది కాదు నీ కోరిక. ఈ మాట నీ నోటినుంచి ఇంకొకసారి వినడం నాకు సమ్మతం కాదు.' అన్నాడు తండ్రి.

బ్రాహ్మణుడు నెమ్మదిగా లేచి నిల్చున్నాడు. సిద్ధార్థుడు చేతులుకట్టుకొని అలాగే వున్నాడు.

'దేనికి నిల్చున్నావు?' అన్నాడు తండ్రి.

'మీకే తెలుసును' అన్నాడు సిద్ధార్థుడు.

ఆ బ్రాహ్మణుడు అసంతుష్టితో గదిలోనుంచి వెళ్ళిపోయి, పక్కమీద పండుకున్నాడు.

ఒకగంట గడిచింది. ఆయనకు కన్ను మూతపడలేదు. పక్కమీదినుంచి లేచి, అటూ ఇటూ తిరిగి బైటికి వెళ్ళాడు. గవాక్షంలోగుండా గదిలోకి చూచాడు. సిద్ధార్థుడు అలాగే చేతులు కట్టుకొని చలనం లేకుండా నిలబడి వున్నాడు. ఆయన మనసుకు కష్టంవేసి మళ్ళా పక్కమీంద పండుకున్నాడు.

ఇంకొకగంట గడిచింది. బ్రాహ్మణునికి నిద్రపట్ట లేదు. తిరిగి లేచాడు. అటూ ఇటూ తిరిగాడు. బైటికి వెళ్ళాడు. చంద్రోదయమైంది. తిరిగి గవాక్షంలో నుంచి చూచాడు. చలించకుండా చేతులు కట్టుకొని అలాగే వున్నాడు సిద్ధార్థుడు. చంద్రకిరణాలు ఆతనిమీద పడుతున్నవి. బ్రాహ్మణుడు మనసులో బాధపడుతూ మళ్ళా వెళ్ళి పక్కమీద పండుకున్నాడు.

మళ్ళా ఒకగంట దాటగానే బైటికి వచ్చాడు. మళ్ళా రెండు గంటలు గడచిన తరువాత గవాక్షంలోగుండా చూచాడు. కొంతవెన్నెలవెలుగూ, కొంత నక్షత్రాలకాంతి, కొంత చీకటీ మీద పడుతూ సిద్ధార్థుడు అక్కడే నిలబడివున్నాడు. ఆ విధంగానే గంటగంటకు గదిలోకి తొంగి చూచాడు. కొడుకు అలాగే కదలకుండా

వున్నాను. తండ్రికి కోపము విచారము భయము దుఃఖము మనసులో నిండుకున్నవి.

తెల్లవార వస్తున్నది. బ్రాహ్మణుడు గదిలోకి వెళ్ళాడు. కొడుకు అలాగే నిల్చుని వున్నాడు. పొడుగు పెరిగి నట్టుగా, కొత్తవానిగా కనిపించాడు తండ్రికన్నులకు.

"సిద్ధార్థా! దేనికి నిలబడి వున్నావు?" అన్నాడు తండ్రి.

"మీకే తెలుసును"

"ప్రొద్దుగూకులు అలాగే నిలబడి వుంటావా ?"

"ఈలాగే ప్రతీక్షిస్తూ నిల్చుంటాను"

"సిద్ధార్థా ! నీవు అలసిపోతావు"

"అవును అలసిపోతాను"

"సిద్ధార్థా ! నీకు నిద్ర వస్తుంది"

"నాకు నిద్ర రాదు"

"సిద్ధార్థా ! నీవు చచ్చిపోతావు"

"అవును, చచ్చిపోతాను"

"నీ తండ్రికి విధేయత చూపడంకన్నా మరణమే సమ్మతమా ?"

"ఎప్పుడూ తండ్రికి విధేయుడుగానే వున్నాడు సిద్ధార్థుడు"

"అయితే నీ ప్రయత్నం మానుకుంటావన్న మాట"

"తండ్రి ఏమి చెప్పితే అది చేస్తాడు సిద్ధార్థుడు"

ఉదయకిరణాలు గదిలోకి ప్రవేశించినవి. సిద్ధార్థుని పాదాలు స్వల్పంగా కంపిస్తున్నవి. కాని, అతనిముఖంలో కంపం కలగలేదు. అతని కన్నులు ఎక్కడనో దూర లక్ష్యాన్ని చూస్తున్నవి. సిద్ధార్థుడు తనతోపాటు గృహంలో ఉండనేరడని తండ్రి గ్రహించాడు. అతడు అదివరకే తనను వదలి పెట్టాడనికూడా గ్రహించాడు.

తండ్రి సిద్ధార్థుని వీపు తట్టాడు.

"సిద్ధార్థా! అలాగే అడవికి వెళ్లు. శ్రమణులలో చేరు. అడవిలో నీకు ఆనందం లభిస్తే తిరిగి వచ్చి నాకు బోధించు. నీ అన్వేషణ విఫలమైనా తిరిగి రా. ఇద్దరము కలిసి దేవతలకు యజ్ఞహవిస్సులు సమర్పింతాము. వెళ్లు. ఎక్కడికి వెళ్ళేది మీ అమ్మతో చెప్పి వెళ్ళు. నదికివెళ్ళి అనుష్ఠానం చేసుకోవలసిన సమయమైంది నాకు" అన్నాడు.

కొడుకు బుజముమీదినుంచి చేయితీసి, తండ్రి నదివైపు వెళ్ళాడు, సిద్ధార్థుడు నడవబోతూ తణికాడు. నిగ్రహించుకున్నాడు. తండ్రికి నమస్కరించాడు. తల్లితో తన నిష్క్రమణం చెప్పడానికి వెళ్ళాడు.

తిమ్మిరిపట్టిన కాళ్లను ఈడ్చుకుంటూ నడుస్తున్నాడు. ఇంకా నగరం మేలుకోలేదు. చివరిగుడిసె నుంచి నక్కివున్న మనిషినీడ వెలుపలికి వచ్చింది. అతడు గోవిందుడు.

"వచ్చావా" అని సిద్ధార్థుడు చిరునవ్వు నవ్వాడు.

"వచ్చాను" అన్నాడు గోవిందుడు.



# 2. శ్రమణులతో సాధన



ఆ నాడు సాయంత్రానికి వారు శ్రమణులను కలుసుకున్నారు. తమతో చేర్చుకొమ్మని వారిని ప్రార్థించారు. అందుకు శ్రమణులు అంగీకరించారు.

సిద్ధార్థుడు ఒక పేదబ్రాహ్మణునికి తన వస్త్రాలను దానం చేశాడు. తన కొల్లాయిని, కావిరంగు పైపంచను మాత్రం దగ్గర వుంచుకున్నాడు. ఒంటిపూట భోజనం ప్రారంభించాడు. సొంతంగా అన్నం వండుకోడు. ముందు ఒక పక్షము, తరువాత ఒక మాసము ఉపవాసం చేశాడు. దేహంలో కండలు కరిగిపోయినవి. గడ్డం పెరిగింది. గోళ్లు పెరిగినవి. అతని విస్ఫారనేత్రాలలో ఏవో విచిత్రస్వప్నాలు తారాడుతున్నట్టుగా వుండేవి. స్త్రీలముందు అతని చూపు మొద్దుబారింది. నగరవీధులలో నడుస్తూ మంచి దుస్తులను ధరించినవారిని చూచి ఏవగించుకునేవాడు. వ్యాపారాలు చేసుకునే వర్తకులను, వేటలకు వెళ్ళే రాజకుమారులను, మృతులకోసం దుఃఖించే బంధుగులను, దేహాలను అర్పించే

వేశ్యలను, రోగులకు చికిత్సలుచేసే వైద్యులను, కర్షకులకు ముహూర్తాలుపెట్టే పురోహితులను, ప్రేమికులైన యువతీ యువకులను, బిడ్డలను సముదాయించుకునే తల్లులను, ఎవరినీ కన్నెత్తి చూచేవాడుకాడు. వారు లెక్కపెట్టతగినవారు కారని అతని భావం. సుఖము, సౌందర్యము అంతా అసత్యం. అంతా ఇంద్రియ భ్రాంతి. అతనికి ప్రపంచం మీద పూర్తిగా వెగట కలిగింది. జీవితం దుఃఖమయంగా తోచింది.

సిద్ధార్థునికి ఒకటే లక్ష్యం. తృష్ణలు, వాంఛలు, సుఖ దుఃఖాలు అన్నిటినీ సమూలంగా తుడిచివేయాలి. అహంకారాన్ని చంపివేయాలి. అహం అన్నది లేకుండా శూన్య హృదయంలో శాంతిని చవిచూడాలి. అదే అతని లక్ష్యం. అహంత నశించిన తరువాత, అన్ని వాంఛలు మాటుమణగినతరువాత, అహంత కానిది లోపల ఎక్కడో వుండేది ఆ చరమవస్తువు మేలుకోవాలి. అదే పరమగుహ్యాపదార్థం.

సిద్ధార్థుడు మౌనంగా మండుటెండలలో నిల్చునేవాడు. బాధవేస్తున్నా నాలుక పిడచకట్టినా ఆ బాధ ఆ దాహం అణిగిపోయేవరకు ఆలాగే నిల్చునేవాడు. మౌనంగా వానలో నిల్చునేవాడు. దేహం కొయ్యబారే టంతవరకు ఆలాగే నిల్చునేవాడు. ముళ్ళకంపలమీద పండుకునేవాడు. ఒళ్లంతా నెత్తురు, పుండ్లు. ఆ బాధ తెలియకుండా పోయే టంతవరకు ఆలాగే పండుకునేవాడు.

సిద్ధార్థుడు ఆసనంలో కూర్చొని, ప్రాణాయామం అభ్యసించాడు. కుంభకాన్ని సాధించాడు. **హృదయ** స్పందాన్ని నిగ్రహించ గలిగాడు.

శ్రమణగురువు శిక్షణక్రింద సిద్ధార్థుడు యమనియమాలను సాధన చేశాడు. నారాయణపక్షి ఒకటి చెట్టు మీద వాలింది. సిద్ధార్థుడు ఆ పక్షిశరీరంలో ప్రవేశించాడు. అనగా దానితో తాదాత్మ్యం పొందాడు. పక్షిగా అడవులలో పర్వతాలపైన సంచరించాడు. దాని ఆహారం తిన్నాడు. దాని బ్రతుకు బ్రతికాడు. పక్షితో మరణించాడు. ఒక నక్కశవంలో ప్రవేశించాడు. ఆ శవాన్ని శివంగులు, రాబందులు పీక్కొని తిన్నవి. సిద్ధార్థుడు మళ్ళా తన కళేబరంలో చేరాడు.

సిద్ధార్థుడు తన ఇంద్రియాలను స్మృతిని చంపుకున్నాడు. రాయి, చెట్టు, జంతువు ఒకటేమి? వేయి రూపాలతో తాదాత్మ్యం పొందాడు. కాని ప్రతి పర్యాయం తన కట్టు కంబానికి తిరిగి వచ్చేవాడు. తిరిగి తన అహంత సిద్ధంగా వుండేది. ప్రతి అనుభవంలోనూ తృష్ణ వుండేది. ఒక తృష్ణ తరువాత వేరొకతృష్ణ. ఒకదానిని జయిస్తే వేరొకటి సిద్ధం.

ఈ జననమరణచక్రంలో నుంచి తప్పించుకొని దుఃఖరహితమైన శాశ్వతస్థితిని పొందడం ఏలాగు? ఈ చక్ర భ్రమణం ముగియడం ఏలాగు? దీనికి కారణమైన కర్మశృంఖల విచ్ఛిన్నం కావడం ఏలాగు? ఆ పరమోపాయం కోసమే సిద్ధార్థుని అన్వేషణ.

అహంతను నాశనం చేయగల ఉపాయాలను సిద్ధార్థుడు తెలుసుకున్నాడు. ఆకలిని దప్పిని అలసటను అన్ని బాధలను అనుభవించాడు. సహించాడు. జయించాడు. ధ్యాన మార్గంలో మనస్సును నిర్విషయంగా చేసుకున్నాడు. ఒక

వేయిమారులు అతని అహంత అస్తమించింది. దినాలతరబడి జడావస్థలో వున్నాడు. కాని ఏ సాధనచేసినా అది తిరిగి అహంతవద్దకే తీసుకొని వచ్చేది. అహంతావరణ సహస్రపర్యాయాలు తొలిగించుకున్నా తిరిగి తిరిగి సిద్ధమయ్యేది. తాను ఆ సిద్ధార్థుడుగానే మిగిలేవాడు.

సిద్ధార్థుని వెంటనేవున్నాడు గోవిందుడు. ఆ సాధనలన్నీ గోవిందుడుకూడా అభ్యసించాడు. తమ సాధనల విషయం తప్ప వేరొకవిషయాన్ని వారు సంభాషించేవారు కారు. పరిసరగ్రామాలకు వెళ్లి తమకు తమగురువులకు భిక్షాన్నం తెచ్చుకునేవారు.

ఒకనాడు సిద్ధార్థుడు "గోవిందా! మనము లక్ష్యాన్ని చేరుతున్నట్టా? ఇంకా దూరంలో వున్నట్టా? అని అడిగాడు.

"మన సాధన కొంతవరకు సాగింది. ఇంకా శ్రమపడాలి. సిద్ధార్థా! నీవు గొప్ప శ్రమణుడవు కాగలవు. ప్రతిసాధనలోను నీకు త్వరగా సిద్ధి కలుగుతున్నది. గురువులు నిన్ను చాలా మెచ్చుకుంటున్నారు. నీవు సిద్ధుడవయ్యేకాలం తప్పక వస్తుంది" అన్నాడు గోవిందుడు.

సిద్ధార్థుడు: "నాకు ఆ విధంగా తోచడంలేదు. ఇంతవరకు శ్రమణులవద్ద నాకు కలిగిన జ్ఞానం ఒకవేశ్యవద్ద, ఒక శవవాహకునివద్ద, ఒక జూదరి వద్ద ఇంకా సులభంగా త్వరగా లభించి వుండేది".

గోవిందుడు: "నీవు పరిహాసంకోసం అలా అంటున్నావు. ఈ యమ నియమ ప్రాణాయామ ధ్యానములు ఆ దుష్టుల సంపర్కంతో నేర్చుకొనివుందువా?"

సిద్ధార్థుడు : "ఏమి ప్రాణాయామము? ఏమి ధ్యానము? ఇవన్నీ తాత్కాలికంగా అహంతనుంచి తప్పించుకోడానికే ఉపకరిస్తవి. బ్రతుకులో దుఃఖాన్ని, దోషాన్ని పరిహరించడానికి ఇవన్నీ తాత్కాలికచికిత్సలు. కర్షకుడు ప్రొద్దున తరవాణి త్రాగుతాడు. కొంతకాలం వరకు అతనికి శ్రమ అనిపించదు. అతనికి తరవాణి ఏలాగో, నీకు నాకు అలాగే ఈ సాధనల ఫలితం తాత్కాలికం".

గోవిందుడు : "సిద్ధార్థా! నీవు కర్షకుడవు కావు. శ్రమణుడు త్రాగుబోతు కాడు. త్రాగుబోతుకు ఆ నిషా వున్నంత వరకు కష్టం కనుపించకపోయినా, మైకం వదలిన తరువాత అంతా యథాపూర్వంగానే వుంటుంది. అతనికి వివేకం కలిగినట్లా? జ్ఞానం లభించినట్లా? ఉన్నతస్థితికి పోయినట్లా? ముందెంతో తరువాత కూడా అంతే!"

సిద్ధార్థుడు : "మిత్రమా! ఎప్పుడూ నేను త్రాగిన వాడనుకాను. కర్షకుని అనుభవం నాకు తెలియదు. కాని నా మట్టుకు నాకు ఆ ధ్యానంలో వున్నప్పుడు క్షణకాలవిరామం తప్ప తరువాత ఆ సిద్ధావస్థకు గర్భస్థశిశువు ఎంతదూరంలో వుంటాడో నేనూ అంతే నని మాత్రం నాకు తెలుసును."

తరువాత ఒకనాడు సిద్ధార్థుడు గోవిందుడు భిక్షాటనకు ప్రక్కగ్రామానికి వెళ్ళుతున్నారు. సిద్ధార్థుడు అన్నాడు : "గోవిందా! మన సాధన క్రమమైనదేనా? మనకు జ్ఞానసిద్ధికలుగుతున్నదా? మనం ముక్తికి సమీపిస్తున్నామా? లేక ఈ చక్రభ్రమణంలో నుంచి తప్పించుకోవాలను కుంటూనే ప్రదక్షిణాలు చేస్తున్నామా?"

గోవిందుడు : "సిద్ధార్థా! మనం ఎంతో నేర్చుకున్నాము. ఇంకా ఎంతో నేర్చుకోవాలి. మనము ప్రదక్షిణాలు చేయడం లేదు. ముందుకే పోతున్నాము. సోపానక్రమమైనది మన సాధన. ఇదివరకే మనం ఎన్నో మెట్లు ఎక్కాము."

సిద్ధార్థుడు : "మన వృద్ధాచార్యుల వయస్సు ఎంత వుండ వచ్చు?"

గోవిందుడు : "దాదాపు అరవై వుండవచ్చు"

సిద్ధార్థుడు : "ఆయనకు షష్ఠిపూర్తి అయినా నిర్వాణ స్థితి లభించ లేదు. డెబ్బయివచ్చినా ఎనబై వచ్చినా అంతే. నీకు నాకు ఒకనాటికి అంతవయసు వస్తుంది. ఈ సాధనలతో కాలహరణం కావడమే కాని నిర్వాణస్థితి ఆయనకు మనకు కూడా లభించదు. ఈ శ్రమణులలో ఒక్కడైనా నిర్వాణస్థితిని పొందగల డని నాకు నమ్మకం లేదు. వీటివల్ల మనస్సుకు కొంత ఓదార్పు – కొంత గారడివిద్య కూడా అలవడుతుంది. ఇదంతా ఆత్మవంచన. పరమలక్ష్యం, దానికి మార్గం – మనకు గోచరించదు."

గోవిందుడు : "సిద్ధార్థా! అంత ఘోరంగా చెప్పకు. ఇందరు పండితులు, బ్రాహ్మణులు, శ్రమణులు, సాధకులు, సత్పురుషులు వున్నారే! వీరిలో ఒకొక్కరికీ ఆమార్గం గోచరించదా?"

సిద్ధార్థుడు : "గోవిందా! నీవూ నేనూ ఈ శ్రమణుల నాశ్రయించి దీర్ఘకాలం గడిపాము. ఇక త్వరలో వీరి

మార్గాన్ని నేను విసర్జించ బోతున్నాను. వీరి సాధనా మార్గంలో నా తృష్ణ లవలేశంకూడా తీర లేదు. ఈ జ్ఞాన తృష్ణ నన్ను నిత్యంగా వెంటాడుతున్నది. నా జిజ్ఞాసను బ్రాహ్మణులు తీర్చలేదు. వేదాలు తీర్చలేదు. నా సంశయాలకు, నా ప్రశ్నలకు ఎక్కడనుంచి సరియైన జవాబు రాలేదు. వీరిని అడిగినదానికంటే అడవిమృగాలను అడిగింది మే లనుకుంటాను. ఒక్క విషయం తెలుసుకో డానికి – ఇంకా బాగా తెలుకోలేదు— నేను చాలా కాలం గడిపాను. తెలుసుకో గలిగింది ఏమీ లేదన్న దే ఆ విషయం. సర్వత్రా సారభూతంగా ఒకటి ఉన్నది. దానిని తెలుసుకోవడ మంటూ లేదు. అదే జ్ఞానం. అది ప్రతిచోట వున్నది. అదే ఆత్మ. నీలో – నాలో – ప్రతిజీవిలోనూ వున్నది. ఈ జ్ఞానానికి జ్ఞాని ననుకునేవాడు పరమవిరోధి – జ్ఞానసాధనకూడా అంతే! ఈ రహస్యం నాకు ఇప్పు డిప్పుడే తెలుస్తున్నది.''

గోవిందుడు : "సిద్ధార్థా! నీ సంభాషణ నా మనస్సుకు వ్యథాకరంగా వున్నది. నీవు చెప్పినట్లు జ్ఞానార్జన అన్న దే లేకపోతే – మన ప్రార్థనలకు అర్థమేమి? పరమపావను లైన బ్రాహ్మణులు – శ్రమణులు వీరిసాధనల వల్ల ప్రయోజన మేమి? భూమిమీద పవిత్రత అంటూ ఎక్కడ వుంటుంది?''

గోవిందుడు ఒక ఉపనిషత్తులోని మంత్రాన్ని చదివాడు. దానిభావ మిది : "ఎవని విచారాత్మక మైన నిర్మల బుద్ధి పరమాత్మలో లీనం కాగలదో – వాడు వాక్కులతో వర్ణించరాని ఆనందాన్ని గ్రహిస్తాడు.''

సిద్ధార్థుడు మౌనంగా ఆ మంత్రార్థాన్ని దీర్ఘ కాలం మననంచేస్తూ కూర్చున్నాడు. "నిజమే – అప్పుడు మనం పవిత్రంగా భావిస్తున్న పదార్థాలలో మిగిలేది ఏ ముంటుంది? దేనిని మిగిలించుకోవాలి?" అని తనలో తా ననుకున్నాడు.

ఈ యువకు లిద్దరూ, శ్రమణులవద్ద దాదాపు మూడు సంవత్సరాలు శిక్షణ పొందారు. ఆ కాలంలో పెక్కుమంది ద్వారా వారు ఒక వార్త వింటూవచ్చారు. గౌతమబుద్ధు డనే ఒక మహాత్ముడు కలడనీ; అతడు ప్రపంచదుఃఖాలను జయించా డనీ; జననమరణచక్రాన్ని స్తంభింపజేశా డనీ; సంసారాన్ని వదిలిపెట్టి, దేనినీ స్వీకరించక, ఇల్లూ వాకిలి లేనివాడై కాషాయగుడ్డలు ధరించి శిష్యసమేతంగా దేశం వెంట తిరిగి ప్రబోధం చేస్తున్నా డనీ, బ్రాహ్మణులు రాజులు అతనికి పాదాక్రాంతులై శిష్యవర్గంలో చేరుతున్నా రనీ వారు విన్నారు.

ఈ వార్త కర్ణాకర్ణిగా ప్రాకి నలుమూలలకు వ్యాపించింది. పట్టణంలో బ్రాహ్మణులు, అరణ్యంలో శ్రమణులు బుద్ధునివిషయమే మాట్లాడుతున్నారు. కొందరు పొగుడుతున్నారు. కొందరు నిందిస్తున్నారు. ఈ వార్త సిద్ధార్థ గోవిందుల చెవుల పడింది.

ఒక దేశంలో ఏదైనా అంటువ్యాధి వ్యాపించినపుడు ఎవరో మహాత్ముడు మాటలతోనూ, చూపులతోనూ రోగ నివారణ చేయగలుగుతున్నా డని లోకవార్త విస్తరిస్తే ప్రతిమనిషి దానినిగురించి నమ్మికొని నమ్మకగాని ప్రసం

గించడం సహజం. అయితే, ఆర్తులైనవారుమాత్రం వెంటనే ఆ మహాత్ముని వెదుక్కుంటూ పరుగెత్తుతారు.

ఈ విధంగా శాక్యవంశజుడైన గౌతమబుద్ధుని శుభ వార్త దేశమంతటా విస్తరించింది. అతడు మహాజ్ఞాని అనీ, తనపూర్వజన్మలు తెలుసుననీ, నిర్వాణం పొందాడనీ, ఆయనకు జననమరణచక్రంతో సంబంధం విడిపోయిందనీ, తిరిగి ఈ కల్లోలసంసారంలో అడుగుపెట్టడనీ నమ్మకం కలవారు చెప్పుకుంటున్నారు. ఆయన విచిత్రమహిమలను ప్రదర్శించాడనీ, కామాసురవిజయం చేశాడనీ, దేవతలతో ప్రసంగించాడనీ, విస్మయకరమైన, విశ్వసించరాని వదంతులు ప్రబలినవి. అంతా వట్టి బూటకమనీ, అన్నిభోగాలు అనుభవిస్తాడనీ, యజ్ఞయాగాదికర్మలను తృణీకరించాడనీ, ఆధ్యాత్మికసాధన కాని, ఇంద్రియనిగ్రహం కాని లేదనీ, అపండితుడనీ గిట్టనివారు తెగడుతున్నారు.

ఆయననుగూర్చి ప్రతి వదంతి ఆకర్షకంగా వినిపిస్తున్నది. వాటిలో ఏదోమహత్తు వున్నది. భారతవర్షమంతా ఆయనపేరుతో మారుమ్రోగుతున్నది. దుఃఖమయమైన ప్రపంచానికి ఆయన సాధుసందేశం క్రొత్త ఆశను, ఓదార్పును కల్పించిందని చెప్పుకుంటున్నారు. నగరాలలోనూ, గ్రామాలలోనూ ఆయనవార్తలు తెచ్చిన వారికి సుస్వాగతం ఇస్తున్నారు. అప్పుడప్పుడు వస్తూవున్న ఈ వదంతులను మన యువకులు వింటున్నారు. అవి తీవ్రమైన ఆశను సందేహాన్నికూడా కలిగిస్తూ వున్నవి. వృద్ధ శ్రమణునికి వీటిపైన విశ్వాసం లేదు. బుద్ధుడు కొన్నాళ్ళ

సన్యాసిగా అడవులలో తిరిగి, మళ్ళా ప్రపంచసుఖాలలో మునిగి తేలుతున్నట్లు వృద్ధశ్రమణునికి ఎవరో చెప్పారు.

ఒకనాడు గోవిందుడు ఒంటరిగా భిక్షాటనకు వెళ్ళి వచ్చాడు. రాగానే సిద్ధార్థునితో ఈలా చెప్పాడు : "మిత్రమా ! గ్రామంలో ఒక బ్రాహ్మణుడు నన్ను తన యింటికి పిలుచుకొని వెళ్ళాడు. ఆయన కుమారుడు మగధ నుంచి వచ్చాడు. ఆ యువకుడు బుద్ధుని స్వయంగా చూచాడట. ఆయనబోధలను విన్నాడట. ఆ విషయా లన్నీ అతడు చెపుతూవుంటే నా మనస్సు కెంతో ఉబలాటం కలిగింది. బుద్ధుని బోధామృతాన్ని గ్రోలగల శుభదినం మనకు ఏనాటికి కలుగుతుందో అనిపించింది. సిద్ధార్థా! మనంకూడా వెళ్ళి ఆ బుద్ధుని దర్శించి ఆయన దివ్యోపదేశాన్ని వినగూడదూ ?"

సిద్ధార్థుడు : "అదేమిటి ? గోవిందుడు బ్రతుకంతా ఈ శ్రమణులతోనే గడపుతా డనుకున్నానే! వీరి బోధలు, వీరి సాధనలు ఇవే గోవిందునికి పరమఫలత్వా లనుకున్నాను సుమా ! ఈలాంటి వ్యూహాలు మా గోవిందుని మనస్సులో కలవని నాకు తెలియనే తెలియదు. అయితే, బుద్ధ బోధలు వినవలెననీ, క్రొత్తదారి త్రొక్కవలెననీ కోరిక వున్నదన్నమాట నీకు !"

గోవిందుడు : "సిద్ధార్థా ! నన్ను అపహాస్యం చేయడానికి అలా అంటున్నావుకాని నీకుమాత్రం ఆకోరిక లేదా ? అనతికాలంలో ఈ శ్రమణుల సాంగత్యం వదలిపెట్టుతానని నీవే చెప్పితివి కదా !"

సిద్ధార్థుడు నవ్వుతూ ఈలా అన్నాడు : "గోవిందా! నీకు మంచికోరిక కలిగింది. ఈ శ్రమణుల బోధలపైన విశ్వాసం నాకు తొలిగిపోయిందనికూడా నీతో చెప్పాను. ఆనాడే నా మనసు బుద్ధునిమీదికి మళ్ళింది. బుద్ధదర్శనానికి నేను సర్వసిద్ధంగా వున్నాను. ఇదివరకే బుద్ధుని ప్రభావం మనమీద ప్రసరించిం దని నా నమ్మకం."

గోవిందుడు : "నీవు అంగీకరించి నందులకు సంతోషం. కాని బుద్ధుని దర్శించి ఆయనబోధ వినక ముందే ఆయనప్రభావం మనమీద ఏలాగు ప్రసరించినట్టు?"

సిద్ధార్థుడు : "మిత్రమా! ఆయనప్రభావం ప్రసరించబట్టే మనకు ఈ శ్రమణుల యెడల విముఖత్వం కలిగింది. ఇంకా ఎట్టి మహాఫలం కలగనున్నదీ ఆయనను దర్శించి అనుభవపూర్వకంగా తెలుసుకుందాము."

ఆనాడే సిద్ధార్థుడు తమ నిర్ణయాన్ని వృద్ధశ్రమణునితో చెప్పాడు. వినయవిధేయతలతోనే చెప్పాడు. వృద్ధశ్రమణుడు ఆమాట వినగానే ఆగ్రహావేశంతో దుర్భాషలాడ నారంభించాడు.

సిద్ధార్థుడు గోవిందునికి మిన్నకుండు మని కనుసన్న చేసి వృద్ధశ్రమణునిముందు నిలబడి ఆయనవైపు ఏకాగ్ర దృష్టితో చూచాడు. ఆయననోరు కట్టుపడింది. కళ్ళకు భ్రమ కమ్మింది. మనసు మొద్దుబారింది. సిద్ధార్థుడు లెమ్మనగానే లేచి నిల్చున్నాడు. కూచోమనగానే కూచు

న్నాడు. "మేము వెళ్ళుతున్నాము. ఏలాగైనా మీరు పెద్దలు. ఆశీర్వదించి మాకు అనుజ్ఞ నీయండి" అని సిద్ధార్థుడు అనగానే "మంచిది; మీకు శుభం కలుగుతుంది. మీ సంకల్పం సిద్ధిస్తుంది" అన్నాడు.

మార్గమధ్యంలో వుండగా గోవిందుడు అడిగాడు: "మిత్రమా! ఆ శ్రమణునికన్నా నీ ప్రభావమే మిన్నగా వున్నదే! ఆయనను మంత్రంతో కట్టివేసి, ఇచ్చవచ్చినట్టు ఆడించావే! ఇంకా కొద్దికాలం సాధనచేసి నీవు నీళ్ళమీద నడవగల వనుకుంటాను."

సిద్ధార్థుడు: "నేను ఆసించే పరమార్థం నీళ్ళమీద నడవడంకాదు. ఈ గారడీపనులను శ్రమణులకు వదిలి పెట్టుదాము."



# 3. గౌతముడు



సావథీనగరంలో బుద్ధభగవానుని పేరు ప్రతి పసి బిడ్డకూ తెలుసును. గౌతమ శిష్యుల భిక్షాపాత్రలను నింప డానికి ప్రతిగృహిణి నిరీక్షిస్తూవుండేది. అనాథపిండికుడు అనే ధనికవణిజుడు జేతవనం అనే తన ఆరామాన్ని బుద్ధుడు శిష్యసమేతంగా వుండడానికి ఏర్పాటుచేశాడు. ఆ వనం నగరానికి సమీపంలో వున్నది.

మన యువకసన్యాసులు గౌతముని వెదుక్కుంటూ ఆ నగరానికి వచ్చారు. భిక్షాపాత్రలు పట్టుకొని ఒక యింటి ముందు నిల్చున్నారు. ఆ యిల్లాలు వారికి ఆదరంతో అన్నం పెట్టింది. ఆమెను సిద్ధార్థుడు ఈలా అడిగాడు: "అమ్మా! బుద్ధభగవానుడు ఎక్కడ వుండేది చెప్పగలవా? మేము శ్రమణులం – ఆయనదర్శనంకోసం వచ్చాము."

"ఈ నగరానికి వెలుపల జేతవనం అనే ఆరామం ఉన్నది. అక్కడ వుంటాడు బుద్ధభగవానుడు. ఈ రాత్రి మీరు అక్కడ గడపవచ్చును. ఆయనబోధలు వినడానికి

ఎందరో వస్తూవుంటారు. అందరికి కావలసినంత వసతి వుంటుంది.'' అన్నదామె.

''అమ్మా! నీవు బుద్ధభగవానుని చూచావా?'' అని గోవిందుడు ఆసక్తితో అడిగాడు.

''నేను చాలాసార్లు చూచాను. ఆయన కాషాయాంబరం ధరించి, భిక్షాపాత్ర పూని నగరవీధులలో రోజూ తిరుగుతారు. ఆయన వచ్చిందే తడవుగా నాబోటివాళ్లు భిక్షాన్నం పెడతారు. పాత్రి నిండగానే తిరిగి వెళ్లుతారు.'' అన్నదామె.

గోవిందుడు తన్మయుడై ఇంకా ఏమో అడగబోతూ వుండగా సిద్ధార్థుడు 'వెళ్లుదాం, ర'మ్మని తొందరచేశాడు. ఇద్దరు ఆమెకు వందనం చేసి బయలుదేరారు. వారికి దారి కనుక్కోవలసిన అవసరం లేకపోయింది. ఎందరో యాత్రికులు భిక్షుకులు గుంపులుగా వెళ్లుతున్నారు. జేతవనానికి చేరేటప్పటికి చీకటి పడింది. ఇంకా ప్రజలు వస్తూనే వున్నారు. సిద్ధార్థుడు గోవిందుడు ఆ రాత్రి అక్కడ పండుకున్నారు.

తెల్లవారింది - ఆ జనాన్ని చూచి మన యువకులు ఆశ్చర్యమగ్నులైనారు. ఆ వనంలో ఏ వైపు చూచినా కావిశాటులు ధరించిన భిక్షుకులే - కొందరు చెట్లనీడలలో ధ్యానపరులై కూర్చుని వున్నారు. కొందరు తాత్త్వికగోష్ఠులలో మునిగివున్నారు. ఆ వనం ఒక పట్టణంవలె వున్నది. చాలా మంది భిక్షుకులు పాత్రలను పూని భిక్షాటనకు నగరం

లోకి వెళ్లుతున్నారు. కొంతసేపటికి బుద్ధభగవానుడు కూడా భిక్షాపాత్ర పూని బైటికి వచ్చాడు.

నిరాడంబరంగా జనంలో కలిసి వస్తూవున్న గౌతమునిచూచి సిద్ధార్థుడు 'అదుగో, చూడు బుద్ధభగవానుడు' అని గోవిందుని వీపు తట్టాడు. గోవిందుడు ఆసక్తితో చూచాడు. చూడడానికి అందరు భిక్షుకులవలెనే వున్నారు. కాని ఆ దివ్యతేజస్సును పట్టి మన యువకులు ఆయన బుద్ధభగవానుడని వెంటనే గ్రహించారు. ఇద్దరుకూడా బయలుదేరారు.

బుద్ధుడు ధ్యాననిమగ్నుడుగానే నడుస్తున్నాడు. ఆ ప్రశాంతవదనంలో సుఖము దుఃఖము కాని నిర్లిప్తత ఉట్టిపడుతున్నది. పసిబిడ్డచిరునవ్వువలె ఆయన ముఖంలో సాధుమధురమైన మందహాసరేఖ వెలుగుతున్నది. అందరు భిక్షుకులతోపాటు నెమ్మదిగా నడిచి వెళ్లుతున్నాడు. ఆయన సర్వాంగభంగిమ యందును ఒక శాంతి, ఒక సంపూర్ణత, ఒక విశిష్టత, ఒక దివ్యతేజోరేఖ గోచరించి ఇతర భిక్షుకుల నుంచి ఆయనను వేరుపరుస్తున్నవి. అందులో ఒక అన్వేషణ, ఒక సంకల్పం, ఒక ప్రయత్నం, ఏమీ లేదు. ఒక దివ్యతేజస్సు పరమశాంతి ఆకృతి వహించినట్లుగా వున్నది ఆ మూర్తి. 'ఈ నాడే మనము భగవానుని బోధలను వినవచ్చు' అన్నాడు గోవిందుడు.

సిద్ధార్థుడు జవాబు చెప్పలేదు. అతనికి బోధలను వినవలెనన్న ఆసక్తి అంతగా లేదు. ఆబోధలలోని సారాన్ని ఇతరులద్వారా కొంతకు కొంత గ్రహించి వున్నాడు. అతని

దృష్టిని ఆకర్షించినది గౌతముని స్వరూప సౌభాగ్యం. ఆ శీర్షము, భుజస్కంధము, ఆజానుబాహువులు, పాదాలు, ఆపాదమస్తకం ప్రతి అంగముకూడా జ్ఞానమయంగా తోస్తున్నది. ప్రత్యంగము ప్రాణశక్తిని సత్యదీప్తిని విరజిమ్ముతున్నది. కాగా, సిద్ధార్థునికి ఎన్నతగ్గదిగా తోచినది ఆయన బోధకన్నా ఆయన దివ్యమూర్తి. అంతవరకు సిద్ధార్థుని అంతగా ఆకర్షించిన వ్యక్తి లేదు.

ఇద్దరూ బుద్ధునివెంట నగరంలోకి వెళ్ళి తిరిగివచ్చారు. ఆనాటికి ఇద్దరు ఉపవాసం వుందా మనుకున్నారు. గౌతముడు నగరంనుంచి వచ్చిన తరువాత శిష్యులతో కలిసి మితాహారం తీసుకున్నాడు. మామిడిచెట్లనీడలో కొంత సేపు కూర్చున్నాడు.

ప్రొద్దు పడమరకు తిరిగింది. ఎండవేడిమి తగ్గింది. అందరూ బుద్ధునిచుట్టూ కూర్చున్నారు. బుద్ధుడు ప్రవచనం ప్రారంభించాడు. ఆయన కంఠస్వరం నిర్దుష్టంగాను, సాధుమధురంగాను, శాంతిపూరితంగాను వినిపిస్తున్నది. దుఃఖము, దుఃఖకారణము, దుఃఖనివారణోపాయము – వీటినిగూర్చి ముందు వివరించాడు. ప్రపంచం దుఃఖమయం. దుఃఖవిముక్తికి, నిర్వాణసిద్ధికి తాను చూపిన మార్గమే శరణ్యము.

నాలుగు మూలసిద్ధాంతాలు, అష్టాంగసాధన వీటినిగూర్చి వివరంగాను ఉదాహరణాలతోను గౌతముడు మృదుగంభీరవాక్కులలో ఉపన్యసించాడు. స్వచ్ఛము, సాధువు అయిన ఆయనవాణి శ్రోతల హృదయకుహరాలలో వెలుగు రేకలను విరియించింది.

ఆయన ప్రవచనం ముగిసేటప్పటికి చీకటి పడింది. శ్రోతలు పెక్కుమంది ముందుకు వచ్చి తమ్ము సంఘంలో చేర్చుకొమ్మని అర్థించారు. బుద్ధుడు అందరినీ చేర్చుకున్నాడు. ఆశీర్వదించాడు. గోవిందుడుకూడా ఆయన సన్నిధికి పోయి సంఘంలో చేర్చుకొమ్మని అర్థించాడు. అతనినీ చేర్చుకున్నాడు.

ఆ రాత్రి గోవిందుడు సిద్ధార్థునితో అన్నాడు: "మిత్రమా! భగవానుని బోధ ఇద్దరము విన్నాము. నేను బౌద్ధధర్మాన్ని స్వీకరించాను. నీవుకూడా ఈ నిర్వాణ పథంలో ప్రవేశించవా? ఇంకా వేచివుండవలెనని నీ సంకల్పమా?"

సిద్ధార్థుడు: "గోవిందా! నీ మార్గాన్ని నీవు నిర్ణయించుకున్నావు. బాగున్నది. ఇంతకాలము నీవు నన్ను వెన్నంటి నడిచావు. నేను అనుకునే వాడను 'ఎన్నటికైనా గోవిందుడు నా ప్రమేయం లేకుండా స్వంతబుద్ధితో ఒక మార్గాన్ని త్రొక్కుతాడా' అని. ఈ నాడు నీవు నిజంగా పురుషార్థివి అయినావు. నీవు వరించిన మార్గాన్ని అనుసరించి నిర్వాణం సంపాదించుకో."

గోవిందుడు: 'మిత్రమా! నీ వైఖరి నాకు అర్థం కావడం లేదు. నేనుకూడా భగవానుని మార్గాన్ని అనుసరిస్తానని చెప్పరాదా?'

సిద్ధార్థుడు: 'గోవిందా! నా ఆశీర్వాదం ఇచ్చాను కదా. నీ మార్గాన నీవు నడు. ముక్తి పొందు.' సిద్ధార్థుడు

నాటితో తనను విడిచిపో నున్నాడని గోవిందుడు గ్రహిం చాడు. కన్నులవెంట బాష్పాలు రాలినవి. 'సిద్ధార్థా!' అన్నాడు గద్గదికతో.

సిద్ధార్థుడు: "మిత్రమా! ఇప్పుడు నీవు బౌద్ధభిక్షుకు డవు. నీ సంసారాన్ని వదలిపెట్టావు. నీ సంకల్పాన్ని కూడ వదలిపెట్టావు. అన్ని స్నేహబంధాలు తెంచుకున్నావు. అదిమాత్రం మరచిపోకు. భగవానుడు కోరేది అదే. నీవు కోరింది అదే. గోవిందా! రేపు మనం విడిపోతాము."

ఇద్దరు కలిసి అడవిలో తిరిగారు. గోవిందుడు పదే పదే అడిగాడు "సిద్ధార్థా! బౌద్ధధర్మం స్వీకరించడానికి నీకు అభ్యంతరమేమి? అందులో ఏమైనా దోషం వున్నదా?" అని. 'గోవిందా! అలాంటి సంశయం పెట్టుకోకు. భగవా నునిబోధ పరమోత్తమమైనది. అందులో నేను దోషం చూపగలనా?' అన్నాడు సిద్ధార్థుడు.

కొత్తగా భిక్షుకధర్మాన్ని స్వీకరించినవారికి శాటుల నిచ్చి ఆశ్రమవిధులను ఉపదేశించడానికి, అట్టివారిని మరు నాటి ఉదయం ఒక వృద్ధభిక్షువు భగవానుని వద్దకు రమ్మని పిలుస్తున్నాడు. సిద్ధార్థునికౌగిలి నుంచి విడివడి గోవిందుడు వెళ్ళాడు.

సిద్ధార్థుడు ఆలోచనలలో మునిగి ఆరామంలో తిరుగు తున్నాడు. ఒకచోట బుద్ధుడు ఉపవిష్టుడై వున్నాడు. ధైర్యం వహించి ఆయనను సమీపించి వినయంతో వందనం చేసి అడిగాడు: "స్వామీ! తమతో కొంచెం ప్రసంగించ

వచ్చునా?'' అని. బుద్ధుడు మౌనంగానే తన అంగీకారాన్ని సూచించాడు.

''ప్రభూ! నిన్న తమ దివ్యబోధనలను వినడం నా అదృష్టం. నేను నా మిత్రుడు తమ దర్శనం చేసి తమబోధలను వినవలెనని దూరప్రాంతం నుంచి వచ్చాము. నా మిత్రుడు భిక్షుసంఘంలో చేరాడు. అతడు తమ సన్నిధినే వుంటాడు. నేను తిరిగి నా దారిని వెళ్లుతాను'' అన్నాడు సిద్ధార్థుడు.

''సరే, నీ ఇష్టం.'' అన్నాడు గౌతముడు మర్యాదగా.

సిద్ధార్థుడు : ''సాహసించి తమకు మనవి చేస్తున్నాను. నాభావాలను తమకు విన్నవించకుండా శెలవు తీసుకోడానికి మనస్కరించడం లేదు. కొద్దికాలం నామాటలు వినవలెనని ప్రార్థన.'' అంగీకారసూచకంగా బుద్ధుడు శిరఃకంపనం చేశాడు.

సిద్ధార్థుడు :— తమ ప్రవచనంలో ఒక్కవిషయం నాకు హర్షదాయకమైంది. ఈ ప్రపంచాన్ని సంపూర్ణమైన అవిచ్ఛిన్నమైన – నిరంతరమైన – కార్యకారణబద్ధమైన శృంఖలగా తాము నిరూపించారు. ఇతఃపూర్వం ఈ విషయాన్ని ఇంత నిరాక్షేపణీయంగా ఎవ్వరూ నిర్ధారించ లేదు. నిర్హేతుకసంఘటనలమీదను, దేవతల ఇచ్ఛమీదను ఆధారపడనిది, నిరవకాశమైనది, ఒక సార్వత్రికసంబంధం ఈ ప్రపంచ స్వరూపంలో కలదని నిరూపించిన తమ బోధలను విన్నపుడు ఎంత పండితుని కైనా హృదయం కంపించక పోదు. మంచికానీ, చెడుకానీ, సుఖంకానీ, దుఃఖంకానీ,

వాస్తవికమేకాని అవాస్తవికమేకానీ ఈ ప్రపంచంలో ఒక ఏకత్వం కలదనీ, సర్వఘటనలకు అన్యోన్యసంబంధం కలదనీ అల్పానల్ప విషయాలన్నీ ఒకే కార్యకారణధర్మంవల్ల ఒకే ప్రవాహంలో పుట్టుతూ నశిస్తూ వున్నవనీ, తమ ఉదాత్త బోధలో ప్రధానంగా గోచరిస్తున్నది. కాని తమ ప్రతిపాదనలో సర్వవిషయైక్యమునకున్నూ, కార్యకారణసంబంధానికిన్నీ ఒక్కచోట మాత్రం తెంపు కలిగింది. ఏకతా ధర్మం గల ఈ ప్రపంచస్వరూపంలోకి నిర్ణయించరాని ఒక కొత్తవిషయం ఆ తెంపులోనుంచి పుట్టుకొనివస్తున్నది. ఈ ప్రపంచాన్ని అతిక్రమించి నిర్వాణాన్ని పడయగలమన్న సిద్ధాంతమే ఆ తెంపు. ఈ కొద్ది తెంపుమూలంగా ప్రపంచానికి గల నిరంతరైక్యధర్మం భగ్నమవుతున్నది. ఈ సంశయాన్ని తెలుపుకున్నందుకు నేను క్షంతవ్యుడను.''

గౌతముడు:— 'ఓయీ! నీవు నా వాక్యములను ఇంత జాగ్రతగా విని ఇంత గాఢంగా మననం చేసినందుకు నిన్ను అభినందిస్తున్నాను. అందులో నీ కొక దోషం గోచరించింది. మళ్ళా జాగ్రతగా ఆలోచించుకో. కాని ఒక హెచ్చరిక : నీవు జ్ఞానపిపాసతో వున్నావు. సిద్ధాంతాల పొదలలోనూ వాక్య వైరుధ్యంలోనూ చిక్కుకొనబోకు. సిద్ధాంతాలలో ఏమీ సారం లేదు. అవి మంచివి కావచ్చును, చెడ్డవి కావచ్చును. ఎవరుకాని వాటిని అంగీకరించవచ్చు, లేదా నిరాకరించవచ్చు. నా ముఖతః నీవు విన్నదిమాత్రం నా సిద్ధాంతంకాదు. జ్ఞానపిపాస కలవారికి ప్రపంచస్వరూపాన్ని వ్యాఖ్యానించడంకాదు దానిలక్ష్యం.

దానిలక్ష్యం సర్వాత్మనా భిన్నమైంది. అది దుఃఖవిముక్తి. అదే దానిలక్ష్యం. అదే నాబోధ. అంతకు మించి ఏదీకాదు.”

సిద్ధార్థుడు :- స్వామీ ! తమకు బుద్ధత్వం సిద్ధించింది అన్నవిషయంలో నాకు ఏ మాత్రమూ సందేహం లేదు. వేలకొలదిగా బ్రాహ్మణులు దేనిని అందుకోవలెనని శ్రమిస్తున్నారో ఆ పరమలక్ష్యాన్ని తాము అందుకున్నారని నేను విశ్వసిస్తున్నాను. తమరు స్వీయాన్వేషణతో స్వీయ మార్గంలో విచారంద్వారా, ధ్యానంద్వారా జ్ఞానోదయం కలిగి ఈ సిద్ధిని పొందారు. తమరు ఉపదేశంవల్ల ఈ సిద్ధిని పొందలేదు. ఉపదేశంవల్ల ఎవ్వరూ ముక్తిని పొందలేరని నా నమ్మకం. తమకు జ్ఞానోదయమైన క్షణంలో ఏమి జరిగిందీ, ఎట్టి అనుభవం కలిగిందీ, మాటలతోనూ బోధల తోనూ ఒకరికి తెలపడం అసాధ్యం అనుకుంటాను. ధర్మా చరణను గూర్చిన్నీ, దోషనివారణను గూర్చిన్నీ తమకు ఎంతైనా చెప్పవచ్చును. తమకైనా చెప్పనలవికానిది ఒక్కటే. ఇంత మానవజగత్తులో తమకు మాత్రమే కలిగిన ఆ పరమానుభూతి అందలి రహస్యం. తమబోధవల్ల నేను గ్రహించ గలిగిన విషయ మిది. కాగా, నా దారిన నేను పోవలెనని నిర్ణయించుకున్నాను. వేరొక ఉత్తమ సిద్ధాంతాన్ని అన్వేషించడానికి కాదు. అట్టిది లేదని నాకు తెలిసింది. అన్ని సిద్ధాంతాలను, అందరు ఆచార్యులను వదలి ఒంటరిగా నా లక్ష్యాన్ని అందుకోవడమో మరణించ డమో ఇదే నా నిశ్చయం. కాని ఒక మహాత్ముని దర్శించి

ప్రసంగించిన ఈ అమూల్యముహూర్తాన్ని మాత్రం చిరకాలం స్మరిస్తూ వుంటాను.

గౌతముడు : "ఓయీ ! నీ తర్కములో దోషంలేదు. నీ లక్ష్యాన్ని అందుకోగలవని ఆశిస్తాను. అయితే నిన్నొక ప్రశ్న అడుగుతున్నాను. నా బోధలను స్వీకరించి భిక్షుకులైన వారిని నీవు చూచావు. వీరందరూ నా బోధలను పరిత్యజించి తిరిగి సంసారంలో ప్రవేశించడమే క్షేమ మని నీ వుద్దేశమా ?"

సిద్ధార్థుడు : "ఈ భావం నా కెప్పుడు స్ఫురించలేదు. వారు ఈ బోధలను అనుసరిస్తూ తమ లక్ష్యాన్ని అందుకో వచ్చును. ఇంతకు ఇంకొకరిజీవితాన్ని గూర్చి ఎట్టి నిర్ణయం చేయడానికి నాకు అధికారంలేదు. నన్ను గూర్చి ఒక నిర్ణయం చేసుకోడానికే నాకు అధికారం వున్నది. స్వవిషయంలో నేను దేనినిగాని స్వీకరించవచ్చు, నిరాకరించవచ్చు. అహంతనుంచి విముక్తి పొందవలె నని శ్రమణుల ఆదేశం. నేను తమ అనుయాయులలో ఒకడనైతే అది నటనమాత్రం గానే పరిణమిస్తుంది. తమ బోధలను అనుసరిస్తున్నాననీ, నాకు శాంతి చేకూరిందనీ, ముక్తి సిద్ధించిందనీ, ఆత్మవంచన చేసుకోవడమే కాగలదు. వాస్తవానికి నా అహంత అంటి పట్టుకొని దినదినాభివృద్ధి పొందుతుంది. అప్పుడు తమ బోధలపై అభిమానంగానూ, తమపై భక్తిగాను, భిక్షుసంఘంపై ప్రేమగాను పరిణామం పొందుతుంది అహంత. అహంతాపరిణామం ఎంత ఉత్తమమైనది అయినా బంధహేతువేకదా !"

"ఓ శ్రమణుడా! నీవు తెలివిగలవాడవు. తెలివిగా మాట్లాడడం నీకు తెలుసును. కాని అతి తెలివికూడా అపాయ కరమని హెచ్చరిస్తున్నాను." అని గౌతముడు సిద్ధార్థునికి శెలవిచ్చి పంపాడు.

"చూచినా నవ్వినా కూర్చున్నా నడిచినా, ఈ సహజత్వమూ ఈ యోగ్యత ఈ నిగ్రహము ఈ ఋజుత్వము ఎన్నడూ ఎక్కడా చూడలేదు. పసిబిడ్డలోని అమాయికత, సిద్ధపురుషుని నిగూఢప్రభావము ఈయనలో కుదురుకొన్నవి. అహంతను జయించినవాడే ఆ విధంగా వుండగలడు. నేను కూడా అహంతను జయిస్తాను.

"నేను తలవంచి నమ్రతతో నమస్కరించిన వ్యక్తి ఈయన ఒక్కడే. ఎన్నటికి వేరొక వ్యక్తిముందు అలా చేయను. ఈయన బోధలే నన్ను ఆకర్షించనినాడు వేరెవ్వరివి నన్ను ఆకర్షించ గలవు?

"బుద్ధుడు నా సర్వస్వము తస్కరించాడు. కాని అన్నిటికన్న విలువగల వస్తువును మాత్రం మిగిల్చాడు. నాకు తోడునీడగా వుండిన గోవిందుడు కూడా ఆయన వశమైనాడు. కాని నన్ను—సిద్ధార్థుని—నా వద్దనే నిలిపాడు." అనుకున్నాడు సిద్ధార్థుడు.



# 4. మెలకువ



జేతవనంనుంచి సిద్ధార్థుడు బయలుదేరాడు. తన పూర్వజీవితాన్ని ఆ వనంలో వదిలిపెట్టి వెళ్ళుతూ వున్నట్టుగా తోచింది అతనికి. అతనితలలో అదే ఆలోచన సుళ్ళుతిరుగుతూ వున్నది. ఆ భావం అతని మనస్సును పూర్తిగా ఆవేశించింది. తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అసలు కారణాలు గోచరించేటంతవరకు ఆలోచించాడు. ఆలోచనకు ఫలితం అసలు కారణాలను గ్రహించడమే నని అతనికి తోచింది. ఆలోచనద్వారా భావాలు తెలివిగా రూపొందుతవి. ఆ భావాలు నశించకుండా స్థిరరూపం దాల్చి, పరిపక్వం కావడానికి ప్రారంభిస్తవి.

అతడు దారిలో నడుస్తూ తీవ్రంగా ఆలోచిస్తూ వున్నాడు. తనకు యౌవనం గడిచి నడివయస్సు వచ్చిన సంగతి తెలుసుకున్నాడు. పాము కుబుసం విడిచినట్టు తనలో నుంచి ఏదో విడిపోయినట్టు తోచింది. యౌవనకాలమంతా తనను వెన్నంటి తనలో ఒక భాగంగా వుండినది ఏదో

ఈ నాడు తనలో కనుపించడం లేదు. గురువులపైన వారి బోధలపైన తన కుండిన కోరిక, అదే తనను విడిచిపోయింది అనుకున్నాడు. గురువులలో పరమోత్తముడు లభించాడు. ఆయనబోధనూ ఆమోదించలేకపోయినాడు. ఆయనను కూడా వదలక తప్పిందికాదు.

తన్ను తాను ప్రశ్నించుకున్నాడు: "గురువులవల్లనూ వారి బోధలవల్లనూ నీవు గ్రహించదలచింది ఏమిటి? వారు ఎన్నో బోధించారు. వారు బోధించజాలని విషయం ఏమున్నది?"

తన ప్రశ్నకు తానే జవాబు చెప్పుకున్నాడు :

"అహంత"—దాని స్వరూప స్వభావాలు తెలుసుకో వలెనని నా వాంఛ. అహంత నుంచి విడివడవలెననీ, దానిని జయించవలెననీ నా అభిలాష. కాని దానిని జయించలేక పోయినాను. దానిని కికురించ గలిగాను. దాని పట్టునుంచి పరుగెత్త గలిగాను. దానితో దాగుడుమూత లాడ గలిగాను. అంతే. నిజానికి నా ఆలోచనలను అహంత ఆక్ర మించుకొన్నంతగా ఏదీ ఆక్రమించుకోలేదు. నేను బ్రతుకు తున్నాను. ప్రతివ్యక్తికీ భిన్నుడనైన ఒక ప్రత్యేకవ్యక్తిని నేను. నేను సిద్ధార్థుడను. కాని తేలని సమస్య ఇదే. ప్రపంచంలో ఏ విషయమైనా కొంతకు కొంత తెలుసునుగాని 'నన్ను' గూర్చి—ఈ సిద్ధార్థునిగూర్చి—నాకు తెలియదు.

సిద్ధార్థుని ఈ ఆలోచన బాగా పట్టుకున్నది. అందులో నుంచి వేరొక ఆలోచన వచ్చింది. నన్నుగూర్చి నాకు

బొత్తిగా తెలియక పోవడానికీ; ఈ సిద్ధార్థుడు నాకు తెలియ రానివాడుగాను, పరాయివాడుగాను వుండడానికీ; ఒక్కటే కారణం. నన్ను చూచి నేను భయపడ్డాను. నన్ను వది లించుకోవలెనని అటు నిటు పరుగిడుతూ వచ్చాను. బ్రహ్మ పదార్థాన్ని వెదుకు తున్నాను. తెలియని అంతరాత్మను, సర్వవస్తుమూలాన్ని, పరమతత్వాన్ని తెలుసుకో దలచి, నన్నే నశింప జేసుకోడానికి, నన్నే వదిలించుకోడానికి పూను కున్నాను. కాని ఈ ప్రయత్నంలో మధ్య నన్నే పోగొట్టు కున్నాను.

సిద్ధార్థుడు తలయెత్తి చుట్టూ పరికించాడు. అతని ముఖంలో ఒక చిరునవ్వు మొలకెత్తింది. తనను పైకొని వుండిన ఒక దీర్ఘ స్వప్నంలోనుంచి మేలుకుంటున్నట్టు ఒక ప్రబలభావం కలిగింది. వెంటనే తన కర్తవ్యాన్ని గ్రహిం చినవానివలె త్వరత్వరగా ముందుకు నడిచాడు.

ఒక్కసారి బాగా ఊపిరిపీల్చి అనుకున్నాడు: "నిజమే సిద్ధార్థునినుంచి తప్పించుకోడానికి ఇక ప్రయత్నించను. ఆత్మనుగూర్చి, ప్రపంచ దుఃఖాలనుగూర్చి, ఆలోచిస్తూ కూర్చోను. అంతా నశించినతరువాత ఆ వెనకవుండే రహ స్యాన్ని గ్రహించడంకోసం నన్ను నేను నాశనం చేసుకోను. వేదాలను, యోగాలను, సాధనలను, అన్నిటిని కట్టిపెడ తాను. నాకు ఏ బోధలతోనూ ప్రసక్తిలేదు. నాకు నేనే శుశ్రూష చేస్తాను. నావల్లనే నేర్చుకుంటాను. ఈ సిద్ధా ర్థుడు ఎవరో ఆ రహస్యాన్ని నావల్లనే తెలుసుకుంటాను."

అదే తొలిసారిగా ప్రపంచాన్ని దర్శించినట్టు చుట్టూ పరికించాడు. ప్రపంచం అందంగా వింతగా విచిత్రంగా గోచరించింది. అదుగో నీలం – అదుగో పసుపు – అదుగో పచ్చన. ఆకాశం – నది – అడవి – పర్వతం – అన్నీ అందంగా విచిత్రంగా గూఢంగా మనోహరంగా తోచినవి. వాటి మధ్య – తాను సిద్ధార్థుడు మేల్కొని తన వద్దకు తిరిగి వస్తున్నాడు.

ఆ ప్రకృతి అంతా మొట్టమొదటిసారి – సిద్ధార్థుని కళ్ళముందు మెరిసింది – అది మారుడి తంత్రం కాదు – మాయముసుగు కాదు – అర్థరహితం కాదు – ఈ వైవిధ్యం కల్పితమనీ, ఛాయామాత్రమనీ, దీనిని నిరసించి ఏకత్వానికి ప్రాకులాడే బ్రాహ్మణపండితులు చెప్పేది ఏదీ కాదు. నది నదియే – పర్వతం పర్వతమే – సిద్ధార్థునిలో వున్న ఏకదివ్య పదార్థం ఆకాశనైల్యంలోనూ, నదీప్రవాహంలోనూ, గోప్యంగా వున్నట్టయితే, ఆకాశము – అడవి – ఈ సిద్ధార్థుడు అన్నీ వుండవలె నన్నదే దైవసంకల్పం, దైవశిల్పం కాకపోదు. అర్థము సత్యము ఎక్కడనో వెనుక దాక్కొని లేవు. ఆ వస్తువు లన్నింటిలోనూ వున్నవి.

"ఇన్నాళ్ళు ఎంత అంధప్రాయుడనుగా వుంటిని," అని అనుకున్నాడు సిద్ధార్థుడు. "ఎవరైనా ఒక గ్రంథాన్ని చదవ దలచుకొన్నప్పుడు దానిలో అక్షరాలన్నీ వట్టిగీతలనీ, మాయ అనీ నిరసించడు. ప్రతి అక్షరాన్ని ప్రతి పంక్తిని ఆసక్తితో చదువుతాడు. ఈ ప్రపంచమన్న గ్రంథాన్నీ నా స్వభావ మన్న గ్రంథాన్నీ చదువ పూనుకున్న నేను అక్షరాలనే

తృణీకరించాను. ఈ ప్రపంచం నీడవంటిది - వట్టి మాయ అనుకున్నాను. నా కళ్ళు నాలుక కూడా అంతే నను కున్నాను. ఇప్పటికి నాకు భ్రమ వదిలింద. నేను మేలు కున్నాను - ఈ నాడే నేను జన్మ ఎత్తాను:" ఈ విధమైన ఆలోచనలతో నడుస్తూ సిద్ధార్థుడు ఆకస్మికంగా - దారిలో పాము కనబడినట్టు - నిల్చున్నాడు.

ఆకస్మికంగా అతనికి ఒక ఆలోచన తట్టింది : తాను మేలుకున్నాడు - కొత్తజన్మ ఎత్తాడు - కాబట్టి పూర్తిగా కొత్తబ్రతుకు ప్రారంభించక తప్పదు. జేతవనం నుంచి బయలుదేరేటప్పుడు తిరిగి ఇంటికి వెళ్ళదా మనుకొన్నాడు. కాని ఈ క్షణంలో తాను పూర్వపుమనిషి కాడు - శ్రమ ణుడు కాడు - బ్రాహ్మణుడు కూడా కాడు. ఇంటికిపోయి ఏమి చేయవలెను ? వేదాధ్యయనమా ? యజ్ఞకర్మలా ? ధ్యానసాధనా ? ఆ నాటితో సిద్ధార్థునికి అవన్నీ ముగిసి పోయినవి.

ఒకక్షణకాలం చలనం లేకుండా నిల్చున్నాడు - దేహమంతా ఏదో చలిప్రాకినట్టు పులకరించింది. ఒంటరి చిక్కిన మృగం లాగా కంపించాడు. ఇల్లువదలి ఎంతో కాల మైంది. ఎన్నడూ ఈ విధంగా అనిపించలేదు. ఇదివరకు ధ్యానమగ్నుడై వుండినా, ఫలానితండ్రికొడుకును - ఉత్తమ బ్రాహ్మణవంశంలో పుట్టాను - శిష్టాచారసంపన్నుడను - ఈ భావాలు నిలిచివుండేవి. ఇప్పుడు తాను సిద్ధార్థుడు, మేల్కాంచిన సిద్ధార్థుడు - ఇంకేమీ కాడు.

నిట్టూర్చాడు – గడగడ వణికాడు. తన ఒంటరితనం తెలిసివచ్చింది. తన అభిజాత్యం వెనుకపట్టింది. ఒక వర్గానికి చెంది, దానిభాషను బ్రతుకును పాల్గొంటూ అదే ఆశ్రియ మనుకునే స్థితి తప్పిపోయింది. అడవిలో ఉండే శ్రమణుడుకూడా ఒంటరివాడు కాడు. ఒక కూటానికి చెందినవాడు. గోవిందుడు భిక్షుకుడైనాడు. అతనికి వేలకొలది భిక్షుకుల సాంగత్యం వున్నది. అతని వేషభాషలు బ్రతుకు అంతమందితో ముడివడి వుంటవి. కాని తాను – సిద్ధార్థుడు—ఎవరితో సంబంధించి వున్నట్టు? ఎవరి బ్రతుకుతో పాల్గొనేట్టు?

ఆ క్షణములో చుట్టూవున్న ప్రపంచమంతా కరిగిపోయింది. ఆకాశంలో నక్షత్రం లాగా ఒంటరిగా నిలబడి వున్నాడు. ఒక నిర్వేదభావం అతనిని ఆవరించింది. కాని, అతనికి ఎన్నడూ లేని ధైర్యం కలిగింది. అది చివరి ప్రసవ వేదనగా, మెలకువలో పరిభమస్పందంగా తోచింది. వెంటనే వడి వడిగా ఆత్రంగా ముందుకు నడిచాడు. వెనుక చూపులేకుండా ముందుకు నడిచాడు.



# 1. కమల



సిద్ధార్థునికి ప్రపంచమంతా మారురూపం పొందింది. అతడు ప్రపంచానికి అంత వశమై పోయినాడు. అడుగుతీసి అడుగు పెడితే అతనికి ఒక క్రొత్తసొగసు గోచరిస్తున్నది. సూర్యోదయం, సూర్యాస్తమయం, ఆకాశాన నక్షత్రాలు, చిన్నిపడవలాగా తేలిపోతున్న నెలవంక, మబ్బులు, అడవిలో తీగెలు, పొదలు, పూలు, సెలయేరు, ఉదయాన చెట్ల ఆకులపై తళతళలాడే మంచుచుక్కలు, దూరాని కగుపించే కొండలు, పక్షుల కలకలారావములు, తుమ్మెదల రొదలు, చేలమీదుగా మెల్లగా వీచే గాలులు, ఇంకా వేర్వేరు రంగులతో వేర్వేరురూపాలలో కనిపించే ఎన్నెన్నో దృశ్యాలు, ఇవన్ని అంతకుముందు వుండినవే. క్రొత్తగా వచ్చింది ఒకటీ లేదు.

అంతకుముందు ఆ దృశ్యాలన్నీ సిద్ధార్థుని కన్నులకు సత్యాన్ని కప్పివేసిన మాయముసుగులు. అవి గమనించ

తగినవి కావు. వాటిని గూర్చి ఆలోచించరాదు. దృశ్యమంతా అసత్యం - దృశ్యానికి అవతల వున్నది సత్యం. ఇప్పుడు సిద్ధార్థుని కన్నులు ప్రపంచాన్ని రక్తితో చూస్తున్నవి. ఈ ప్రపంచ స్వరూపాన్ని - దీనిలో తనస్థితినీ సిద్ధార్థుడు గ్రహించగలిగాడు. అతడు సత్యంకోసం ఎక్కడో అన్వేషించడంలేదు. అతని లక్ష్యం ఎక్కడో అవతలవైపున లేదు. ఈ దృష్టితో చూచినప్పుడు ప్రపంచమంతా అందంగానే కనిపిస్తున్నది. ఆ చూపులో అన్వేషణ లేదు. అది సహజమైన చూపు. పసిబిడ్డచూపు వంటిది. ఆలా పసిబిడ్డలాగా, అవిశ్వాసం లేకుండా, ఉన్నదానిని ఉన్నట్టుగా సద్యఃస్థితిని గ్రహించే అతనిచూపుకు అంతా అందంగానూ, ఆనందప్రదంగానూ గోచరిస్తున్నది.

ఆ ప్రకృతివిలాస మంతా ఎప్పుడూ అలాగే వున్నది. కాని ఆ విధంగా ఎన్నడూ అతనికి గోచరించలేదు. ఇది వరకు అతడు అక్కడ లేడు - ఇప్పుడు అక్కడ వున్నాడు. ఆ ప్రకృతికి సంబంధించి వున్నాడు - తన కళ్ళతో వెలుగు నీడలను చూస్తున్నాడు. మనస్సుతో, సూర్యుని, చంద్రుని నక్షత్రాలను అర్థం చేసుకుంటున్నాడు.

జేతవనంలో పొందిన అనుభవాన్ని ; బుద్ధుని ప్రవచనాలనూ; ఆయనతో తాను చేసిన సంభాషణనూ; గోవిందునితో వీడుకోలునూ అన్నిసంగతులు సిద్ధార్థుడు స్మరించుకున్నాడు - బుద్ధుడు పొందిన జ్ఞానానుభవమూ అందలి రహస్యమూ మాటలలో చెప్పడానికి బోధించడానికి సాధ్యమయ్యేది కాదని ఆయనతో తాను అన్నసంగతి జ్ఞప్తికి

వచ్చింది. ఆ రహస్యం ఈ నాడు తనకు అనుభవంలోకి వస్తున్నది. అప్పుడు ఏమీ తెలియనిస్థితిలో ఆలా మాట్లాడడం అతనికి ఆశ్చర్యంగా తోచింది.

తన అనుభవాన్ని తానే సంపాదించుకోవలెను. చాలా కాలం సిద్ధార్థుడు, తానూ - అంటే జీవుడు - పరమాత్మ ఒక్కటే అనుకుంటూ వచ్చాడు. కాని తానంటే ఎవరో అతనికి తెలిసింది కాదు. ఆలోచనలతో వలవేసి ఆ జీవపదార్థాన్ని పట్టుకోడానికి ప్రియత్నించాడు - నిజానికి ఈ దేహం, ఇంద్రియాలు, సంకల్ప వికల్పాలు, జ్ఞాన విజ్ఞానాలు, ఇవేవీ తాను - అంటే జీవుడు - కాదు. ఇంతకు ముందు వుండిన ఆలోచనలను ఆశ్రయించి కొత్త ఆలోచనలను కల్పించుకొంటూ తద్వారా అసలు వస్తువును తెలుసుకోడానికి ప్రయత్నించాడు. అలోచన ఈవలిగట్టును స్పృశిస్తుంది; కాని, ఆవలిగట్టును స్పృశించదు.

తన పాండిత్యంతోనూ ఆలోచనతోనూ అహంతను పోషిస్తూ దానిని చంపపూనుకున్న వానికి లక్ష్యం గోచరించదు. మనస్సు ఇంద్రియాలు గొప్పవే. కాని, వాటివెనుక దాక్కొని వున్నది చరమపదార్థం. మన ఇంద్రియాలను గమనించవలె. వాటితోనే వ్యవహరించవలె. వాటిని గర్హించకూడదు. వాటికి తగని విలువను కూడా ఈయకూడదు. కాని వాటి ప్రవృత్తులను జాగ్రత్తగా గమనించవలె. కాగా, అంతర్వాణి ఏలా ప్రబోధిస్తే ఆలా ప్రవర్తించవలెనని తేల్చుకొన్నాడు. అంతర్వాణి ప్రిబోధనను

తప్ప మిగతా దేనిని లక్ష్యపెట్టగూడ దనుకొన్నాడు సిద్ధార్థుడు.

బుద్ధత్వం కలిగిననాడు గౌతముడు బోధివృక్షం క్రింద ఎందుకు కూర్చున్నాడు? ఆయనకు హృదయకుహరంలో నుంచి ఒకవాణి వినిపించింది. ఆ వృక్షంక్రింద కూర్చోమని ఆ వాణి ప్రబోధించింది. ఆ క్షణంలో స్నానసంధ్యలను, యమనియమాలను, ఆహారనిద్రలను పట్టుకొని కూర్చోలేదు. ఆ వాణికి తలవొగ్గాడు. ఆలాగే బాహిరప్రబోధనను దేనిని లక్ష్యపెట్టకుండా అంతర్వాణికి తలవొగ్గడమే కర్తవ్యంగా నిర్ణయించుకున్నాడు సిద్ధార్థుడు.

ఆ రాత్రి సిద్ధార్థుడు ఒక పల్లెకారిగుడిసెలో పండుకున్నాడు. అతనికి ఒకస్వప్నం వచ్చింది. అందులో గోవిందుడు కనిపించాడు. కాషాయవస్త్రం కట్టుకున్నాడు. 'నన్ను ఎందుకు విడిచి వచ్చావు?' అని అడిగాడు గోవిందుడు. సిద్ధార్థుడు గోవిందుని గట్టిగా కౌగిలించుకున్నాడు. ముద్దుపెట్టుకోబోయినాడు. అంతలో గోవిందుడు మాయమైనాడు. తన కౌగిటిలో ఒక స్త్రీ వున్నది. ఆమె పాలిండ్లు పైటలోనుంచి తొంగిచూస్తున్నవి. సిద్ధార్థుడు వాటిమీద తల ఆనించి స్తన్యపానం చేశాడు. ఆ స్తన్యం మధురాతిమధురంగా వున్నది. స్త్రీ పురుషుడు సూర్యుడు చంద్రుడు అడవి జంతువు పూవు పండు అన్నింటివల్ల కలిగే ఆనందం అంతా ఆ స్తన్యంలో రుచిచూచాడు. 'నిషా' కలిగించేదిగా వున్నది ఆ రుచి. సిద్ధార్థుడు మేల్కొన్నాడు. గుడిసెముందుగా తళతళ

లాడుతూ ప్రవహిస్తున్నది నది. అడవిలో గుడ్లగూబ అరుపు స్పష్టంగా మోగుతున్నట్టు వినిపిస్తున్నది.

ప్రొద్దుపొడిచింది. నదిని దాటించమని సిద్ధార్థుడు పల్లెకారిని అడిగాడు. పల్లెకారి అతనిని వెదురుదోనెలో ఎక్కించి దాటించాడు. ఉదయకిరణాలు పడి నది మెరుస్తున్నది.

'ఎంత అందంగా వున్నది ఈ నది,' అన్నాడు సిద్ధార్థుడు. 'నిజమే – ఇది చాలా అందమైన నది. ఈ నదిమీద నాకు మహాప్రేమ. ఈ నది నాతో మాట్లాడుతుంది. ఎన్నిసార్లో విన్నాను దాని మాటలు. దానివైపే చూస్తూ కూచుంటాను. ఈ నదివల్ల నాకు ఎప్పుడూ ఏదో సంగతి తెలుస్తూవుంటుంది. నదివల్ల కూడా చాలా నేర్చుకోవచ్చు,' అన్నాడు పల్లెకారి.

'ఓయీ! నీకు కృతజ్ఞుడను. నీకు ఇవ్వడానికి నావద్ద ఏమీ లేదు. నేను బ్రాహ్మణశ్రమణుడను.'

'అది తెలుస్తూనే వున్నది. నీవల్ల ప్రతిఫలం నేను అపేక్షించడంలేదు. నీవే ఎప్పుడో ఒకప్పుడు ఇస్తావు.'

'అలాగా!'

'తప్పకుండా. ఆ సంగతికూడా ఈ నదివల్లనే తెలుసుకున్నాను. ప్రతిదీ తిరిగివస్తుంది. నీవుకూడా తిరిగివస్తావు– నీ స్నేహమే నాకు బహుమానం. నీవు దేవతలనుగూర్చి యజ్ఞాలు చేసేటప్పుడు నా సంగతి జ్ఞాపకం తెచ్చుకో.'

ఇద్దరూ విడిపోయినారు. పల్లెకారి చూపిన స్నేహభావానికి సిద్ధార్థుడు సంతోషించాడు. ఎవరిని చూచినా అతనికి గోవిందుని లాగానే కనబడుతున్నారు. ప్రతివానిలోనూ స్నేహము, ఉపకారబుద్ధి, కృతజ్ఞత కనిపిస్తున్నవి. ప్రతిమనిషిలో ఒక పసిబిడ్డ వుంటాడు కాబోలు ననుకున్నాడు.

మధ్యాహ్నం అయ్యేసరికి ఒక పల్లె చేరుకున్నాడు. వీధిలో పిల్లలు గోలీలు ఆడుకుంటున్నారు. అతనిని చూడగానే భయంవేసి, పరుగెత్తిపోయినారు. ఆ పల్లెప్రక్కన ఒక కాలువ పారుతున్నది. దానిలో ఒక పల్లెపడుచు గుడ్డలు ఉతుక్కుంటున్నది. సిద్ధార్థుడు నిలవబడ్డాడు. ఆ పడుచుపిల్ల తలయెత్తి చూచింది – చిరునవ్వు నవ్వింది. ఆమెకళ్ళలో ఒక తళుకు కనిపించింది అతనికి. 'పట్టణానికి ఇంకా ఎంతదూరం వుంటుంది, అమ్మాయి?' అని అడిగాడు. ఆమె లేచి అతని సమీపానికి వచ్చింది. ఆ లేతముఖంలో తడి పెదవులు ఆకర్షణీయంగా వున్నవి. ఆమె ఏదో ఛలోక్తిగా పలకరించింది– 'బువ్వతిన్నావా? శ్రమణులు రాత్రిళ్ళు అడవులలో ఒంటరిగా నిద్రపోతారుకదూ? అప్పుడు ఆడవాళ్ళు ప్రక్కన వుండకూడ దంటారు. నిజమేనా!' అని అడిగింది. ఈలా ప్రసంగిస్తూ ఏదో వింతసైగ చేసింది. అంటే ఆడది మగవానిమీద మనసుపోయినప్పుడు చేసే సైగ వంటిది.

అతనిలో రక్తానికి వెచ్చదనం కలిగింది. తన స్వప్నం జ్ఞప్తికి వచ్చింది. ఆమెవైపు కొంచెం వంగి స్తనచూచుకాలను చుంబించాడు. వెంటనే తలయెత్తి చూశాడు. ఆమె ముఖంలో చిరునవ్వు తాండవిస్తున్నది. అరమూతకన్నులు

అభిలాషతో ఆహ్వానిస్తున్నవి. సిద్ధార్థుని హృదయంలో కామస్పందం కలిగింది. ఇంతవరకు అతడు స్త్రీని స్పృశించి యెరగడు. ఆమెను కౌగిలిలోనికి లాక్కోడానికి చేతులు సిద్ధపడినా ఆతనికి జంకు కలిగింది. అంతర్వాణి "వద్దు" అన్నట్టుగా వినిపించింది. ఆ శబ్దం వినిపించగానే ఆ ముఖం లోనూ ఆకళ్లలోనూ అదివరకు చూచిన ఇంద్రజాల మంతా విచ్చిపోయింది. ఒక కాముక స్త్రీ మాత్రమే కనిపించింది అతని కళ్ళకు. ఆమెను భగ్నహృదయగా విడిచి సిద్ధార్థుడు వెళ్లిపోయినాడు.

ఆనాడు సాయంవేళకు ఒక నగరం చేరుకున్నాడు. ఆ నగరం వెలుపల ఒక తోట వున్నది. ఆ తోటలోకి కొందరు నౌకరులు బరువైన తట్టలు మోసుకొని వెళ్ళు తున్నారు. మధ్య నలుగురు మనుష్యులు ఒక పల్లకిని మోస్తు న్నారు. ఆ పల్లకిలో ఒక స్త్రీ పట్టుపరుపుమీాద కూర్చొని వున్నది. ఆమె ఆ తోట యజమానురాలు. ఆ పల్లకిలోని స్త్రీని చూస్తూ సిద్ధార్థుడు నిలబడ్డాడు. నిగనిగలాడే కేశ భారం, అతి మధురమైన వదనం, బింబఫలంవంటి పెదవులు, విలువంపు కనుబొమలు, నీడలుకట్టే కన్నులు, నునుపైన మెడ, ధరించిన పసరువన్నె బంగారంచు చీర, తామర తూడులవంటి చేతులు, మణికట్టులకు బంగారు గాజులు— ఆ విగ్రహం సిద్ధార్థుని కళ్ళను మిరుమిట్లు గొలిపింది.

పల్లకి తన ప్రక్కకు రాగానే సిద్ధార్థుడు గౌరవ సూచకంగా తల వంచుకున్నాడు. తలయెత్తి ఒక క్షణ కాలం ఆమె ముఖాన్ని చూచాడు. ఏదో సుగంధం అతని

ఘ్రాణేంద్రియానికి సోకింది. ఆ స్త్రీ అతనివైపు చూచి ఆమోదసూచకంగా తలవూపి ఒక్క చిరునవ్వు నవ్వింది. అంతలో పల్లకి తోటలోకి పోయింది.

ఈ నగరానికి మంచి నక్షత్రంలో వచ్చాను అనుకున్నాడు సిద్ధార్థుడు. ఆ తోటలోకి వెంటనే పోవలె నని పించింది. మళ్ళా ఆలోచించాడు. ఆ సేవకులు తనవైపు అసహ్యంగా చూచిన సంగతి జ్ఞప్తికి వచ్చింది. ఈ శ్రమణ వేషంతో పోగూడ దనుకున్నాడు. ఎవరినో అడిగి సుప్రసిద్ధ వేశ్య కమలది ఆతోట అని తెలుసుకున్నాడు. ఆ తోట గాక ఆమెకు నగరంలో వేరొకభవనంకూడా వున్నట్టు తెలిసింది.

సిద్ధార్థుడు నగరంలోకి వెళ్ళాడు. వీధులలో తిరిగాడు. ఒక మంగలితో పరిచయం చేసుకున్నాడు. తెల్లవారగానే తనకు ముందుగా క్షురకర్మ చేయవలె నని చెప్పాడు. నది వొడ్డున ఒక పడవమీద పండుకొని ఆ రాత్రి గడిపాడు. సూర్యోదయం కాకముందే మంగలివద్దకు వెళ్లి గడ్డాన్ని తీసివేయించుకున్నాడు. శిరోజాలు చిక్కు తీయించుకున్నాడు. సుగంధతైలం రాయించుకున్నాడు. నదికి వెళ్ళి చక్కగా స్నానం చేశాడు.

ఆరోజు మధ్యాహ్నం కమల తోటకు వచ్చేవేళకు వాకిట హాజరుగా నిల్చున్నాడు. అంతలో పల్లకి వచ్చింది. నిన్నలాగానే గౌరవసూచకంగా తల వంచాడు. ఆమోద సూచకంగా ఆమెకూడా తల వూపింది. వెనక చిక్కిన ఒక నౌకరును పిలిచాడు. ఒక బ్రాహ్మణయువకుడు మీతో మాట్లాడడానికి వచ్చి కాచుకొని వున్నాడు. లోప

లికి రావచ్చునా అని మీ యజమానురాలిని కనుక్కురమ్మని పంపాడు. ఆ నౌకరు తిరిగివచ్చి సిద్ధార్థుని లోపలికి పిలుచుకొని వెళ్ళాడు. అక్కడ కమల మృదుతల్పంమీద పండుకొని వున్నది. అతనిని ప్రవేశపెట్టి శలవు తీసుకొని నౌకరు బైటికి వెళ్ళాడు.

"నిన్న బైట నిలబడి నాకు వందనం చేశావుకదూ" అని అడిగింది కమల.

"అవును నిన్న చూచాను. వందనం చేశాను."

"కాని నీకు గడ్డం వున్నదికాదూ? నీ దీర్ఘకేశాల నిండా దుమ్ము కమ్ముకొని వున్నట్లు జ్ఞాపకం."

"అదికూడా నిజమే. నీవు సిద్ధార్థుని చూచావు. అతడు ఒక బ్రాహ్మణకుమారుడు. శ్రమణులలో చేరవలెనని ఇల్లు వదలి వెళ్ళాడు. మూడు సంవత్సరాలు శ్రమణుడుగా వున్నాడు. ఆ మార్గాన్ని వదిలిపెట్టి, నిన్న ఈ నగరం చేరుకున్నాడు. ఈ నగరంలో అతడు మొట్టమొదట చూచింది నిన్నే. సిద్ధార్థుడు రెప్పలు వాల్చకుండా మాట్లాడిన మొదటి స్త్రీవి నీవే. ఇకముందు ఒక సౌందర్యవతిని చూచినప్పుడు సిద్ధార్థుడు రెప్పలు వాల్చడు. ఈ సంగతి నీకు చెప్పడానికే వచ్చాను."

"ఈ సంగతి చెప్పడానికేనా సిద్ధార్థుడు నా వద్దకు వచ్చింది?"

"ఇంతే కాదు. నీ అతిలోకసౌందర్యాన్ని అభినందించడానికి కూడా. కమలా! ఈ సిద్ధార్థుడు ఒక వరం

కోరుతున్నాడు. నీకు సమ్మతమైతే ఈ సిద్ధార్థుని నీ శిష్యునిగా గ్రహించు. నీవు ఆచార్యత్వం వహించిన కళలో ఈ సిద్ధార్థునికి బొత్తుగా ప్రవేశం లేదు.''

కమల ఆ మాటలకు విరగబడి నవ్వుతూ అన్నది:-

''నా అనుభవంలో ఇంతవరకు ఒక శ్రమణుడు నా వద్ద శుశ్రూష చేస్తానంటూ రాలేదు. జడలు పెంచుకొని, కాషిగుడ్డలు కట్టుకునే శ్రమణులు నా వద్దకు ఎన్నడూ రారు. పెక్కుమంది యువకులు - బ్రాహ్మణయువకులుకూడా - నా వద్దకు వస్తారు. కాని వారు అందమైన దుస్తులతో, సుగంధాలు విరజిమ్ముతూ సంచులలో ద్రవ్యాన్ని నింపుకొని నా వద్దకు వస్తారు.''

''కమలా! నీవద్ద శుశ్రూషను ఇదివరకే ప్రారంభించాను. నిన్ననే కొంత నేర్చుకున్నాను. నిన్న నీవు చూచినదాడి ఈనాడు లేదు. నా కేశాలలో దుమ్ము వదిలింది. సుగంధతైలం రాచి దువ్వుకున్నాను. ఇక కావలసినది అందమైన వేషము, ద్రవ్యము. సిద్ధార్థుడు ఎన్నో దుర్ఘటకార్యాలను సాధించాడు. ఈ అల్పవస్తువులను సంపాదించుకో నేరడా? కమలా! ఈ రెంటిని సంపాదించుకునేవరకు సిద్ధార్థుడు నీ శుశ్రూషకు అర్హుడు కాడా?''

''కాడు! చక్కని వేషము, సంచిలో రొక్కము, కమలకు బహుమానములు, ఇవి తప్పవు. అడవినుంచి దిగి వచ్చిన శ్రమణుడా! అర్థమైందా?''

''బాగా అర్థమైంది. ఆ పెదవులనుంచి వచ్చిన మాటలు అర్థం కాకపోవడ మేమిటి? కమలా! నీ పెదవులు

రెండుగా చీలిన దొండపండులాగా వున్నవి. నా పెదవులు కూడా అలాగే వున్నవికదూ! నీ పెదవులకు నా పెదవులకు బాగా పొందిక కుదురుతుంది. కాని, కమలా! శ్రమణుడంటే నీకు భయం లేదా?''

''ఆడదానిని గూర్చి ఓనమాలు తెలియని శ్రమణుని చూస్తే భయమెందుకోయి?''

''కమలా! శ్రమణుని మహిమ ఏ మనుకున్నావూ? నిన్ను బలవంతంగా లోబర్చుకోగలడు. నిన్ను దోచగలడు. నిన్ను బాధించగలడు.''

''అలాగా! నాకు ఆ భయం లేదు. ఒక శ్రమణునికి గాని, ఒక బ్రాహ్మణునికి గాని తన విజ్ఞానాన్ని, తన ధర్మ నిష్ఠను, తన ధీశక్తిని ఎవ్వరైనా బాధించి బలవంతంగా దోచుకుంటారనే భయం వుంటుందా? వుండదు. ఎందుకని? అవి అతనికి సంబంధించినవి. అతనివశంలో వున్నవి. అందులో తనకు ఇష్టమైనది, ఇష్టమైనంత ఇతరులకు ఇవ్వ గలడు. అలాగే కామవిద్యలో కమల కూడాను. కమల పెదవులు దొండపండులాగా వున్నవి కదూ! కమల ఇష్టం లేకుండా వాటిని ముద్దుపెట్టుకొని చూడు! వాటిలో నీకు ఒక్క మధుకణం కూడా లభించదు. ఆ తీయదనాన్ని ఏలా ఈయవలెనో ఆ పెదవులకే తెలుసు. ఇవ్వడంగాని ఇవ్వక పోవడంగాని ఆ పెదవులవశంలో వుంటుంది. సిద్ధార్థా! నీవు మంచి శిష్యుడవు. కాబట్టి ఈ రహస్యం గ్రహించు. ప్రేమను ఆశ్రయించి పొందగలవు. ధన మిచ్చి పొందగలవు.

ఇష్టపడి ఇస్త్రీ తీసుకోగలవు. కాని ప్రేమను దొంగిలించలేవు. యువకుడా! నీవు ప్రేమను అపార్థం చేసుకున్నావు."

"కమలా! నీవు చెప్పింది అక్షరాలా నిజం. నీ పెదవులనుంచి కాని నా పెదవుల నుంచికాని ఒక్క మధుబిందువైనా వృధగా పోగూడదు. సిద్ధార్థుడు మంచివేషంతో సంచినిండా రొక్కంతో తిరిగి నీ దర్శనం చేస్తాడు. కాని, కమలా! నాకు కొంచెం సలహా చెప్పగలవా?"

"అలాగే".

"కమలా! ఈ రెండు వస్తువులను త్వరగా సంపాదించే సాధన మేమిటి?"

"మిత్రుడా! ఈ సాధనం తెలుసుకోవలె నని చాలా మందికి వుంటుంది - కాని నీకు ఏ వృత్తిలో ప్రజ్ఞ వుంటే దానిద్వారా ధనం సంపాదించుకోవలె. ఇంకొక మార్గం లేదు."

"నేను ఆలోచించ గలను - వేచి వుండగలను - పస్తులుండ గలను."

"అంతేనా? ఇంకేమీ చేతగాదా?"

"అంతే - ఆఁ - కవిత్వం చెప్పగలను. కమలా! ఒక్క పద్యానికి ఒక్కముద్దు ఇవ్వగలవా?"

"నీ పద్యం నాకు నచ్చితే ఆలాగే - ఏదీ చెప్పు."

ఒక్కక్షణకాలం ఆలోచించి సిద్ధార్థుడు ఈపద్యం చదివాడు—

"కమలాసుందరి తనతోటలోకి వెళ్ళింది,
తోటవెలుపల నిలబడి వున్నాడు శ్రమణుడు,

తామరపూవును చూచి శ్రమణుడు,
వినయంతో తలవంచాడు—
చిరునవ్వుతో ఆమోదించింది కమల''—
''ఎవరో దేవతల కెందుకు పూజలు
ఎదుట వుండగా సుందరి కమల,
కమలకు చేసిన పూజ మే లని,
తలచాడు, ఆ శ్రమణకుమారుడు.''

చేతుల బంగారుగాజులు గలగల మనేట్టు కమల కరతాళధ్వని చేసింది. ''నీ కవిత్వం చాలా బాగున్నది. ఈ పద్యానికి ఒక్క ముద్దు ఈయవచ్చు.''

కమల కనుచూపులతో అతనిని చేరపిలిచింది. అతను కమల మొగందగ్గర మొగం పెట్టాడు. ఆమె పెదవులమీద తన పెదవులు ఆనించాడు. కమల గాఢంగా ముద్దు పెట్టుకున్నది. ఆ ముద్దులో ఆమె ఎంత బోధించిందో, ఎంత చాకచక్యం చూపిందో, తనను ఎంత లోబర్చుకొన్నదో, ఎంత లాలించిందో, సిద్ధార్థుడు తలుచుకొని ఆశ్చర్యపడుతున్నాడు. ఆ సుదీర్ఘ చుంబనం – తరువాత – చుంబన పరంపర. ఒక్కొక్క దానిలో ఒక్కొక్క రుచి. సిద్ధార్థునికి ఊపిరి సలపలేదు. తన కళ్ళముందు ఉన్మీలన మయ్యే ప్రజ్ఞావిశేషానికి ఒక పసిబిడ్డలాగా విస్తుపోయి చూస్తున్నాడు.

''నీ కవిత్వం చాలా బాగుంది. కాని కవిత్వంతో ధనాన్ని సంపాదించడం సాధ్యపడదు. నీకు కమలస్నేహం కావలె నంటే ధనం సంపాదించక తప్పదు.'' అన్నది కమల.

"కమలా! నీ ముద్దులో ఎంత ప్రజ్ఞ చూపావు!"

"అవును - అందుకే ఈ వైభవమంతా నాకు లభించింది. అయితే నీవు ఏమి చేయదలచావు? ఆలోచనలు, వస్తువులు, కవిత్వాలు - ఇంతకంటే నీకు ఏమీ చేత కాదా?"

"నాకు యాజ్ఞికం తెలుసును. కాని అది వదిలిపెట్టాను. నాకు ప్రయోగాలు చేయడం కూడా తెలుసును. అదీ మానుకున్నాను. మతగ్రంథాలు చదివాను."

"చదవడం, వ్రాయడం తెలుసునా?"

"దానికేమి! చదవడం వ్రాయడం ఎంతమందికో తెలుసు."

"ఎంతమందికి తెలుసు? నాకు రాదు. అవి తెలియడం మంచిదే. మంత్రప్రయోగాల అవసరం కూడా వుంటుంది."

ఆ సమయంలో ఒక నౌకరు వచ్చి కమలతో ఏమో రహస్యంగా చెప్పాడు.

"నాకోసం ఎవరో వచ్చారు. సిద్ధార్థా! నీ విక్కడ వుండగూడదు. నిన్నెవ్వరు చూడగూడదు. రేపు కలుసుకుందాం. వెళ్ళు." అన్నది కమల. ఒక నౌకరును పిలిచి సిద్ధార్థునికి తెల్లని వస్త్రాలిచ్చి బైటికిపోవడానికి దారి చూపమని చెప్పింది. ఆ నౌకరు సిద్ధార్థుని చుట్టుదారిని ఒక మందిరంలోకి తీసుకొనివెళ్ళి తెల్లని వస్త్రాలిచ్చి బైటికి పంపాడు.

సిద్ధార్థుడు నగరంలోకి వచ్చాడు. ఒక సత్రంముందు నిలబడి అన్నం పెట్టమని అడిగాడు. ఎవరో అన్నం తెచ్చి అతని ఒడిలో వేశారు. రేపటినుంచి భిక్షాటనం మానుకో వలె ననుకొన్నాడు. అంతలో అతనికి అభిమానం వేసింది. తా నిప్పుడు శ్రమణుడు కాడు. అడుక్కోవడం తనకు తగిన పనికాదు. అన్నం ఒక కుక్కకు వేశాడు. ఆరోజుకు పస్తు పండుకొన్నాడు. "ఈ బ్రతుకే బాగున్నది. శ్రమణుని జీవితంలో అంతా కష్టమే. అంత్యానికి నిరాశకూడా. ఇంతకూ నాకు కావలసినవి – వేషము, ద్రవ్యము. వీటి కోసం నిద్రాహారాలు మానుకోనక్కరలేదు" అనుకున్నాడు.

నగరంలో కమలభవనం ఎక్కడో విచారించి మరు సటిరోజు వెళ్ళాడు. అతనిని చూడగానే కమల అన్నది– "అంతా అనుకూలంగానే వున్నది. ఈ నగరంలోని షాహుకారులలో ముఖ్యుడు కామస్వామి. చాల ధన వంతుడు. అతడు నీ కోసం ఎదురు చూస్తూవుంటాడు. నీవు వెళ్ళి అతనిని చూడు. అతనికి నచ్చితే నిన్ను పనిలో చేర్చు కుంటాడు. తెలివితో ప్రవర్తించు. ఒకరిద్వారా నీ పేరు అతనికి శిఫారసు చేయించాను. అతనితో స్నేహంగా మెలగవలె. అతనిమాట ఎంతైనా చెల్లుబడి అవుతుంది. కాని అతి వినయంగా వుండబోకు. నీవు అతనికి సేవకుడుగా ప్రవర్తించగూడదు. సమానంగా ప్రవర్తించవలె. ఆలా వుంటేనే నాకు సంతోషం. కామస్వామి పెద్దవాడు అవుతు న్నాడు. మాంద్యం ప్రబలింది. అతనికి నచ్చేటట్టు మెలగితే నీ మీద పూర్తినమ్మకం వుంచుతాడు."

సిద్ధార్థుని ముఖం వికసించింది. కమలకు కృతజ్ఞత తెలుపుకున్నాడు. ముందురోజు ఆ రోజు సిద్ధార్థుడు పస్తువుండి నట్టు కమల గ్రహించింది. వ్యంజనాలతోసహా అన్నం తెప్పించింది. స్వయంగా వడ్డించింది. సిద్ధార్థుడు తృప్తిగా తిన్నాడు.

"నీకు మంచి అదృష్టం పట్టింది. ఒకద్వారం తరువాత ఒకద్వారం తెరుచుకుంటున్నవి నీముందు. నీ దగ్గర ఏదైనా మంత్రౌషధి వున్నదా?" అన్నది కమల.

"ఆలోచన, ప్రతీక్షణ, ఉపవాసం వీటినిగూర్చి నిన్న నీకు చెప్పాను. అవి ప్రయోజనకరము లని నీవు నమ్మలేదు. కమలా! ముందుముందు నీకే నమ్మకం కలుగుతుంది. పనికి మాలిన శ్రమణునికికూడా ఉపయోగకరములైన విషయాలు చాలా తెలుసునని నీవే గ్రహిస్తావు. మొన్న నేనొక బికారిని. నిన్న కమలను ముద్దుపెట్టుకున్నాను. నేడో రేపో షాహుకారిని కాబోతున్నాను. ద్రవ్యమే కాదు. నీవుకోరే అన్ని హంగులు లభిస్తవి."

"సరే! కమల లేకపోతే నీ పని ఏమైవుండేది? కమల సాయపడకుంటే నీవు ఎక్కడ వుండేవాడవు?"

"కమలా! నీ తోటముందు నిన్ను చూచిన క్షణంలోనే నేను ప్రథమ ఘట్టంలో అడుగు పెట్టాను. పరమసుందరిని ఆశ్రయించి ప్రణయవిద్యను గడించవలె నని నా సంకల్పం. ఆ సంకల్పం కలిగినప్పుడే నాకు తెలుసును. దానిని సాధించ గలనని. నీవు సాయపడుతావని నాకు తెలుసును, నీ ప్రథమ వీక్షణంలోనే ఆ సంగతి నేను గ్రహించాను."

"నేను ఇష్టపడక పోతే?"

"కాని ఇష్టపడ్డావు, కమలా! నీటిలో రాయివేస్తే అది సూటిగా అడుగుకు పోతుంది. సిద్ధార్థునికి ఒక సంకల్పం ఒక లక్ష్యం ఏర్పడినప్పుడు కూడా అంతే- సిద్ధార్థుడు ఏమీ చేయడు. ఆలోచిస్తాడు. ప్రతీక్షిస్తాడు. ఉపవసిస్తాడు. నీటిలోకి ఆరాయి పోయినట్టే లౌకికవ్యవహారంలో సిద్ధార్థుడు ఏమీ చేయకుండా, క్షోభపడకుండా తన్నుతాను వదిలివేస్తాడు. ఏదో లోపలికి లాక్కుపోతుంది. అతనిలక్ష్యమే అతనిని లాగుతుంది. ఆ లక్ష్యానికి ప్రతికూలమైన ఏ భావాన్నీ మనసులోనికి రానీయడు. అదే సిద్ధార్థుడు శ్రమణులవద్ద నేర్చినవిద్య. దానినే అవివేకులు ఇంద్రజాల మనుకుంటారు. దయ్యాలు భూతాలు అనుకుంటారు. దయ్యాలు భూతాలు ఎక్కడా లేవు. ప్రతివాడు ఇంద్రజాలం చేయవచ్చు, తన లక్ష్యాన్ని సాధించవచ్చు. కాని, ఆలోచన- ప్రతీక్షణ- ఉపవాసం చేయగలిగి వుండాలి."

కమల ఆతనిమాటలు విన్నది. ఆతని కంఠస్వరమూ, ఆతని చూపులు కమలను ఆకర్షించినవి.

"నీవు చెప్పినదంతా నిజమే కావచ్చును. సిద్ధార్థుడు అందకాడు కావడం, ఆతనిచూపు స్త్రీలను ఆకర్షణీయం కావడం అతని అదృష్టమేమో!" అన్నది కమల.

సిద్ధార్థుడు కమలను ముద్దుపెట్టుకున్నాడు. "ఓ గురుదేవీ! ఆలాగే కావచ్చును. నాచూపులు ఎల్లప్పుడూ నిన్ను సంతోషపెట్టునుగాక! నీ ద్వారా ఎల్లప్పుడూ నాకు శుభం కలుగును గాక!" అంటూ సిద్ధార్థుడు వెళ్ళాడు.



# 2. ప్రజలలో



సిద్ధార్థుడు కామస్వామిని చూడడానికి వెళ్ళాడు. ఆ యిల్లు ఒక పెద్దమహలు. నౌకరులు అతనిని తివాసీలమీద నడిపించుకుంటూ లోపలికి తీసుకవెళ్ళారు. యజమాని కోసం నిరీక్షిస్తూ గదిలో కూర్చున్నాడు.

కామస్వామి వచ్చాడు. ఇద్దరు స్నేహసూచకంగా వందనాలు తెలుపుకున్నారు. "నీవు బ్రాహ్మణుడ వనీ, పండితుడ వనీ, ఉద్యోగంకోసం తిరుగుతున్నా వని విన్నాను. అయితే జరగక ఉద్యోగంలో చేరదలచా వన్నమాట" అన్నాడు షాహుకారు.

"నాకు జరగక పోవడమనేది ఏనాడూ లేదు. నేను చాలాకాలం శ్రమణులతో కలిసి వున్నాను. అక్కడ నుంచే వచ్చాను."

"అయితే నీకు జరుగుబాటు ఏలాగు? మీా శ్రమణులకు ఆస్తిపాస్తులు వుండవుగా?"

"నాకు ఆస్తిలేనిమాట నిజమే. స్వబుద్ధితోనే నేను ఆస్తిని వదులుకున్నాను. దాని అవసరం కూడా నాకు లేదు."

"అయితే బ్రతకడం ఏలాగు?"

"ఆ సంగతి ఎప్పుడూ నేను ఆలోచించలేదు. మూడు సంవత్సరాల నుంచి ఈలాగే వున్నాను. బ్రతకడం ఏలా గన్న ప్రశ్నే నాకు తట్టలేదు."

"అయితే ఇతరుల ఆస్తిమీద ఆధారపడి బ్రతుకుతున్నా వన్నమాట"

"కావచ్చు - షాహుకారుకూడా ఒకరిమీద ఆధార పడే బ్రతుకుతాడు."

"అయితే ఇతరుల వద్దనుంచి ఊరికే సొమ్ము తీసుకోడు. తన సరుకు లిచ్చి సొమ్ము తీసుకుంటాడు షాహుకారు."

"లోకం పోకడ ఆలాగే వుంటుంది. ప్రతివాడు ఒకటి యిచ్చి వేరొకటి తీసుకొంటాడు. బ్రతుకే ఆలాంటిది."

"నీకు ఆస్తి లేదుగదా! నీ వేమి ఇవ్వగలవు?"

"ప్రతివాడు తన కున్నది ఇస్తాడు. సైనికుడు బలాన్ని, వర్తకుడు సరుకులను, ఉపాధ్యాయుడు విద్యను, కర్షకుడు ధాన్యాన్ని ఈ విధంగా ఇస్తారు."

"నీవు ఇవ్వగలిగింది ఏమిటి?"

"నేను ఆలోచించ గలను. వేచియుండగలను. వస్తులు చేయగలను."

"ఇంతేనా?"

"ఇంతే."

"వీటివల్ల ఏమి ప్రయోజనం? ఉపవాసం ఏమి సంపాదిస్తావు?"

"దానిలో చాలా ప్రయోజనం వున్నది. తినడానికి తిండిలేనప్పుడు ఉపవాసంచేయడమే తెలివిగలపని. నాకు ఉపవాసం అలవాటులేకపోతే ఈ నాడు ఏదో చాకిరిచేయక తప్పేది కాదు. ఆకలిమంటే ఆ పని చేయించేది. కాని నేను శాంతంగా వేచివుండగలను. ఆకలికి ఓర్చుకుంటాను. చాలాకాలం అణుచుకుంటాను. నవ్వుకుంటాను. ఉపవాసంవల్ల నాకు ఎంతో మేలు కలిగింది."

"క్షణంసేపు కూర్చో; ఇప్పుడే వస్తాను." అని కామస్వామి లోపలికిపోయి కొన్ని కాగితాలు తెచ్చి సిద్ధార్థుని కిచ్చి, వాటిని చదవమన్నాడు. అవి అమ్మకపు ఖరారు కాగితాలు. వెంటనే సిద్ధార్థుడు చదివి వివరాలన్నీ చెప్పాడు. తరువాత కామస్వామి అతనిచేతికి ఒక కాగిత మిచ్చి ఏదైనా వ్రాయమన్నాడు. "వ్రాయడం మంచిదే, ఆలోచించడం ఇంకా మంచిది. తెలివిగలిగి వుండడం మంచిదే, ఓర్పుగలిగి వుండటం ఇంకా మంచిది" అని సిద్ధార్థుడు ఆ కాగితం మీద వ్రాసి యిచ్చాడు. కామస్వామి చదువుకున్నాడు. "నీవు చక్కగానే వ్రాస్తావు. అయితే మనం మాట్లాడుకోవలసిన సంగతులు ఎన్నో వున్నవి. ఈ నాడు నీవు నాకు అతిథిగా మా యింట్లోనే వుండు" అన్నాడు.

ఆరోజునుంచి సిద్ధార్థుడు కామస్వామి ఇంటిలోనే వున్నాడు. స్నానపానాదిసౌకర్యా లన్నీ కామస్వామి కల్పిస్తున్నాడు. ఒక్కపూటమాత్రమే భోజనం చేసే వాడు. మద్యమాంసాలు ముట్టేవాడు కాడు. కామస్వామి అతనికి వ్యాపారవిషయా లన్నీ బోధపరచాడు. అన్ని రహస్యాలు తెలుసుకున్నాడు. అన్నివ్యవహారాలు చూస్తు న్నాడు. మితంగా మాట్లాడేవాడు. కమల ఆదేశించిన ప్రకారం కామస్వామికి లొంగకుండా సరిసమానంగా ప్రవర్తించేవాడు. వ్యాపారవిషయంలో కామస్వామికి మహాజాగ్రత్త, తగని ఆసక్తి. అన్నిపనులు చూస్తూ వుండినా సిద్ధార్థునికి అదంతా ఒక ఆటగా, విలాసంగా వుండేది. ఏవీ అతని హృదయాన్ని సోకేవి కావు.

ప్రతిరోజు సిద్ధార్థునికి కమల కబురు పంపేది. అంద మైన దుస్తులు ధరించి బహుమానాలు తీసుకొని వెళ్ళే వాడు. ఆమె యెర్రని పెదవులు అతనికి ఎన్నోవిషయాలు నేర్పినవి. లేత చివుళ్ళవంటి ఆమె చేతులు అతనిని బాగా తరిబీతు చేసినవి. కాని కామకళలో అతనికి ఇంకా పసి తనం వదలలేదు. కళ్ళుమూసుకొని తీరని తమితో కమలా శృంగారసరస్సులో మునిగి తేలుతున్నాడు.

సుఖాన్ని అనుభవించవలె నంటే సుఖాన్ని ఇవ్వడం నేర్చుకోవలెననీ; ప్రతిభంగిమ, ప్రతిలాలన, ప్రతిస్పర్శ, ప్రతిచూపు, దేహంలోని ప్రతిఅంగమూ, గ్రహించగలవానికి ఒక ఆనందాన్ని అందించ గలవనీ అతడు కమలశిక్షణవల్ల నేర్చుకొంటున్నాడు. సంప్రయోగసమయంలో ఒకర్ని

ఒకరు మెచ్చుకోవడమూ, ఒకరిని ఒకరు జయించడమూ, జయించబడడమూ లేకుండా ఇద్దరు విడిపోరాదనీ; అలా జరిగినప్పుడే ప్రేమికులు పూర్తి సంతృప్తికానీ, అసంతృప్తి కానీ పొందకుండా పరస్పరరక్తిని నిలుపుకోగలరనీ; తాను అక్రమంగా వినియోగించుకున్నాను, అక్రమంగా వినియోగించబడ్డాను అన్న అసహ్యాభావం ఇద్దరికీ కలగదనీ; అతనికి కమల అభ్యాసపూర్వకంగా ఉపదేశించింది.

సిద్ధార్థుడు కమలకు శిష్యుడు, ప్రియుడు, మిత్రుడు. కమలతో గడిపే కాలం అద్భుతంగా వుండేది. ప్రస్తుతం అతని జీవితపరమార్థం కమల విలాసాలతో ముడిపడి వున్నది, కామస్వామివ్యాపారంతో కాదు.

ఉత్తర ప్రత్యుత్తరాలు నడపడం, కొనుగోలు అమ్మకాలు జరపడం ఈ పనంతా సిద్ధార్థునికే అప్పగించాడు కామస్వామి. అన్నిముఖ్యవిషయాలలో అతనితో సంప్రతిస్తూ వున్నాడు. ఆతనిని గూర్చి కామస్వామి ఒక స్నేహితునితో ఈలాచెప్పాడు. "ఈ మనిషికి సరుకుల నాణెం అంతగా తెలియదు. కాని నాకు అలవడని ఒక శుభలక్షణం ఇతనిలో వున్నది. తొందరపాటులేకుండా నెమ్మదిగా మంచి అభిప్రాయం కలిగేట్టుగా అందరితో మాట్లాడుతాడు. వారు చెప్పేది కూడా ఆలాగే వింటాడు. ఇతనికి వ్యాపారస్వభావం లేదు. అందులో మనస్సు మగ్నం కాదు. కాని అదృష్టం దానంతట అది కలిసివచ్చే రహస్యం ఇతనిలో వున్నది. అది జన్మనక్షత్రబలమో శ్రమణుల దగ్గరనేర్చిన తంత్రమో కావలెను. వ్యాపారాన్ని ఒక

ఆటగా చూస్తాడు. లాభంవచ్చినా నష్టంవచ్చినా మనసుకు పట్టించుకోడు.'' కామస్వామికి ఆ మిత్రుడు ఈలా సలహా చెప్పాడు: ''ఇతనికి వ్యాపారలాభాలలో మూడోభాగం పెట్టి. నష్టంవచ్చినా తనవాటా పంచుకోవలెనని చెప్పు. అతనికే ఉత్సాహం కలుగుతుంది.''

కామస్వామి ఆలాగే ఏర్పాటు చేశాడు. ఆ మార్పు కూడా సిద్ధార్థునిమీద పనిచేయ లేదు. లాభం వచ్చిన నాడు పొంగిపోయే వాడు కాడు. నష్టం వచ్చిననాడు క్రుంగి పోయేవాడు కాడు. ''సరే పోనీ'' అనుకునేవాడు.

ఒక పర్యాయం ధాన్యం ఖరీదు చేయడానికి ఒక గ్రామానికి వెళ్ళాడు. అతడు వెళ్ళేటప్పటికి ధాన్యం అమ్మక మైంది. తిరిగి రాకుండా దీర్ఘకాలం ఆ గ్రామంలోనే వున్నాడు. అక్కడ రైతులతో వినోదప్రసంగాలు చేస్తూ, పిల్లలకు పైసాలు పంచిపెడుతూ, పెండ్లి పేరంటాలకు హాజరవుతూ తృప్తికరంగా కాలం గడిపి తిరిగి వచ్చాడు. కామస్వామికి చాలా కోపం వచ్చింది. సిద్ధార్థుడు అన్నాడు; ''మిత్రమా! కోపంవల్ల ఏమీ లాభించదు. నీకు నష్టం కలిగితే అదంతా నేను భరిస్తాను. ఈ ప్రయాణం నాకు చాలా తృప్తికరంగా జరిగింది. ఎందరితోనో పరిచయం స్నేహం కలిగింది.''

''అంతా బాగానే వున్నది. నీవు వ్యాపారానికి వెళ్ళినట్టా? విలాసానికి వెళ్ళినట్టా?'' అన్నాడు కామస్వామి.

''నిజంగా నా సంతోషానికే వెళ్ళాను. ఎందుకు వెళ్ళకూడదు? కొత్తస్థలాలు చూచాను. కొత్త మనుష

ల్లతో పరిచయమూ, స్నేహమూ కలిగింది. నేను కామస్వామిని అయివుంటే వెంటనే తిరిగివచ్చి వుందును. అప్పుడైనా ఏమీ లాభించేది కాదు. కాని ఇన్ని దినాలు ఎంతో ఆనందంగా గడిపాను. ఈ పర్యాయం వెళ్ళినప్పుడు ఎందరో స్నేహితులు నన్ను ఆప్యాయంగా ఆహ్వానిస్తారు. నాపైన కోపం తెచ్చుకోవడం నీకే క్షేమంకాదు. నావల్ల నష్టం కలుగుతూ వున్నట్టు తోస్తే వెంటనే చెప్పు. మరుక్షణం నన్ను చూడవు. అంతవరకూ స్నేహంగానే వుందాము," అన్నాడు సిద్ధార్థుడు. "ఇన్నాళ్ళు నా ఉప్పు తినికదా నీవు బ్రతుకుతున్నది?" అన్నాడు కామస్వామి. "మిత్రమా! నా ఉప్పే నేను తింటున్నాను. నిజానికి నీవూ నేనూ అందరి ఉప్పూ తింటున్నాము" అన్నాడు సిద్ధార్థుడు.

కామస్వామికి స్వంత కష్టాలు ఎన్నో వుండేవి. అవేవీ సిద్ధార్థునికి పట్టేవి కావు. ఎవరి వల్లనైనా నష్టం కలిగినప్పుడు కోపం చూపడం అవసరమని కామస్వామి చెప్పేవాడు. ఆ మాటలు అతని తలకెక్కేవి కావు. ఒకసారి కామస్వామి అన్నాడు: "వ్యాపారం సంగతులన్నీ నా మూలంగా తెలుసుకున్నా"వని. సిద్ధార్థుడు జవాబుచెప్పాడు: "కామస్వామీ! ఈ చమత్కారాలు కట్టిపెట్టు. ధాన్యం కొనుగోలు, అమ్మకాలు, వడ్డీ పెంపకాలు, ఇవే నీ దగ్గర నేను నేర్చుకున్నది. ఇవే నీకు తెలిసినవి. కాని ఆలోచించడమంటే ఏమో నీదగ్గర నేర్చుకోలేదు. దానిని నీవు నాదగ్గర నేర్చుకుంటే బాగుండేది" అని.

వాస్తవంగా అతని మనస్సు వ్యాపారంమీద లేదు. కమలకోసం ద్రవ్యాన్ని సంపాదించడానికే వ్యాపారం అతనికి వినియోగించింది. ఆ ద్రవ్యం అక్కరకు మిక్కిలిగా లభించింది. పరిజనమీద అతనికి ఎంతైనా సానుభూతి వుండేది. కాని పరిజన కష్టసుఖాలు, గుణదోషాలు అతనిని సోకేవి కావు. అందరితోనూ కలిసి మెలిసి తిరిగేవాడు. కాని ఆ పరిజనంనుంచి తనను వేరుపరిచేది ఏదో తనలో వున్నట్టు తోచేది. ఆ భావం అతనిలో గాఢంగా వుండేది. అల్ప సుఖాలకోసం ప్రజలు పడే పాటులను, వారి రాగ ద్వేషాలను చూచి నవ్వుకునేవాడు.

అతని వద్దకు వ్యాపారంకోసం వర్తకులు వచ్చేవారు. అప్పులకోసం కొందరు వచ్చేవారు. భిక్షుకులు వచ్చి తమ దరిద్రబాధలను చెప్పుకునేవారు. అందరినీ ఆదరంతో చూచేవాడు. పండ్లు నమ్ముకునే మనిషిని, తనవద్ద నౌకరును, పెద్ద షావుకారును సమానదృష్టితోనే చూచేవాడు. ఎవరైనా కొద్దిమోసం చేసినా లెక్కపెట్టేవాడు కాడు. కామస్వామివచ్చి మంచిచెడ్డలు మాట్లాడినప్పుడు శ్రద్ధగా వినేవాడు. ఏదో సమాధానం చెప్పి పంపేవాడు.

ఒక్కొక్క సమయంలో అతనికి లోపలనుంచి ఏదో వాణి మృదువుగా మెల్లగా వినిపించేది. ఆవాణి అతనికి ఏదో స్మృతికి తెచ్చేది. ఏదో హెచ్చరిక చేసేది. కాని స్పష్టంగా వినిపించేదికాదు. ఉన్నట్టుండి అతనికి ఒకభావం స్పష్టంగా గోచరించింది. తాను ఒక వింతబ్రతుకు బ్రతుకుతున్నాడు. ఆటలాడుకున్నట్టుగా ఏమేమో చేస్తున్నాడు.

ఉత్సాహంగా సంతోషముగా కాలం గడుపుతున్నాడు. కాని వాస్తవజీవితం తన కాళ్ళముందు ప్రవాహంగా పారుతున్నది. ఆ ప్రవాహాన్ని తాను స్పృశించడం లేదు. అతనికి వ్యాపారం ఒక కందుకక్రీడలాగా వున్నది. అందరితో అతని సంబంధంకూడా ఆలాగే లీలామాత్రంగా వున్నది. కాని అతని హృదయం, అతని సహజస్వభావం, వాటిలో లేదు. అతడుకూడా లేడు. అతని అంతరాత్మ ఎక్కడో దూరంగా అదృశ్యంగా తిరుగుతూ వున్నది. అతని బ్రతుకుతో దానికి సంబంధం లేదు.

ఈ రకం భావాలు కలిగినప్పుడు అతనికి భయం వేసేది. తానుకూడా అందరిలాగే రక్తితో, ఆసక్తితో బ్రతకకూడదా అనిపించేది. ఒక ప్రేక్షకునిలాగా ఈ నాటకాన్ని పరికించడం ఎందుకు అనుకునేవాడు.

ప్రతిదినం కమలవద్దకు వెళ్ళి కామకళ నభ్యసిస్తూ వుండేవాడు. ఆ సాధనలో ఇచ్చిపుచ్చుకోడాలు ఒక్కటిగా మెలవేసుకుని పోయేవి. తనకు కమలకు ప్రవృత్తిలో ఏదో సామ్యం అతనికి గోచరించింది. ఒకసారి ఆమెతో అన్నాడు: ‘‘కమలా ! నీకూ నాకూ పోలిక వున్నది. నీవూ అందరివంటి దానవుకావు. నీవు కమలగానే వుండగలవు. నీలోపల ప్రశాంతమైన ఒక స్థానం వున్నది. ఏక్షణంలోనైనా నీవు ఆస్థానంలోకి పోయి నీవు నీవుగా వుండగలవు. ఆలాగే వుంటాను నేనుకూడా. ఆశక్తి తక్కువమందికి వుంటుంది. కాని ప్రతి మనిషికి అది సాధ్యమే.’’

"అందరికీ ఆ తెలివి వుంటుందా" అన్నది కమల. "దానికి తెలివితో పని లేదు. కామస్వామికి నామాత్రం తెలివి వున్నది. కాని నేను చెప్పినస్థానం ఒకటి తనలో వున్నదని యెరగడు. కమలా! చాలామంది చెట్లపై ఆకుల మాదిరి గాలికి వూగుతూ నేలమీద రాలిపోతారు. కొందరుమాత్రం నక్షత్రాల మాదిరి ఒక నిర్ణీతపథంలో ప్రయాణం చేస్తారు. ఆ మార్గము నడిపేశక్తి వాళ్లలోనే వుంటుంది. నేను చాలామంది జ్ఞానులను ఎరుగుదును. ఈ విధమైన శక్తిగల వ్యక్తిని ఒక్కరినే చూచాను. ఆయనను ఏనాటికీ మరచిపోలేను. ఆయనే బుద్ధ భగవానుడు. వేలకొలదిగా ఆయనబోధలు వింటున్నారు. ఆయన ఉపదేశాలను ఆచరిస్తున్నారు. కాని వారందరు కూడా రాలిపోయే ఆకులే. కారణ మేమంటే ఆ నడిపేశక్తి, ఆ జ్ఞానం వారిలోపల లేదు."

"నీవు బుద్ధునిసంగతి ప్రారంభించావు. శ్రమణ భావాలు నీలో తిరిగి పొటమరిస్తున్నవి."

సిద్ధార్థుడు మౌనంగా కూర్చున్నాడు. అంతలో ఇద్దరు కామరంగంలో దిగారు. కమల శరీరమార్దవం నాగు పాము లాంటిది. ఎన్ని మెలికలైనా ఎన్ని వంపులైనా తిరుగు తుంది. సిద్ధార్థునితో కూడి ఏవేవో క్రీడలలో నోలలాడించింది. ఓడించింది. పరవశుని చేసింది. ఆమె విజయానికి ఆనందభరితుడై అలసి సొలసి సిద్ధార్థుడు ఆమెను సర్వాంగాలింగనం చేసుకొని పండుకొన్నాడు.

కమల అతనిమీద వంగి చాలాసేపు అతని ముఖాన్నీ, అలసిపోయిన అతని కళ్ళనూ చూస్తూవున్నది.

"నీవంటి రసికుని ఎన్నడూ చూచి యెరగను. నీ బలమూ, నీ మార్దవమూ, నీ అనుకూలత ఎవ్వరికీ లేవు. సిద్ధార్థా! నాకళను నీవు చక్కగా నేర్చుకున్నావు. నీవల్ల నేను తల్లినికూడా కావచ్చు. కాని నీవు ఎప్పుడూ శ్రమణుడవే. నీవు వాస్తవంగా నన్ను ప్రేమించడంలేదు. నీకు ఎవ్వరిమీదను ప్రేమలేదు. నిజమేకాదూ?" అన్నది కమల.

"కావచ్చు! నేనూ నీవంటివాడనే. నీవుకూడా నిజంగా ప్రేమించలేవు. నీవు ప్రేమించగలిగివుంటే కామాన్ని ఒక కళగా సాధించగలిగేదానవు కావు. బహుశా మనవంటి వ్యక్తులు ప్రేమించలేరేమో! సామాన్యులకే అది సాధ్యం. అదే వారి ప్రవృత్తిలో రహస్యం." అన్నాడు సిద్ధార్థుడు నిట్టూర్చుస్తూ.



# 3. సంసారం



సిద్ధార్థుడు చాలా దినాలు లౌకికజీవితాన్ని – దానికి అంటకుండా గడిపాడు. శ్రమణుడుగా వుండినప్పుడు మొద్దు వారిన అతని ఇంద్రియాలు తిరిగి మేలుకొన్నవి. అర్థాన్ని, కామాన్ని, అధికారాన్ని అతడు రుచిచూచాడు. కాని అంతకాలం హృదయంలో శ్రమణుడుగానే వున్నాడు. కమల తెలివితో ఈ విషయాన్ని గ్రహించింది. అతని జీవితం ఎల్లప్పుడూ ఆలోచన, ప్రతీక్షణ, ఉపవాసము వీటి మీదనే లగ్నమై ఉండేది. లోకంలో సామాన్యజనంతో అతనికి సంబంధం లేదు. అతడు వారికి వేరుగానే వుండేవాడు.

సంవత్సరాలు గడిచినవి. సుఖాలలో మునిగి తేలుతూ వున్న సిద్ధార్థునికి కాలచక్రం దొర్లిపోతూ వున్నదనే గమనమే లేదు. అతడు శ్రీమంతుడైనాడు. ఊరివెలుపల నది వొడ్డున సొంతయిల్లు కట్టించాడు. సొంత నౌకరులను పెట్టాడు. అందరికీ అతడంటే గౌరవం – డబ్బుకోసమూ సలహాలకోసమూ అతనివద్దకు వస్తూవుండేవాళ్లు. కాని

కమలతో తప్ప వేరెవ్వరితోనూ అతనికి గాఢస్నేహం లేదు.

గౌతమబుద్ధుని బోధలు విన్నతరువాతను, గోవిందుని వదలిపెట్టి వచ్చిన తరువాతను అతనికి కలిగిన ఉజ్జ్వల జ్ఞానోదయము, మెలకువతో కూడిన ఆ ప్రతీక్షణ; గురువులతోనూ సిద్ధాంతాలతోనూ సంబంధం లేకుండా ఒంటరిగా నిలబడ గలిగిన నాటి ఆత్మవిశ్వాసము; తన హృదయంలోని దివ్యవాణిని వినవలె నన్న ఆసక్తి, సంసిద్ధత— ఇవన్నీ అంతరించి స్మృతి మాత్రంగా మిగిలిపోయినవి. ఒకనాడు అతనిలో పొంగులు వారి పొరలెత్తిన దివ్యధార ఈ నాడు ఎక్కడో దూరంగా మూలుగుతున్నట్టు వినిపిస్తున్నది. అయినా, అతడు శ్రమణుల వల్లను, గౌతముని వల్లను, తన తండ్రివల్లను, బ్రాహ్మణుల వల్లను నేర్చుకొన్న విషయాలు ఇంకా అతనిని అంటుకొని వున్నవి. నియమజీవితము, ఆలోచనలో ఆనందము, ధ్యానము, దేహము మనస్సు కాని ఆత్మనుగూర్చిన జ్ఞానము, వీటి వాసన అతనిలో చాలావరకు నిలిచి వున్నది. మిగతావి అడుగంటి పోయినవి.

కుమ్మరిసారె ఒకసారి తిప్పిన తరువాత చాలసేపు తిరిగి క్రిమక్రమంగా వడి తగ్గి ఆగిపోయినట్టుగా, అతనిలోని వైరాగ్యచక్రము – ఆలోచనాచక్రము – వివేకచక్రము – దీర్ఘకాలం తిరిగి తిరిగి నెమ్మది నెమ్మదిగా ఆగలేక దాదాపుగా ఆగిపోయినవి. సంసారవ్యామోహము, మాంద్యము అతని ఆత్మను కప్పివేసినవి. అతని ఆత్మ బరువు, అలసట కలిగి జోకొట్టినట్టు నిద్రపోయింది. కాని అతని ఇంద్రియాలకు

అదివరకు లేని మెలకువ కలిగింది. అతని ఇంద్రియాలు చాలా అనుభవాన్ని గడించినవి.

సిద్ధార్థుడు తన వ్యాపారం నిర్వహించుకునేవాడు. ఇతరుల మీద అధికారాన్ని చలాయించేవాడు. స్త్రీలతో ఆనందించేవాడు. పన్నీటిలో జలకమాడేవాడు. అందమైన దుస్తులు ధరించేవాడు. మధుర పదార్థాలతోనూ మత్స్య మాంసాలతోనూ భోజనంచేసేవాడు. మద్యపానం చేసే వాడు, జూదం ఆడేవాడు, నృత్యాల దర్శించేవాడు, పల్లకి మీద తిరిగేవాడు – మెత్తని పరుపులపై పవ్వళించేవాడు – ఇతరుల కంటె తాను ఘనుడననుకొనేవాడు – ఇతరులను ఏవగింపుతో చూచేవాడు. వ్యాపారంలో ఏవైనా చిక్కులు కలిగి కాముస్వామి బాధపడుతూ వుంటే అతనిని గేలిచేస్తూ మాట్లాడేవాడు. అయితే పోనుపోను అతని అహంకారం కొంత తగ్గింది.

ఒక వైపున సంపద పెరుగుతూ వుంటే – ఇంకొక వైపున అతనికి సామాన్య ప్రజల అల్పత్వమూ వ్యాకులత పట్టుకున్నవి. సామాన్య ప్రజలను చూచి అతడు ఈర్ష్య పడేవాడు. వాళ్ళకు సుఖదుఃఖాలతోపాటు భార్యాబిడ్డలు వున్నారు. భార్యాబిడ్డలను ప్రేమిస్తూ వాళ్ళు ఆశతో జీవిస్తూ వుంటారు. ఆలాంటి ఆనందం తనకు లేదని అతని ఈర్ష్య. వాళ్ళ ఆనందం లేకపోయినా వాళ్ళ అల్పత్వం అబ్బింది. అసంతృప్తి, నిరుత్సాహము, విచారము, సోమరి తనము, ద్వేషము – ధనికుల కుండే మనోవ్యాధి ఇవన్నీ అత నికి సంక్రమించినవి.

సన్నని ముసుగులాగా మంచు తెరలాగా అతనిలో ఒక అలసట యేర్పడి మెల్లమెల్లగా పుంజుకొని కొంత కాలానికి మోయరాని బరువై కూర్చున్నది. నూతన వస్త్రాలు కాలంగడిచే కొద్దీ వన్నె మాసి చినుగులు పట్టినట్లు అతని జీవితం వెలుగును సారాన్ని కోల్పోయి వికారరూపం తాల్చింది. ఆ మార్పును అతడు గమనించలేదు. ఒకనాడు తనలో మేలుకొని సుస్పష్టంగా వినిపించిన అంతర్వాణి, తనకు ఉదాత్తపథంలో నడిపిన అంతర్వాణి, ఈనాడు మూగవోయిందని మాత్రం అతనికి తెలిసివచ్చింది.

అతనిని సంసారం చుట్టుకున్నది. భోగవాంఛకు, దురాశకు, సోమరితనానికి, తానెప్పుడూ అసహ్యించుకునే ధనార్జనా పరత్వానికి అతడు వశుడైనాడు. చివరకు అతని సంపదే అతనికొక బోనుగా తయారైంది. ఇదివరకు ధనార్జన అతనికి ఒక క్రీడగా వుండేది. అదే యిప్పుడు అతనిని బంధించే శృంఖలంగా పరిణమించింది. అతని పతనం ఎంతవరకు దిగిందంటే: జూదమాడి ధనార్జన చేయడానికి సిద్ధపడ్డాడు.

డబ్బుపెట్టి, నగలుపెట్టి జూదం ఆడడం ప్రారంభించాడు. అందులో అతని ఉద్రేకం పట్టపగ్గాలు లేకుండా పెచ్చుపెరిగింది. అతడు పెట్టే పై పందెములు చూచి ఎవ్వరూ అతనితో ఆడడానికి సాహసించలేకపొయ్యేవారు. జూదం ఆడితేకాని అతనికి తోచేదికాదు. డబ్బు వచ్చినా పోయినా అతనికి లెక్కలేదు. అసలు ఆడడమే అతనికి మహానందం. తనకు ధనం ఒక లెక్కలోనిది కాదని చూప

డానికి జూదం అతనికి సాధనమైంది. ధనాన్ని వెదజల్లుతూ తన్ను చూచి తానే అసహ్యించుకునేవాడు. తన ఆవేశానికి తానే నవ్వుకునేవాడు. జూదంలో వేలకొలది పోగొట్టుకొన్నాడు. వేలకొలది సంపాదించాడు. ధనం, నగలు, ఒక యిల్లు కూడా పోయినవి. మళ్ళా వచ్చినవి. పై పందెములు వేస్తూ గెలుపు ఓటమి తేలని సందిగ్ధస్థితిలో వుండే ఆవేశము, ఆకాంక్ష, ఉద్రేకము, అతనికి చెప్పరానంత ఆనందాన్ని కలిగించేవి. ఆ విధమైన అనుభూతిమీది రక్తికొద్దీ దానిని పెంచుకోడానికి అతడు విరామం వేసట లేకుండా జూద మాడేవాడు.

మందమైన నిస్సారమైన బ్రతుకులో ఆలాంటి ఉద్రేకమూ, తద్వారా ఆనందానుభవమూ అతనికి అగత్యములైనవి. జూదంలో ఓడేవాడు. తిరిగి ఆడడానికి ఇవ్వవలసిన వాళ్ళదగ్గరనుంచి గొంతుమీద కూర్చుని బాకీలు వసూలు చేసేవాడు. ధనం మీద తనకంత అసహ్యమని తెలపడమే అతనికోరిక.

పదేపదే ఓడడం వల్ల అతనికి సహనం సన్నగిల్లింది. అప్పులు వసూలుకావడం మందగించడంతో అసహనం మరీ పెచ్చు పెరిగింది. పేదసాదల మీద మునుపటి దయాదాక్షిణ్యాలు పోయినవి. జూదంలో వేలకొలది నష్టమయ్యేకొద్దీ వ్యాపారంలో అధిక లాభాలు రాబట్టవలెనన్న కాంక్ష అధికమైనది. రాత్రులు నిద్రలో కూడా అతనికి ధనాన్ని గూర్చిన కలలే — నిద్రలేచి అద్దంలో తన మొగం చూచుకునేవాడు. ముదురుపారి వికారంగా కనబడేది. తనకే

వెగటువేసేది. వెంటనే మద్యపానంచేసేవాడు. మళ్ళా జూదానికి కూర్చునేవాడు. ఈ సుడిగుండంలో చిక్కుకొని ఉక్కిరిబిక్కిరి అయ్యేవాడు.

అతనికి ఒక పూర్వానుభవం స్మృతికి వచ్చింది. ఒకనాడు సాయంకాలం ఉద్యానవనంలో కమలతో కూర్చుని వున్నాడు. ఏవో కబురులు చెప్పుకుంటున్నారు. కమల గంభీరంగా మాట్లాడుతున్నది. విచారము విసుగుదల ఆమె ధోరణిలో కనబడుతున్నవి. ఆమె గౌతమబుద్ధుని గూర్చి— ఆయన రూపురేఖలను గూర్చి అడుగుతున్నది. అన్నీ విన్న తరువాత కమల నిట్టూర్చి అన్నది : "స్వల్పకాలంలో నేను గూడా బుద్ధుని శిష్యురాలినవుతాను. ఈ తోటను ఆయనకు సమర్పిస్తాను. ఆయన ధర్మమే నాకు శరణ్యం" అని. ఆ మాటలంటూనే కమల అతనిని దగ్గరకు లాక్కున్నది. పట్టరాని ఉద్రేకములో — కన్నీళ్ళుపెట్టుకొంటూ — పరుగెత్తి పోతూవున్న ఆ సుఖప్రవాహంలో చిట్టచివరి మాధుర్యాన్ని దోసిలినిండా పట్టి తనివితీర తాగదలచినట్టుగా — అతనిని గాఢాతి గాఢంగా, భయంకరంగా కౌగిలించుకున్నది.

కామానికి మృత్యువుకు ఎంత సన్నిహిత సంబంధం వున్నదీ అప్పుడు స్పష్టపడినట్టుగా ఇదివరకెప్పుడూ అతనికి స్పష్టపడిందికాదు. ఇద్దరూ కలిసి పండుకున్నారు. అతడు కమల ముఖాన్ని పరికించి చూచాడు. ఆముఖంలో ఆ పెదవుల చివరల ఒకవిచారరేఖ తీర్చినట్టుగా కన్పించింది. తన తలకూడా అక్కడక్కడ నెరుస్తూవున్నట్టు కన్పించింది.

దిగులుతోనూ భయంతోనూ కమలను వదలిపెట్టి తన యింటికి వెళ్ళాడు.

సిద్ధార్థుని జీవితంలో ఒక అధ్యాయం ముగియనున్న రోజు అది. ఆరాత్రి ఇంటివద్దనే వున్నాడు. నాట్యాలు ముగిసినవి. బాగా తాగాడు. అలిసిపోయి పండుకునే వేళకు అర్థరాత్రి అయింది. ఒకటే ఆందోళన. ఒకటే నిరాశ. కన్నీళ్ళు ఉబికి వస్తున్నవి. ఎంత ప్రయత్నించినా కళ్ళు మూతపడలేదు. మనస్సులో మితిమీరిన దిగులు గాటంగా ప్రాగినప్పుడు, అదేపనిగా కామాసక్తుడై నప్పుడు కలిగే వెగటు ఓకరింత అతనిలోనుంచి పుట్టుకొని వస్తూవున్నది. అసలు తన్ను చూచుకుంటేనే వెగటు వేస్తున్నది. తల మీద సుగంధతైలాల వాసన, దేహంమీద అత్తరువాసన, నోటివెంట సారాయివాసన, ఇవన్నీ తనమీదనే తనకు అసహ్యభావాన్ని కలిగిస్తూవున్నవి. ఎవరైనా మిక్కుటంగా తిని, తాగి కడుపులో గలబరించినప్పుడు బలవంతంగా డోకు తెచ్చుకొని కొంచం హాయి చిక్కిందనుకున్నట్టు ఈభోగాలను ఈ తుచ్ఛజీవితాన్ని ఒక్కసారిగా వదిలించుకుంటే బాగుండు ననుకున్నాడు సిద్ధార్థుడు.

అతనికి తెల్లవారుతూ వుండగా కొంచెం కునుకు పట్టింది. అందులో ఒక కలవచ్చింది : బంగారుపంజరంలో పెట్టి కమల ఒక పిట్టను పెంచుతున్నది. ఆ పిట్టరోజూ పొద్దున పాడేది. ఆరోజు పాటవినిపించలేదు. ఆశ్చర్యంతో అతడు పంజరం వద్దకువెళ్ళి చూచాడు. పిట్ట చచ్చి పోయింది. దానిని బైటకుతీసి వీధిలో పారవేశాడు. ఆ

చచ్చిన పిట్టతోపాటు తనలోనుంచి మంచి భాగాన్నంతా వీధిలో పారవేసినట్టు అతనికేదో భయమూ బాధా కలిగినవి.

నిద్రలేచాడు. మనసులో ఏమోదిగులు. "బ్రతుకంతా అవివేకంగా గడిపాను. సార్థకమైంది ఏమీ మిగల లేదు. పడవ పగిలి ఒడ్డున ఒంటరిగా నిల్చున్న నావికుని లాగా వున్నాను". అనుకున్నాడు.

ఆ దిగులుతోనే సిద్ధార్థుడు తన తోటలోకి వెళ్ళాడు. తోట తలుపులు మూశాడు. మామిడిచెట్టు నీడలో కూర్చున్నాడు. ఇంకా అదేభయం. తాను చచ్చిపోతున్నట్టుగా తోచింది. ఆలోచనలను చిక్కబట్టాడు. బాల్యం నుంచి తాను బ్రతికిన బ్రతుకునంతా స్మరించుకున్నాడు. తాను ఎన్నడైనా నిజంగా సుఖాన్ని ఆనందాన్ని అనుభవించాడా? అనుభవించ కేమి? ఎన్నిసారులో అనుభవించాడు.

బాల్యంలో తన తెలివినిచూచి బ్రాహ్మణులు మెచ్చుకున్నారు. విద్యలలో సహపాఠులను మించాడు. పండితులతో తర్కవితర్కాలు చేశాడు. యజ్ఞకర్మలలో పాల్గొన్నాడు. అప్పుడు అతని హృదయంలో ఒక వాణి వినిపించింది. తాను అనుసరించవలసిన మార్గం ముందున్నదని.

తరువాత యౌవనం వచ్చింది. అతనిలో ఒక ఆకాంక్ష ఆగనీకుండా ముందుకు నెట్ట నారంభించింది. బ్రాహ్మణోపదేశాలను అర్థం చేసుకోవలెనని చాలా తంటా

లుపడ్డాడు. ఏ విజ్ఞానం సంపాదించినా దాని వెనక ఒక తీరని తృష్ణ వుండేది. ఆ తృష్ణలోనుంచి ఒక వాణి వినిపించింది. తాను అనుసరించవలసిన మార్గం ముందున్నదని.

ఇల్లు విడిచాడు. శ్రమణులలో చేరాడు. శ్రమణుల సాంగత్యం విడిచి బుద్ధభగవానుని వద్దకు వెళ్ళాడు. మళ్ళా అదే వాణి వినిపించింది, తాను అనుసరించవలసిన మార్గం ముందున్నదని.

ఇల్లు వదలి శ్రమణులతో చేరినప్పుడు, శ్రమణులను వదిలి బుద్ధభగవానుని వద్దకు వెళ్ళినపుడు, ఆయననుకూడా వదిలి అజ్ఞాత మార్గాన్ని ప్రవేశించినపుడు అదే వాణి వినిపించింది.

ఆ వాణిని విని ఎంత కాలమైంది? చివరకు తాను అనుసరించిన మార్గం ఎట్టిది? ఒక ఉదాత్త లక్ష్యం లేకుండా తృష్ణ లేకుండా, దివ్యానుభూతి లేకుండా అల్ప భోగాలతో తృప్తిపడుతూ, వాటివల్లనైనా వాస్తవమైన తృప్తి లేకుండా ఎన్ని దీర్ఘ సంవత్సరాలు గడిపాడు! లోకులతో పాటు తానూ జీవితాన్ని గడపవలె ననుకున్నాడు. కాని వారి బ్రతుకుకన్నా తన బ్రతుకు మరీ భ్రష్టమైంది. లోకుల లక్ష్యము, తృష్ణ వేరు. తనలక్ష్యము, తృష్ణ వేరు.

అతడు ప్రేమించింది ఒక్క కమలను. కాని ఇంకా తాను కమలను ప్రేమిస్తున్నాడా? ఇంకా తనకు కమల కావలెనా? కమలకు తాను కావలెనా? ఇంతకాలమూ తామిద్దరు ఆడిన నాటకానికి పరమార్థం ఏమిటి? ఈనటన

కోసం బ్రతకడం పరమార్థమా? కాదు కాదు! ఈనాటకమే సంసారం. ఇది బాలురకు మాత్రమే తగిన ఆట. ఈ ఆటను కొంతకాలం ఆడుతూ సుఖించవచ్చు ఎల్లకాలం ఆడతగింది కాదు.

ఈనాటకం ముగిసిందని సిద్ధార్థుడు తెలుసుకున్నాడు. అందులో ఇంకా నటించడం అసాధ్యమని కూడా తెలుసుకున్నాడు. అతని దేహంలో ఒక కంపం కలిగింది. తనలో ఏదో చచ్చిపోయినట్టు అనిపించింది.

ఆరోజంతా ఆ మామిడిచెట్టు క్రిందనే కూర్చున్నాడు, తన తండ్రిని గోవిందుని గౌతమబుద్ధుని స్మరిస్తూ. ఇందరిని వదిలిపెట్టి వచ్చింది ఇంకొక కామస్వామి కావడానికేనా? చీకటి పడేవరకు ఆలాగే కూర్చున్నాడు. తలయెత్తి చూచాడు, ఆకాశాన నక్షత్రాలవైపు. మామిడి చెట్టును చూచి అనుకున్నాడు: "నా తోటలో నేను పెంచిన మామిడిచెట్టుఇది" ఆమాటకు నవ్వుకున్నాడు. "నాతోట! నేను పెంచిన మామిడిచెట్టు! ఎంత అవివేకం!"

అంతా ముగిసింది. ఆతని మనసులో ఆతోట, ఆ మామిడిచెట్టు చెరిగిపోయినవి. లేచాడు. ఆరోజు తిండి లేదు. ఆకలి వేస్తున్నది. తనయిల్లు, శాకపాకాలు జ్ఞాపకం వచ్చినవి. విసుగుదలతో చిరునవ్వు నవ్వాడు. అవికూడా ఆతని మనసులోనుంచి చెరిగి పోయినవి. ఆ రాత్రే సిద్ధార్థుడు ఆతోటను, ఆనగరాన్ని విడిచిపెట్టి వెళ్ళాడు. అతని జాడ తెలుసుకోడానికి కమల ప్రయత్నించ లేదు. ఆతడు వెళ్ళినట్టు తెలిసినప్పుడు కమలకు ఆశ్చర్యం కలగ లేదు.

అట్టిది జరుగుతుం దని ఆమె అనుకుంటూనే వున్నది. వాస్తవంలో అతడు శ్రమణుడు. శ్రమణులకు ఇల్లు వాకిలి ఏమిటి? అతనితో చివరిసారి పొందిన సుఖాన్ని క్షణకాలం స్మరించుకున్నది కమల.

కమల లేచి బంగారుపంజరం వద్దకు వెళ్ళింది. పంజరంతలుపులు తెరిచింది. పిట్టను బైటికి తీసి వదిలి పెట్టింది. చాలాకాలం ఆ పిట్ట పోయినవైపు చూస్తూ వుండేది. ఆ నాటినుంచి కమలయింటికి రసికులు రావడం లేదు. కొన్నాళ్ళకు తాను గర్భవతిగా వున్నట్టు కమల గ్రహించింది.



# 4. నది వొడ్డున



సిద్ధార్థుడు అడవిలో ప్రవేశించాడు. నగరం నుంచి చాలా దూరం నడిచాడు. ఇంతకాలం తాను బ్రతికిన బ్రతుకును తలుచుకున్నప్పుడు అతనికి ఎంతో రోతవేసింది. తన కలలో చచ్చిపోయినట్టు కనిపించినపిట్ట కమలపంజరంలోది కాదనీ, తనహృదయపంజరంలో వున్న దేననీ అనుకున్నాడు. సంసారకూపంలో దిగి ఎంత కుళ్లును పోగుచేశాడు! అంత కాలం తాను బ్రతికి కూడా చచ్చినట్టే ననుకున్నాడు. ఈ లోకంలో అతనికి సంతోషాన్ని, ఊరటను కల్పించ గలిగింది ఏ మున్నది?

"అబ్బ! మూర్ఛవస్తే - చచ్చిపోతే - పిడుగు మీాద పడితే - ఏ పులో వచ్చి వేసుకుపోతే_ఏదైనా విషం దొరికి తాగితే ఎంత బాగుండును!" అనుకున్నాడు. "నాకు తలవంపు కలిగించే ఏ పాపకార్యం చేయలేదు? ఏ పాపం చేసినా ఆ బాధ్యత పూర్తిగా నాదే కాదూ? ఇంకా బ్రతకడం

ఏలాగు ? ఇంతటితోనైనా ఈ బురదలోనుంచి బైటపడి నట్టేనా ?'' ఇవి అతని ఆలోచనలు.

అడవిలో నదివద్దకు వచ్చాడు. అప్పుడు పల్లెకారి తనను దాటించిన నదే అది. ఆ నదివొడ్డున నిల్చున్నాడు. అలసట, ఆకలి, నిస్సత్తువ. ఇంకా ఎక్కడికో పోవడం ఎందుకు? ఎక్కడికి పోవడం? ఏమి ప్రయోజనం? ఈ కలతకలను విదిలించుకొని, ఈ పాపాన్ని కక్కివేసి, ఈ బ్రతుకును తుదముట్టించడం ఏలాగు?

ఆ నదివొడ్డున ఒక కొబ్బరిచెట్టు వుంది. దానికి ఆను కుని నిల్చున్నాడు. నీళ్లలో తొంగిచూచాడు. ఆ నదిలో దూకుదా మనుకున్నాడు. పనికిమాలిన ఈ కళేబరాన్ని తుదముట్టించడం తప్ప గత్యంతరం కనిపించలేదు. అందులో పడిచస్తే ఆ చేపలు, మొసళ్లు, అవైనా పీక్కొనితింటవి. అంటూ నీళ్లలో తన ముఖంనీడను చూచుకున్నాడు. ఆ నీడమీద వుమ్మివేశాడు. కళ్లు గట్టిగా మూసుకుని నదిలో దూకడానికి ముందుకు వంగాడు.

ఆకస్మికంగా అతని ఆత్మలో ఏ మూలనుంచో ఒక శబ్దం వినబడింది. ఆ శబ్దం ఒక్కటే అక్షరం. అది వేదా లకు శిఖరమైన ఓంకారం. పరమపవిత్రమైన ఓంకారాన్ని బ్రాహ్మణులు తమ ప్రార్థనలలో మొదటను చివరను ఉచ్చరిస్తారు. ఓంకారం అంటే "పరిపూర్ణం" అన్నమాట. ఆశబ్దం వినిపించగానే మైకంలో వుండిన అతని ఆత్మ హఠా త్తుగా మేలుకున్నది. తాను చేయదలచిన పని దోష మని గ్రహించాడు.

ఆతనికి వణుకు పుట్టింది. ఇందుకా తాను బయలుదేరి వచ్చింది! మనస్సు వికలమై, వివేకాన్ని కోల్పోయి, అన్ని విధాలా భ్రష్టుడై చివరకు చావుకు ఆత్మహత్యకు. సిద్ధ పడ్డాడు. ఈ దేహాన్ని వదిలించుకుంటే శాంతి దొరుకు తుందని భ్రిమబడ్డాడు. ఆ భ్రమను చీల్చుకొని వినిపించింది ఓంకారధ్వని. ఇంతవరకు అతడు అనుభవించిన మానసిక వ్యధ కాసి నిస్పృహకాని అతని చైతన్యాన్ని ఆ ధ్వని కది లించినంతగా కదిలించ లేదు.

లోలోపల ఓంకారాన్ని ఉచ్చరించాడు. బ్రహ్మ స్పందం కలిగింది. దేహాన్ని వదలుకున్నా జీవం నశించేది కాదని స్ఫురించింది. మరుపు తగిలిన తత్వజ్ఞానం తిరిగి స్మృతికి వచ్చింది. కాని ఆస్మృతి మెరుపులాగా ఒక్క క్షణ కాలం మాత్రమే నిలిచింది. అలసిపోయి ఆ చెట్టుక్రింద కూలబడ్డాడు. ఓంకారాన్ని ఉచ్చరిస్తూనే నడుమువాల్చి గాఢనిద్ర పోయినాడు.

అతనికి చాలాదినాలుగా ఎన్నడూ అంత గాఢనిద్ర పట్టలేదు. కొన్నిగంటలు గడచిన తరువాత మెలకువ వచ్చింది. అతనికి పదిసంవత్సరాల వెనక మేలుకున్నట్టు తోచింది. ప్రక్కన నీళ్ళచప్పుడు వినిపిస్తున్నది. తా నెక్కడ వున్నదీ అక్కడికి ఎట్లావచ్చిందీ అతనికి తోచలేదు. తల యెత్తిచూస్తే పైన ఆకాశం, ప్రక్కన కొబ్బరికాయ చెట్టు. గతమంతా మెల్లగా స్మృతికి వచ్చింది. పూర్వానుభవం యావత్తూ కరిగిపోయిన కలలాగా వున్నది. మెలకువ వచ్చిన మొదటి క్షణంలో అతనికి గడిచిపోయిన బ్రతు

కంతా ఏదో పూర్వజన్మానుభవంగా స్ఫురించింది. అప్పుడే పుట్టి కళ్ళువిచ్చి చూస్తున్నట్టుగా చూచాడు చుట్టూవున్న ప్రపంచాన్ని. పెదవులు ఓంకారాన్ని మెల్లగా ఉచ్చరిస్తూ వున్నవి. నిద్రలో వుండినంతకాలమూ తనలో ఓంకారం మ్రోగుతూ వున్నట్టు తోచింది. ఓంకారంలోనే మునిగి నిద్రించినట్టుగా అనిపించింది.

ఎంత సుఖమైన నిద్ర! నిజంగా చచ్చిపోయి మళ్ళా పుట్టానేమో అనుకున్నాడు. తన దేహంవైపు చూచుకున్నాడు. అవేచేతులు! అవేకాళ్ళు! లోపల చూచుకున్నాడు. అదే అహంత! ఆ సిద్ధార్థుడే! కాని కొంత మారాడు. ఆ నిద్రతరువాత ఈ మెలకువ అతనికి ఏదో క్రొత్తగా వింతగా సుఖంగా కనిపించింది.

సిద్ధార్థుడు లేచి కూర్చున్నాడు. ముందు ఎవరో భిక్షుకుడు కూర్చొని వున్నాడు. ఒక్కక్షణకాలం పరికించి చూచాడు. గోవిందుడు! ఆ గోవిందుడే! కావిగుడ్డలు, బోడితల, కొంతవయసు మీరింది. అంతేభేదం, అదేముఖవైఖరి. గోవిందుడు అతనివైపు చూచాడు. తనను గుర్తుపట్టలేదని తెలుసుకున్నాడు సిద్ధార్థుడు.

"నాకు చాలాసేపు నిద్రపట్టింది. నీ విక్కడికి ఏలా వచ్చావు?" అన్నాడు.

"నీవు నిద్రపోతున్నావు. ఈలాంటిచోట నిద్రపోవడం మంచిదికాదు. పురుగుపుట్ర వుంటవి. నేను బుద్ధభగవానుని అనుచరులలో ఒకడను. భిక్షుకులతో కలిసి నేను యాత్రపోతున్నాను. ఇక్కడ నిన్ను చూచాను. లేప

వలె నడుకున్నాను. కాని, మంచినిద్రలో వున్నావు. వాళ్ళను ముందు పొమ్మని నిన్ను చూస్తూ ఇక్కడ కూర్చున్నాను. నీవు మేలుకున్నావు. ఇక నేను వెళ్ళి వాళ్ళను కలుసుకుంటాను” అన్నాడు గోవిందుడు.

“శ్రమణుడా! నీకు కృతజ్ఞుడను నమస్కారం. బుద్ధ భగవానుని శిష్యులు కరుణాస్వరూపులు. ఇక నీవు వెళ్ళవచ్చును.”

“ సరే! నీకు శుభం కలుగును గాక. శలవు.”

“ ఇదే నానమస్కారం గోవిందా! శలవు.”

గోవిందుడు నివ్వెరపోయి చూచాడు: ‘అయ్యా! నాపేరు మీకు ఏలా తెలుసు’ అని అడిగాడు.

నవ్వుతూ సిద్ధార్థుడు అన్నాడు: “గోవిందా! నిన్ను చిన్నప్పటినుంచి ఎరుగుదును. మనం కలిసి చదువుకున్నాము. కలిసి శ్రమణులతో సాంగత్యం చేశాము. జేతవనంలో విడిపోయినాము.”

‘సిద్ధార్థుడవా నీవు! ఇప్పుడు గుర్తుపట్టుతున్నాను. సిద్ధార్థా! ఇన్నాళ్ళకు నిన్నుచూడడం ఎంత సంతోషంగా వున్నది!’

‘ నిన్ను తిరిగి కలుసుకోవడం నాకూ సంతోషంగానే వున్నది. కాని, గోవిందా! నీవు ఎక్కడికి వెళ్ళుతున్నావు?’

‘ ఒకచోటి కని నేను వెళ్ళడం లేదు. ఒక్క వర్షాకాలంతప్ప తక్కినరోజులు ఈలాగే ఒకచోటి నుంచి ఇంకొకచోటికి పోతూ, ధర్మప్రచారం చేస్తూవుంటాము.

ఇది భిక్షుకుల విధి. సిద్ధార్థా! నీవు ఎక్కడికి వెళ్ళు తున్నావు?'

'నేనుగూడా నీవలెనే ఒకచోటికని వెళ్ళడం లేదు. నేను మార్గంలో వున్నాను. ఒకయాత్ర చేస్తున్నాను.'

'మిత్రమా! నీదుస్తులు నీ తలకట్టు చూస్తే శ్రీమంతునిలాగా వున్నావు. యాత్రికునివలె కనిపించడం లేదు. ఇది శ్రమణులవేషంకాదే!'

'నిజమే; నేను శ్రమణుడనని చెప్పలేదు. నేను ఒక యాత్ర చేస్తున్నానని చెప్పాను. ఆ మాట నిజం.'

'నిజమే కావచ్చు. కాని ఈలాంటివేషంతో యాత్రచేసే మనిషిని ఎన్నడూ చూడలేదు.'

'గోవిందా! ఆలాంటి యాత్రికుని నాలోనే చూస్తున్నావు. కాని ఈ దృశ్యప్రపంచమంతా క్షణభంగుర మైనదేకదా! ఈ వేషంకూడా అంతే. ఈ దేహంకూడా అంతే. నీ వన్నట్టుగా నిన్న నేను శ్రీమంతుడను. అందుకే ఈ వేషం. నిన్న నేను లోకులతోపాటు మనిషిని. అందుకే ఈ తలకట్టు.'

'అయితే, సిద్ధార్థా! ఇప్పుడు నీ వెవరు?'

'నాకే తెలియదు. నేను మార్గంలో వున్నాను. ఇదివరకు ధనికుడను. ఇప్పుడు కాను. రేపటి సంగతి తెలియదు.'

'నీ ఆస్తి పోయిందా?'

'నాకు ఆస్తి పోయిందో ఆస్తికి నేను పోయినానో చెప్పజాలను. ఈ దృశ్యచక్రం వడిగా తిరుగుతూ వుంటుంది. బ్రాహ్మణ సిద్ధార్థుడు, శ్రమణ సిద్ధార్థుడు, ధనిక సిద్ధార్థుడు ఈనాడు ఎక్కడ వున్నారు? అంతా క్షణభంగురం. గోవిందా! నీకు తెలుసును.'

గోవిందుడు అతనివైపు సందేహంగా చూస్తూ కొంత సేపు కూర్చొని తరువాత శెలవు తీసుకొని వెళ్ళాడు.

గోవిందుని చూచినప్పుడు సిద్ధార్థునికి ప్రేమ పొంగి వచ్చింది. ఒక్క గోవిందుని చూచినప్పుడే కాదు—నిద్ర లేచిన తరువాత దేనిని చూచినా అతనికి ప్రేమ, ఆనందం కలుగుతూ వున్నది. ఇదివరకు దేనిని చూచినా, ఎవరిని చూచినా అతనికి అట్టి భావం కలిగేది కాదు. ఆలాంటి ప్రేమభావం లేకపోవడంవల్లనే తనబ్రతుకులో అంత దోషం యేర్పడిం దనుకున్నాడు. అది అతనికి నిద్రలో కలిగిన మార్పు. అంతసేపూ అతనిలోపల మోగుతూ వుండిన ఓంకారం మహత్తు.

నిద్రవల్ల అతనికి అలసట తగ్గి కొంతబలం వచ్చింది. కాని ఆకలి యెక్కువగా వున్నది. అన్నం తిని రెండురోజు లైంది. ఆకలిని సహించగల శక్తి ఎన్నడో పోయింది. ఇదివరకు కమలతో తనకు ఆలోచించడం, వేచివుండడం, పస్తుచేయడం— ఈ మూడు కళలలో ప్రజ్ఞ వున్నట్టు గర్వంగా చెప్పుకున్నాడు. ఆ మాటలు జ్ఞప్తికి వచ్చి నవ్వుకున్నాడు. నిజమే. అతడు యౌవనంలో ఆ మూడు

కళలను అభ్యసించి స్వాధీనం చేసుకున్నాడు. వాటిని మధ్యలో వచ్చిన భోగాలమూలంగా పోగొట్టుకున్నాడు. ఇప్పుడు మామూలు మనిషిగానే నిలిచాడు.

సిద్ధార్థుడు తన స్థితిని గూర్చి ఆలోచించ నారంభించాడు. ఆలోచించడం కూడా అతనికి కష్ట మనిపించింది.

"క్షణభంగురాలైన అన్ని విషయాలు నన్ను విడిచి పోయినవి. నేను ఒంటరిగా మిగిలాను. నాది అన్నది ఒకటీ లేదు. నాకు తెలిసింది ఏమీ లేదు నేను నేర్చుకొన్నది కూడా ఏమీ లేదు. నాకు వయసు మళ్ళింది, తల నెరిసింది, బలం తగ్గింది. ఈ నాడు నాకు బాల్యదశ తిరిగి వచ్చింది. ఏమీ చిత్రం! ఏమి కర్మ!" అతనికి విచారం కలగడం లేదు. నవ్వవలెనని, తన్ను చూచుకొని ఈ పిచ్చిప్రపంచాన్ని చూచి నవ్వవలెనని గాఢవాంఛ కలిగింది.

తన బ్రతుకు వెనక్కు పోతూవుం దనుకున్నాడు. నవ్వుకున్నాడు. నదివైపు చూచాడు. ఆనది పాడుతూ వెనక్కు ప్రవహిస్తూవున్నట్లు కనిపించింది. అతనికి చాలా సంతోషం కలిగింది. నదిని చూచి ఉత్సాహంగా నవ్వుకున్నాడు. తాను దూకి చచ్చిపోదా మనుకొన్న నది అదే కదూ! ఎప్పుడు? ఎంతకాలమైంది? అది నిజమా? కలా?

"పసితనం దేవుళ్ళతోనూ, యజ్ఞాలతోనూ గడించింది. యౌవనం, వైరాగ్యంతోనూ, తత్త్వవిచారంతోనూ ధ్యానంతోనూ గడించింది. బ్రహ్మజ్ఞానం సంపాదించవలెననుకున్నాను. అడవిలో వున్నాను. చలిసీ యెండనూ

సహించాను. పస్తు లుండడం అలవాటు చేసుకున్నాను. ఇంద్రియాలను జయించడం నేర్చుకొన్నాను. అప్పుడు బుద్ధ భగవానునిసంగతి తెలిసింది. ఆయనదగ్గరకు వెళ్ళాను. ఆయన బోధలను గ్రహించి, ఆశ్చర్యపడ్డాను. జ్ఞానమూ-ప్రపంచం యొక్క ఏకత్వమూ నాలో రక్తంతోపాటు ప్రవహిస్తూన్నట్టు అనిపించింది. ఆయనను కూడా వదిలాను. కామస్వామివద్ద వ్యాపారాన్ని, కమలవద్ద కామ కళను నేర్చుకొన్నాను. ధనం పోగుచేసాను – వెదజల్లాను. రుచులను మరిగాను. ఇంద్రియవాంఛలను పెంచుకున్నాను. నా తెలివిని, ఆలోచనాశక్తిని పోగొట్టుకోడానికి ఎంతో కాలం పట్టింది. ప్రపంచంలో ఏకత్వం కలదన్న సంగతి మరచాను. ఆ జ్ఞానమే నశించింది. ఇన్ని మార్పులు గలిగిన వెనక ఈనాడు నాకు పసితనం వచ్చింది.''

''కాని, ఈ మార్గం మంచిదే – నా హృదయపంజరం లోని పిట్టచచ్చిపోలేదు. అబ్బ? ఎంత అవివేకం! ఎంత పాపం! ఎన్నిదోషాలు! ఎంత అసహ్యం, ఈ పసితనం రావడానికి, బ్రతుకు మళ్ళా ప్రారంభించడానికి! కాని అది అలాగే జరగవలెనని నా హృదయం చాటుతూవున్నది. నైతికంగా ఇంతపతనం కలిగి, నిరాశ ప్రబలి, ఆత్మహత్యకు సిద్ధపడినప్పుడే అనుగ్రహం ప్రాప్తించింది. ఓంకారం వినిపించింది. నాలో ఆత్మను తెలుకోడానికి అంతమూఢుడను కావలసివచ్చింది. తిరిగి బ్రతకడానికి అంత పాపం చేయవలసి వచ్చింది. ఈ మార్గం నన్ను ఎక్కడికి లాక్కొని పోతుందో ?''

తనలో ఏదో మహాసుఖం ఉబికివస్తూ వున్నట్టు తెలుసుకున్నాడు.

"ఇది ఎక్కడనుంచి వస్తూ వున్నట్టు? ఈ సుఖవేదనకు కారణమేమిటి? నేను పొందిన గాఢనిద్రవల్లనా? ఓంకారాన్ని ఉచ్చరించడం వల్లనా? సంసారాన్ని వదిలించుకుని, పరుగెత్తి రావడంవల్లనా? నేను తప్పించుకుని వచ్చిన ఆ వాతావరణంలో ఆ సుగంధాలు, ఆ రుచులు, ఆ జడత్వం, ఆ మత్తు వాటిమీద నాకు ఎంత వెగటు పుట్టింది! ఆ కాలంలో ఆసిద్ధార్థుడే తెలివిగలవాడనుకున్నాను. ఆ దురూహ నాకు మళ్ళా కలగదు. ఒక్కటి మంచిపని చేశాను. అందుకు నాకు సంతోషం. అందుకు నన్ను నేనే అభినందించుకుంటాను. ఆ తుచ్ఛపు బ్రతుక్కు స్వస్తి చెప్పాను. సిద్ధార్థా! నిన్ను అభినందిస్తున్నాను. ఇన్నాళ్ళు ఆ పాడుబ్రతుకు బ్రతికినా చివరకు నీకు మంచి ఆలోచన కలిగింది. ఒకపని సాధించావు. నీ హృదయపంజరంలో పిట్టపాటను విన్నావు. ఆ పాటవెంట బయలుదేరి వచ్చావు."

ఆ బ్రతుకుమీద అంతరోత పుట్టకపోయినట్టయితే ఆత్మను అలక్ష్యం చేసి దేహసుఖంకోసం కామస్వామిని, కమలను వదలకుండా ఆ నరకంలో ఇంకా ఎంతకాలం దొర్లుతూ వుండేవాడో! అయితే ఆ నిర్వేదం, ఆ జుగుప్స అతనిని అణిచివేయలేక పోయినవి. అతని హృదయపంజరంలో పిట్ట పాడుతూనే వున్నది. అతనిలోపల ధ్వని మోగుతూనే వున్నది. అందుకే అతడు సంతోషిస్తున్నాడు.

అందుకే అతడు నవ్వ గలుగుతున్నాడు. అతనితల నెరిసినా ముఖంలో వెలుగు మాసిపోలేదు.

"మంచిగాని చెడుగాని స్వంతంగా అనుభవించడం మేలు. లౌకికసుఖాలు, ధనం, మంచివి కావని పసితనంలో నేర్చుకున్నాను. కాని, ఈనాడు అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. నా కళ్లతో, నా మనస్సుతో, నా దేహంతో తెలుసుకున్నాను. ఈ విధంగా తెలుసుకోవడమే మంచిది" అనుకున్నాడు.

తనలో కలిగిన మార్పునుగూర్చి చాలాదూరం ఆలోచించాడు. హృదయపంజరంలో పిట్ట పాడుతూ వున్న పాటను విన్నాడు. ఆ పిట్ట చచ్చిపోలేదు. చచ్చిపోయింది ఇంకొకటి.

చిరకాలంగా దేనిచావును తాను వాంఛిస్తున్నాడో అది చచ్చిపోయింది. దానిని చంపడానికే ఒకప్పుడు సాధన చేశాడు. అది అతనిలోని అహంత. చిరకాలం దానితో కుస్తీలు పట్టాడు. చిట్టచివరకు అదే గెలుస్తూ వచ్చింది. అదే అతని ఆనందాన్ని దోచివేసింది. అదే అతనిలో భయాన్ని పురికొల్పింది. అదే ఆనాడు ఆ నదివొడ్డున చచ్చింది. దాని చావువల్లనే అతనికి మళ్ళా పసితనం వచ్చింది. ఆత్మవిశ్వాసము, సుఖము, నిర్భీతి కలిగినవి.

తాను బ్రాహ్మణుడై శ్రమణుడై అహంతతో అంతగా ఎందుకు పోరాడిందీ సిద్ధార్థుడు ఆనాడు గ్రహించాడు.

విజ్ఞానము, మంత్రతంత్రాలు, యజ్ఞాదికర్మలు, దేహశోషణ సాధనలు ఇవన్నీ మితిమీరి అతనికి ప్రతిబంధకాలైనవి. అందరికన్నా తెలివిగలవాడననీ, పండితుడననీ, ప్రజ్ఞావంతుడ ననీ ఒక గర్వం పెచ్చు పెరిగింది. ఆగర్వంలోకి ప్రవేశిం చింది, అతని అహంత. అక్కడ పీటపెట్టుకుని కూర్చున్నది. ఒకవైపు అది పెరుగుతూవుంటే, తన ఉపవాసాలతోనూ, తపస్సులతోనూ దానిని చంపివేస్తున్నానని భ్రమపడ్డాడు. తన అంతర్వాణే సత్యమైందనీ, ఏ గురువు గాని తనకు ముక్తిని సంపాదించి పెట్టజాలడనీ నేటికతడు గ్రహించాడు.

అందుకే అతడు ప్రపంచంలోకి వెళ్ళాడు. స్త్రీకి, ధనానికీ, అధికారానికి వశుడైనాడు. వర్తకం చేశాడు, జూదం ఆడాడు, తాగాడు. అతనిలో శిష్టుడు, శ్రమణుడు మాయమైనారు. పట్టరాని నిర్వేదం కలిగేటంతవరకు ఆ బ్రతుకు గడిపాడు. ఆ నిర్వేదం కలగగానే సుఖాసక్తు డైన సిద్ధార్థుడు, ధనికుడైన సిద్ధార్థుడు పోయినారు. ఆ స్థానంలో ఒక క్రొత్త సిద్ధార్థుడు నిద్రలో నుంచి మేలు కున్నట్టు లేచాడు. ఈ సిద్ధార్థుడుకూడా ఒకనాటికి చావక తప్పదు. కాబట్టి సిద్ధార్థుడు క్షణికవస్తువు. అన్ని వస్తువులు అంతే. కాని ఈ క్రొత్త సిద్ధార్థుడు ఈ నాటికి సుఖిగా వున్నాడు.

సిద్ధార్థుడు ఈ విధంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. ముందు ప్రవహిస్తూ వున్ననదిని చూచాడు. ఆతనిని ఒక నది ఎన్నడూ ఇంతగా ఆకర్షించలేదు. నీళ్ళ చప్పుడులో

ఇంత మాధుర్యం ఎన్నడూ వినిపించలేదు. ఆ నది తనతో ప్రత్యేకంగా తనకు తెలియని విషయం, జరగనున్న విషయం, చెప్పదలచినట్టుగా కనిపించింది. అంతకుముందు సిద్ధార్థుడు ఆ నదిలో దూకడానికి సిద్ధపడ్డాడు. నిర్వేదంతో క్రుంగిపోయిన ఆ సిద్ధార్థుడు ఆనాడు నదిలోపడి మునిగిపోయినాడు. ఈ క్రొత్త సిద్ధార్థునికి ప్రవహిస్తూ వున్న నదిమీాద గాఢమైన ప్రేమభావం కలిగింది. తొందరపడి ఆ నదిని విడిచి పోగూడదు అనుకున్నాడు.



# 5. పల్లెకారి



"ఈ నదికి సమీపంగానే వుంటాను. ఆనాడు ఈ నదినే దాటి నగరానికి వెళ్ళాను. అప్పుడు నన్ను పడవ మీద దాటించిన పల్లెకారి కుటీరానికే వెళ్లుతాను. ఆనాడు ఆ కుటీరాన్ని వదిలిన తరువాత ఒక రకం బ్రతుకు బ్రతికాను. ఆ బ్రతుకు ముగిసింది. మళ్ళా నా కొత్తబ్రతుకు ఆ కుటీరం దగ్గరనే ఆరంభం కావలెను" అనుకున్నాడు సిద్ధార్థుడు.

నదిలో పారుతూ వున్న నీళ్ళవైపు చూచాడు. పచ్చగా స్వచ్ఛంగా వున్నది. నీళ్ళమీద గీరలు వెండి తీగెలు లాగా మిల మిల మెరుస్తూ వున్నవి. ముత్యాలు లాగా లోపలినుంచి బుడగలు లేస్తున్నవి. ఆనీళ్లలో ఆకాశం ప్రతిఫలిస్తున్నది. పచ్చగా, తెల్లగా, నీలంగా వేయికళ్ళతో తన వైపుచూస్తున్నట్టుగా వున్నది ఆనది. అతనికి ఆ నదిమీాద ఎంత ప్రేమ? అతనిని అంతగా ఆకర్షించింది ఆ నది. దానియెడల అతడు అంత

కృతజ్ఞుడు. అతని హృదయంలో క్రొత్తగా ఒక ధ్వని విని పించింది: "ఈ నదిని ప్రేమించు; దీని దగ్గరేవుంపు. దీని వల్ల నేర్చుకో" అని. ఆలాగే ఆ నది ఉపదేశాలను విని దానివల్ల నేర్చుకోవలె ననుకున్నాడు. ఆ నదిని అర్థంచేసుకో గలవానికి ఎన్నో రహస్యాలు—అన్ని రహస్యాలు తెలియ గలవనిపించింది అతనికి.

ఈనాడు ఆనదివల్ల అతనికి ఒక్క రహస్యంమాత్రం తెలిసింది: ఆ నదిలో నీళ్లు తెంపు లేకుండా పారుతున్నవి. కాని ఆ నది అక్కడే, ఆ విధంగానే, ఎప్పటికప్పుడు క్రొత్తగా నిలిచి వున్నది. ఈ రహస్యాన్ని ఎవరు గ్రహించ గలరు? ఎవరు ఊహించగలరు? అతనికీ అర్థం కాలేదు. మసక మసకగా ఏదో సందేహం, ఏదో స్మృతి, ఏవో దివ్య ధ్వనులు. అంతే అతనికి గోచరించినవి.

సిద్ధార్థుడు లేచాడు. లోపల ఆకలి మండిపోతూ వున్నది. కష్టంగా నదివొడ్డున తిరిగాడు, బైట నీళ్ళ గల గల, కడుపులో ఆకలి కరకర. ఒడ్డున పల్లెకారి పడవను పెట్టు కుని వున్నాడు. అతనిని గుర్తుపట్టాడు సిద్ధార్థుడు. అతడు కూడా పెద్దవా డయినాడు.

"నన్నుదాటిస్తావా?" అని అడిగాడు.

పల్లెకారి అతని పెద్దమనిషితరహాను చూచి విస్తు పోతూ:

"ఆలాగే, పడవమీదికి రండి" అన్నాడు. సిద్ధార్థుడు పడవ ఎక్కాడు. "నీ వృత్తి బాగున్నది. ఈ నదిదగ్గర

వుంటూ రోజూ పడవను నడపడం ఎంత హాయి!" అన్నాడు. పల్లెకారి నవ్వుతూ అన్నాడు:

"అయ్యా! ఏ వృత్తి మంచిది కాదు ?"

"కావచ్చు, కాని నీ వృత్తి నాకు నచ్చింది."

"అయితే మీలాగా అందమైన దుస్తులు వేసుకునే పెద్దలకు తగింది కాదు."

సిద్ధార్థుడు ఆ మాటకు నవ్వుతూ: "ఈ దుస్తులమీద నాకు మోజుపోయింది. వీటిని నీవు తీసుకో. నదిని దాటించినందుకు నీ కివ్వడానికి నాదగ్గర పైసా లేదు." అన్నాడు.

"నామాటకు ఎగతాళి చేస్తున్నారా?" అన్నాడు పల్లెకారి.

"మిత్రమా! ఎగతాళికాదు. ఇదివరకు నన్ను ఊరికే దాటించావు. ఈ తడవైనా కేవుకిగ్రింద ఈ బట్టలు తీసుకో ?"

"మరి మీకో ?"

"ఏవైనా మాసిన బట్టలిస్తే చాలు నాకు. నన్ను నీ దగ్గరవుంచుకో. పడవనడపడం నేర్చుకుని నీకుతోడుగా వుంటాను."

"ఓహో! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఆ రాత్రి నా గుడిసెలో పండుకున్నారుకదూ మీరు? చాలకాలమైంది. ఇరవై యేళ్ళకు పూర్వం. అప్పుడు మీరు శ్రమణుడుగా వుంటిరే! మీ పేరు జ్ఞాపకం లేదు."

"నాపేరు సిద్ధార్థుడు. నీవు చూచినప్పుడు శ్రమణుడనే."

"సిద్ధార్థా! మీకు స్వాగతం. నాపేరు వాసుదేవుడు. ఈ నాడు నా అతిథిగా వుండండి. నా గుడిసెలో పండుకోవచ్చు. మీరు ఎక్కడనుంచి వస్తున్నారు? అంత చక్కని దుస్తులమీద ఎందుకు అసహ్యం?"

పడవ అవతలి వొడ్డుకు చేరింది. ఇద్దరూ కలిసి గుడిసె వద్దకు వెళ్ళారు. వాసుదేవుడు సిద్ధార్థునికి అన్నం వడ్డించాడు. సిద్ధార్థుడు తృప్తికరంగా భోజనం చేశాడు. వాసుదేవుడిచ్చిన మామిడిపండుకూడా తిన్నాడు.

అస్తమయం అవుతున్నది. వాసుదేవుడు సిద్ధార్థుడు నదిఒడ్డున చెట్టుక్రింద కూర్చున్నారు. సిద్ధార్థుడు తన పుట్టు పూర్వోత్తరాలు అన్నీ వివరంగా చెప్పాడు. వాసుదేవుడు సావధానంగా విన్నాడు. వాసుదేవుని ఉత్తమగుణాలలో అదొకటి. అతనికి వినడం ఏలాగో తెలుసును. వినడం నేర్చినవారు కొద్దిమందే. ఒకసారైనా పెదవి విప్పకుండా తాను చెప్పే ప్రతి మాటను నెమ్మదిగా ఆసక్తితో వాసుదేవుడు వింటూవున్నట్టు సిద్ధార్థుడు గ్రహించాడు. అంతసేపు చెపుతూ వుంటే అతనికి విసుగుదలకాని, 'అవును', 'కాదు' అనడం కాని లేదు. శ్రద్ధగా వింటూవున్నాడు. తన బ్రతుకుమీద, తన కష్టసుఖాలమీద, అంత ఆసక్తిని చూపుతూ వినడం సిద్ధార్థునికి ఆశ్చర్యకరంగా వున్నది.

కథ చివరిఘట్టంలో తనకు తీవ్రంగా నిరాశ కలగడం. ఓంకారం వినిపించడం – గాఢనిద్రపట్టడం – నిద్రలేవగానే

నదిమీద ప్రేమకలగడం – ఈ సంగతులన్నీ చెపుతూ వుండగా వాసుదేవుడు సావధానంగా ఏకాగ్రచిత్తంతో కళ్ళుమూసుకొని విన్నాడు.

సిద్ధార్థుడు ముగించిన తరువాత వాసుదేవుడు చాలా సేపు మౌనంగా వుండి చనువుగా ఈలా అన్నాడు: "మిత్రమా! నేను అనుకొన్నట్టే జరిగింది. అయితే నది నీతో మాట్లాడిందన్నమాట. నదికి నీమీద ప్రేమ వున్నది. నీతో మాట్లాడుతుంది. ఇదంతా నీ మంచికే! నీవు నాతో వుండు. నా భార్య చాలా కాలం క్రింద పోయింది. నాటి నుంచి ఒంటరిగానే వున్నాను. నీకూ. నాకూ తగినంత జాగా వున్నది. అన్నానికి లోటు లేదు."

"వాసుదేవా! అలాగే వుంటాను. నీ దయకు కృతజ్ఞుడను. నీవు నా జీవితగాథ నంతా శ్రద్ధతో విన్నావు. వినడం ఏలాగో తెలిసినవారు కొద్దిమంది. నీ వలె వినగల మనిషిని ఎక్కడా చూడలేదు. ఈ నేర్పును నేను నీ వల్ల గ్రహిస్తాను."

"మిత్రమా! నీవు నేర్చుకుంటావు. కాని నా వల్ల కాదు. వినడం ఏలాగో నాకు ఆ నది నేర్పింది. ఆ నదివల్లనే నీవూ నేర్చుకుంటావు. ఆనదికి అన్నీ తెలుసును. దానివల్ల అన్నీ తెలుసుకోవచ్చును. అడుగుకుపోయి పాటుపడవలె నన్న సంగతి ఇదివరకే నీవు నదివల్ల నేర్చుకొన్నావు. శ్రీమంతుడైన, బ్రాహ్మణుడైన సిద్ధార్థుడు పడవనడిపేవాడు కాబోతున్నాడు. ఈ తెలివికూడా నీకు నదివల్లనే కలిగింది. ఇంకొక సంగతికూడా నీవు తెలుసుకుంటావు."

"వాసుదేవా! ఇం కొకసంగతి ఏమిటి?"

"మిత్రమా! ప్రొద్దుపోయింది – ఇంక పండుకుం దాము. ఆ సంగతి ఏమిటో నేను చెప్పలేను. నీవే తెలుసు కుంటావు. బహుశా నీకు ఇదివరకే తెలిసివుంటుంది. నేను పండితుడనుకాను. ఏలా మాట్లాడవలెనో ఏలా ఆలోచించ వలెనో నాకు తెలియదు. వినడం ఏలాగో, శ్రద్ధచూపడం ఏలాగో నాకు తెలుసును. అంతే. ఇంకేమీ నేను నేర్చుకో లేదు. మాటలు చెప్పడం, బోధలుచేయడం తెలిసివుంటే బహుశా నేను కూడా ఒక గురువునై వుందును. కాని ప్రస్తుతం నేను పడవనడిపేవాడను. మనుష్యులను ఈ నదిమీద దాటించడమే నా పని. నేను వేలకొలది జనాన్ని ఈ నదిమీద దాటించాను. వారందరికీ నది తమ ప్రయా ణంలో ఒక అడ్డంకిగా మాత్రమే కనిపించింది. అంతకంటే వారికి అర్థం కాలేదు. వారు ధనంకోసం, వ్యాపారాలకోసం, వివాహాలకోసం, యాత్రలకోసం వెళ్ళేవారు. నది వారికి దారిలో వున్నది. ఈ అడ్డంకిని త్వరగా దాటించడానికి పల్లెకారి వున్నాడు. ఆ వేలమందిలో ఈ నది అడ్డంకికాని వారు ఏ నలుగురో అయిదుగురో కొద్దిమంది మాత్రమే. వారు ఈనది చెప్పేమాటలు విన్నారు. వాటిని చెవినిపెట్టారు. నాకు అయినట్లే వారికిన్ని ఈ నది పుణ్యతీర్థం అయింది. సిద్ధార్థా! ఇంక పండుకుందాము."

సిద్ధార్థుడు పల్లెకారివద్ద వున్నాడు. పడవ నడపడం ఏలాగో నేర్చుకున్నాడు. పడవపని లేనప్పుడు వరిపొలంలో పని చూచేవాడు. కట్టెలు కొట్టేవాడు. బుట్టలు అల్లేవాడు.

అరటిగెలలను మోగ పెట్టేవాడు. ప్రతిపని అతనికి ఆనందంగా వుండేది. ఈ విధంగా రోజులూ నెలలూ గడచి నవి. అతనికి వాసుదేవుడు నేర్పినదానికంటె నదివల్ల ఎక్కువ నేర్చుకున్నాడు. నదివల్ల తెంపులేకుండా నేర్చుకుంటూ వుండేవాడు. అన్నిటికంటె వినడం ఏలాగో నదివల్ల నేర్చుకున్నాడు. నిశ్చలమైన హృదయంతో, నగ్నమైన ఆత్మతో, ప్రతీక్షతో, మనోవికారం లేకుండా, వాంఛ లేకుండా, తర్కబుద్ధి లేకుండా, అభిప్రాయాలు లేకుండా వినడం నేర్చుకున్నాడు.

ఇద్దరూ అప్పుడప్పుడు స్వల్పంగా మాట్లాడుకునే వారు. బాగా ఆలోచించుకున్నమీదట మాట్లాడుకునే వారు. వాసుదేవుడు అంత మాటకారి కాడు. సిద్ధార్థుడు కదలించినా అరుదుగా మాట్లాడేవాడు.

"నదివల్ల ఆ రహస్యంకూడా తెలుసుకున్నావా! కాలం అంటూ ఒక వస్తువులేదని?" అని అడిగాడు సిద్ధార్థుడు ఒకసారి. వాసుదేవుడు నవ్వుముఖంతో ఈలా అన్నాడు! "సిద్ధార్థా! ఇదేకదూ నీభావం! పుట్టినచోటను, ఆరంభంలోను, పై నుంచి దూకేచోటను, పారేచోటను, పడవరేవులోను, పర్వతాలలోను, సముద్రంవద్దను అన్ని చోట్లను నది ఒక్కసమయంలోనే వుంటున్నది. భూత భవిష్యత్తుల ఛాయలు లేకుండా ఆ నదికి ఒక్క వర్తమానమే వుంటుంది. ఇదేకదూ నీ భావం?"

"ఆ! అదే! దానిని నేర్చుకున్న తరువాత నా జీవితాన్నిగూర్చి ఆలోచించాను. అదికూడా ఒక నదిగానే

వున్నది. బాల్యంలోనూ, యౌవనంలోనూ, ముసలితనం లోనూ, సిద్ధార్థుని వేరుచేసినవి నీడలే. వాస్తవాలు కావు. సిద్ధార్థుని పూర్వజన్మలుకూడా గతంలో వుండినవి కావు. అతడు చావడమూ బ్రహ్మలో కలిసిపోవడమూ ముందు జరిగేవీకావు. ఏదికూడా ఇదివరకు ఉండినది, ముందు ఉండబోయేది కాదు. ప్రతిదీ ఉండనే ఉన్నది. సత్యం గానే వున్నది. ”

ఈ రహస్యం తెలిసిన తరువాత సిద్ధార్థునికి తృప్తిగా వున్నది. వాసుదేవునితో ఈలా అన్నాడు: “అయితే, దుఃఖము, ఆత్మశోషణ, భయము ఇవన్నీ కాలంలో వున్నవేకదూ? కాలాన్ని త్రోసివేసిన తరువాత, కాలాన్ని జయించిన తరువాత అన్ని కష్టాలను, అన్ని దోషాలను జయించినట్టేకదూ?” వాసుదేవుడు చిరునవ్వుతో ‘ఔ’న న్నట్టు తలవూపి సిద్ధార్థుని వీపు తట్టాడు.

వర్షాకాలంలో నది పొంగి పెద్దగా మోగుతూ వున్నది. సిద్ధార్థుడు అన్నాడు: “వాసుదేవా! ఈ నదిలో ఎన్నిగొంతుకలు వినిపిస్తూ వున్నవి! రాజులాగా, సైనికుని లాగా, వృషభంలాగా, పిట్టలాగా, గర్భిణీస్త్రీలాగా, మూలిగే మనిషిలాగా, ఇంకా వేలగొంతుకలతో వినిపిస్తూ వున్నవి. ”

“నిజమే! అన్నిజీవుల గొంతుకలు ఆ నదిగొంతు కలో వున్నవి. ”

“ఒక్కసారిగా అన్నివేల గొంతుకలు వినగలిగిన మనిషికి ఈ నది చిట్టచివరకు ఏశబ్దాన్ని వినిపించేదీ నీకు

తెలుసునా ?'' వాసుదేవుడు సంతోషంతో నవ్వి, సిద్ధార్థుని చెవిలో రహస్యంగా "ఓం'' అన్నాడు. సిద్ధార్థుడు విన్నది కూడా అదే.

కాలం గడిచేకొద్దీ వాసుదేవునిముఖంలోని చిరునవ్వు, కాంతి, సుఖం, పసితనం, ముసలితనం అన్నీ ఆలాగే కనిపిస్తూవున్నవి సిద్ధార్థుని ముఖంలోకూడా. చాలామంది యాత్రికులు ఇద్దరూ అన్నదమ్ములు అనుకునేవారు. సంజ పాటున ఇద్దరూ నదివొడ్డున చెట్టుక్రింద కూర్చునేవారు. ఇద్దరూ మౌనంగా నదిభాషను వినేవారు. ఆ నది వారికి వట్టినీళ్ళుకావు. అది జీవశబ్దం. నిత్యంగా వుంటూ, తెంపు లేకుండా మారుతూవుండే శబ్దం ఆ నది. ఒక్కొక్క సమయంలో ఆ నదిభాషను వింటూ కూర్చున్నప్పుడు ఇద్దరికీ ఒక్కరకం భావాలే కలిగేవి. గతదినం తాము చేసిన చర్చలను గూర్చో; ఎవరో యాత్రికుడు చెప్పుకున్న సొంత గోడును గూర్చో; ఏదో చావును గూర్చో; తమ చిన్ననాటి అనుభవాలను గూర్చో ఏభావం వచ్చినా, ఒక్కరకంగానే వచ్చేది. ఏ మంచివిషయాన్ని చెప్పినా ఆనది ఇద్దరికీ ఒకే సమయంలో చెప్పేది. ఇద్దరూ మనసులో ఒకటే ప్రశ్నను వూహించేవారు. ఆనది ఇద్దరికీ ఒకటే జవాబు చెప్పేది. ఇద్దరూ సంతోషంతో ఒకరివైపు ఒకరు చూచుకునేవారు.

ఆ పల్లెకారులను, పడవనుచూచి యాత్రికులకు ఏవేవో భావాలు కలిగేవి. ఒక యాత్రికుడు తన జీవితాన్ని గూర్చి, తన కష్టాలనుగూర్చి తానుచేసిన పాపాలను గూర్చి

వారితో చెప్పుకునేవాడు. ఒక యాత్రికుడు ఆనదిలో ఏవో మాటలు వినిపించగా ఆరోజు అక్కడే నిలిచేవాడు. ఎవరో ఇద్దరు సిద్ధపురుషులు పడవను నడుపుకుంటూ వున్నట్టు ఆనోట ఆనోట విని కొందరు చూడవలెనన్న ఆసక్తితో వచ్చేవారు. ఏవేవో ప్రశ్నలు వేస్తూవుండే వారు. దేనికీ జవాబు లేకపోవడంచేత ఇద్దరినీ పిచ్చివాళ్ళ క్రింద కట్టి వెళ్ళిపోయేవారు.

ఈ విధంగా ఎవ్వరూ లెక్కపెట్టకుండానే సంవత్సరాలు దొర్లిపోయినవి. ఒకనాడు కొంతమంది భిక్షుకులు ఆ నదివద్దకు వచ్చారు. నదిని దాటించమని అడిగారు. వారి వల్ల మన పల్లెకారులకు ఒక వార్త తెలిసింది. బుద్ధభగవానునికి అనారోగ్యంగా వున్నదనీ, త్వరలో ఆయన పరినిర్వాణం పొందవచ్చు ననీ, ఆయనను చివరిసారి దర్శించడానికి తాము వెళ్ళుతున్నామనీ భిక్షుకులు చెప్పారు. భిక్షుకులు తండోపతండాలుగా వెళ్ళుతున్నారు.

ఆ వార్త సిద్ధార్థుని మనస్సును ఎంతో కలతపెట్టింది. అతడు బుద్ధభగవానుని దర్శించాడు. ఆయనతో సంభాషించాడు. ఆయన మార్గాన్ని అనుసరించకపోయినా వ్యతిరేకి కాడు. ఒకపరమార్థాన్ని తెలుసుకోవలెనన్న తీవ్రకాంక్ష గల జిజ్ఞాసువు ఒకరి బోధలను అనుసరించడం సాధ్యం కాదని సిద్ధార్థుని విశ్వాసం. పరమార్థాన్ని తెలుసుకున్న తరువాత అన్ని మార్గాలను, అన్ని లక్ష్యాలను ఆమోదించగల డనికూడా అతని విశ్వాసం. అనంత

కాలంలో దివ్యానుభూతిని పొందిన వేలకొలది సద్ధతకు తనకు భేద ముండ నేరదు.



* * *

కమల తన పూర్వజీవితాన్ని వదులు కున్నది. తోటను బౌద్ధ భిక్షుకుల ఆశ్రమంక్రింద మార్చింది. బౌద్ధ ధర్మాన్ని అవలంబించింది. బుద్ధభగవానుని గూర్చిన వార్త విని ఆయన దర్శనంకోసం బయలుదేరింది. ఆమె వెంట పసి వాడు పదేళ్ళ కొడుకు వున్నాడు. బట్టలమూట నెత్తిన పెట్టుకుని ప్రక్కన పిల్లవాని నడిపించుకుంటూ కమల నది వద్దకు వచ్చింది. పిల్లవాడు అలిసిపోయినాడు. అంత వరకూ సుఖంగా బ్రతికినవాడు. కష్టాలు తెలిసినవాడు కాడు. ఒకవైపున ఆకలి, ఒకవైపున బడలిక. అన్నం పెట్టమంటాడు. ఇంటికి పోదా మంటాడు. పోరుపెట్టి ఏడు స్తున్నాడు. "ఎవరో చస్తూవుంటే మనం పోవడ మెందుకు ? చావనీ" అంటూ మొండిగా నేలమీాద చదికిలపడ్డాడు. కమల ఏమి చేయగలదు ! తానూ అలిసిపోయింది. పిల్లవాని చేతిలో ఒక అరటిపండు పెట్టింది. నేలమీాద బట్ట పరుచు కున్నది. పండుకున్నది. పిల్లవాడు అరటిపండు వొలుచు కొని తింటున్నాడు. అంతలో కమల కెవ్వున కేక పెట్టింది. పిల్లవాడు ఉలికిపడి తల్లివద్దకు వచ్చాడు. కమలముఖం కళ తప్పుతున్నది. మైకం వేస్తున్నది. ఆమె పక్కక్రింద నుంచి నల్లనిపాము జర జరా పాకిపోయింది.

ఏలాగో ఆయాసపడుతూ కమల పడవసమీాపానికి వచ్చి కూలబడింది. పిల్లవాడు తల్లిని చుట్టుకొని పెద్ద పెట్టున

ఏడుస్తున్నాడు. ఆ యేడుపు వాసుదేవునికి వినవచ్చింది. పరుగెత్తుకొని వచ్చాడు. "మా అమ్మను పాము కరిచింది" అని పిల్లవాడు వెక్కి వెక్కి ఏడ్చాడు. వాసుదేవుడు ఆమెను చేతులలోకి తీసుకున్నాడు. తన గుడిసెదాకా మోసికొని వచ్చాడు. పిల్లవాడుకూడా పరుగెత్తుకుంటూ వచ్చాడు.

సిద్ధార్థుడు గుడిసె వాకిట నిలబడి వున్నాడు. పిల్లవానివైపు చూచాడు. ఏదో జ్ఞప్తికి తగిలింది. కమలను చూచాడు. వెంటనే గుర్తుపట్టాడు. కమలను సిద్ధార్థుని పక్కమీదనే పండుకో పెట్టారు. గాయాన్ని కడిగి ఏదో మందు వేశారు. కొంచెం తెలివి వచ్చింది. కళ్లు తెరిచి చూచింది. సిద్ధార్థుడు తనమీద వంగి చూస్తున్నాడు. కమలకు అదేదో కలగా తోచింది. అంతలో కొడుకు జ్ఞాపకం వచ్చి "నా బిడ్డ ఎక్కడ ?" అన్నది. "ఇక్కడే వున్నాడు ఆయాసపడకు" అన్నాడు సిద్ధార్థుడు మెల్లగా.

కమల అతని కళ్లలోకి చూచింది. "సిద్ధార్థుడవా నీవు ? ప్రియా ! నీకు ముసలితనం వచ్చినా, ఆనాడు తోట ముందు నిల్చున్న శ్రమణ యువకునిలాగానే కనిపిస్తున్నావు నా కళ్లకు. నాకూ వయసు మళ్ళింది. నన్ను గుర్తుపట్టావా?" అన్నది.

"ప్రియా ! కమలా ! నిన్ను చూడడంతోనే గుర్తుపట్టాను."

"సిద్ధార్థా ! అడుగో పిల్లవాడు. వాడు నీ కొడుకు."

సిద్ధార్థుడు కళ్లుతిప్పి చూచాడు. మళ్ళీ మూసుకున్నాడు. పిల్లవాడు ఏడుస్తున్నాడు. సిద్ధార్థుడు దగ్గరకు

తీసుకొని ఒడిలో కూర్చోపెట్టుకున్నాడు. ఏవో శ్లోకాలు చదివాడు. పిల్లవాడు ఏడుపు చాలించి తండ్రి ఒడిలోనే నిద్రపోయినాడు. తిన్నగా ఎత్తుకొని వాసుదేవుని పక్క మీద పండుకో పెట్టాడు. వాసుదేవుడు ఏదో సవరించు కుంటున్నాడు. సిద్ధార్థుడు అతనివైపు చూచాడు. వాసుదేవుడు చిరునవ్వు నవ్వాడు.

"అయిపోతున్నది" అన్నాడు సిద్ధార్థుడు.

వాసుదేవుడు తల ఆడించాడు "అవును" అన్నట్టు. అతని ముఖంలో కరుణ తొణుకుతూవున్నది ఒక వెలుగుతో కూడా.

కమలకు మళ్ళా స్మృతి వచ్చింది. సిద్ధార్థుని వైపు చూచింది. "నీకు సిద్ధి కలిగిందా? శాంతి లభించిందా?" అన్నది. సిద్ధార్థుడు ఆమె చేతిలో చేయిపెట్టి మెల్లగా నవ్వాడు. "అవును నీకు లభించింది. నాకుకూడా లభిస్తుంది" అన్నది కమల. "నీకు లభించింది" అన్నాడు సిద్ధార్థుడు కమల చెవిదగ్గరకు వంగి.

బుద్ధభగవానుని దర్శించి శాంతిపొందవలెనని బయలుదేరి వచ్చింది కమల. ఆయనకు బదులుగా సిద్ధార్థుని చూచింది. ఆ యిద్దరిలో ఎవరినిచూచినా మంచిదే. అతనితో ఏమో చెప్పవలె ననుకున్నది. కాని, మాట పెగలలేదు. అతనివైపు మళ్లా చూచింది. కొద్ది మరణ వేదన, కొద్దిగా కంపం. సిద్ధార్థుడు తనచేతులతో కమల కళ్లు మూశాడు.

ఆ శవాన్ని చూస్తూ చాలసేపు కూర్చున్నాడు. ఆతనికి అప్పటి ముఖం; ఆ పెదవులు, ఆ రూపం స్మృతికి వచ్చినవి. ఇప్పటి శవాకారాన్ని చూస్తున్నాడు. "ఏదీ నశించేది కాదు. ఆ క్షణంలో అది సత్యమే" అనుకున్నాడు.

అన్నం సిద్ధంగా వున్నది. కాని సిద్ధార్థుడు తినలేదు. ఇద్దరూ బైట వసారాలో పండుకున్నారు. సిద్ధార్థునికి నిద్ర పట్టలేదు. లేచిపోయి నది వొడ్డున కూర్చున్నాడు. నది కబురులను వింటూ కూర్చున్నాడు. మధ్యమధ్య తిరిగి వచ్చి పిల్లవాడు లేచాడేమో చూస్తున్నాడు.

తెల్లవారింది. సూర్యోదయమైంది. వాసుదేవుడు అడిగాడు: "నీవు నిద్రపోలేదనుకుంటాను" అని. "లేదు, నది వద్ద కూర్చున్నాను. నది ఎంతో చెప్పింది. చివరకు అంతా ఒకటే అని చెప్పింది" అన్నాడు సిద్ధార్థుడు.

"సిద్ధార్థా! నీవు చాలా బాధలు పడ్డావు. కాని నీ హృదయాన్ని దుఃఖం స్పృశించలేదు."

"మిత్రమా? నాకు దుఃఖం ఎందుకు? ఒకనాడు నేను శ్రీమంతుడను. ఈనాడు అంతకంటే శ్రీమంతుడను. నా కొడుకు దక్కాడు నాకు."

"మంచిది! ఆ కొండమీదనే నా భార్యకు చితిని పేర్చాను. ఆ కొండమీదనే కమలకు చితిని పేర్చుదాము."

పిల్లవాడు నిద్రలో వున్నాడు. ఇద్దరూ వెళ్లి కొండ మీద కమలకు చితిని పేర్చారు.



# 6. కుమారుడు



తల్లి అంత్యక్రియలు ముగిసేవరకూ పిల్లవాడు అక్కడే వున్నాడు. అంతసేపూ ఏడుస్తూనే వున్నాడు. భయమూ దుఃఖమూ వాని మనసును పెనవేసుకున్నవి. తిన్నగా ఓదార్చి ఇంటికి తీసుకవెళ్ళాడు సిద్ధార్థుడు. ప్రతిరోజు ఆ కొండ మీదకు వెళ్ళి కూర్చునేవాడు. వాని చూపులు ఎక్కడో వుండేవి. మనసులో ఏదో మథనపడుతూ వుండేవాడు.

సిద్ధార్థుడు వానిని ఆదరంగా చూచేవాడు. అతిగా దుఃఖిస్తూవుంటే "పోనీ – పాపం" అని వూరుకునేవాడు. తాను తండ్రి అన్నసంగతి ఆకుర్రవానికి తెలియదు. పుత్ర ప్రేమ ఏలా చూపగలడు అనుకునేవాడు. తరువాత వాని ప్రవర్తనవల్ల సిద్ధార్థునికి తోచింది : తల్లిమాలిమి వల్ల చెడిపోయినాడు. అందులో ఇంటిపట్టున అన్నిభోగాలు అనుభవించినవాడు – అని. ఆలాంటివాడు వెంటనే కొత్తచోట ఇమడడం సాధ్యంకాదు అనుకున్నాడు. అతనిని ఏవిధంగానూ ఒత్తిడిచేసేవాడు కాదు. అన్నీ అనువుగా ఉన్నంతలో

జరిపేవాడు. తిండి రుచిగా చేసిపెట్టేవాడు. నెమ్మదిగా వాడే దారికి వస్తా డనుకున్నాడు.

ఆ పిల్లవాడు రావడం తన అదృష్టం అనుకున్నాడు సిద్ధార్థుడు. కాని, వాడు చిరచిరలాడుతూ ఎప్పుడూ విముఖంగా వుండేవాడు. ఒక్కొక్కప్పుడు ఎదురుతిరిగేవాడు. ఏ పనీచేసేవాడుకాదు. పెద్దవాళ్ళను బొత్తుగా లక్ష్యపెట్టే వాడుకాడు. దొంగతనంగా చెట్లపండ్లన్నీ కోసుకుని తినే వాడు. కొడుకు వచ్చినందుకు సుఖము, శాంతి కలగకపోగా బాధ, దుఃఖము కలిగినవి. కాని ఆ పిల్లవాడు లేకుండా సుఖించిన దానికంటే వానితో బాధలుపడడమే మంచిగా తోచింది తండ్రికి.

పడవపని వాసుదేవుడు చూచుకునేవాడు. సిద్ధార్థునికి ఇంటిపనితోనూ, పిల్లవానితోనూ సరిపోయేది. కొడుకు ఏ నాటికైనా తనతో అనుకూలంగా ఉంటాడనీ, తండ్రిగా తనను ప్రేమిస్తాడనీ ఆశతో చాలా దినాలు గడిపాడు. ఇదంతా గమనిస్తూ వాసుదేవుడు నెమ్మదిగా సమయానికి ఎదురు చూస్తున్నాడు. ఒకనాడు పిల్లవాడు తండ్రిని విసిగించడమే కాకుండా అన్నంకుండలను పగలగొట్టాడు. అది చూచి వాసుదేవుడు సిద్ధార్థుని బైటికి పిలుచుకొనిపోయి కూర్చోపెట్టి ఈ విధంగా మాట్లాడాడు :

“సిద్ధార్థా! నన్ను క్షమించవలె. నా మిత్రుడవు కాబట్టి నీతో మాట్లాడుతున్నాను. నీవు చాలా బాధ పడుతున్నావు. నీ కొడుకు నిన్నే కాదు నన్నుకూడా కష్ట పెడుతున్నాడు. ఆ కుర్రవాడు వేరే జీవితానికి వేరే పరి

స్థితులకు అలవాటు పడినవాడు. నీలాగా అసహ్యం వేసి భోగాలను వదలివచ్చినవాడు కాడు అతడు. తన యిష్టం లేకుండానే వదిలి వచ్చినవాడు. మిత్రమా! నేను నదిని అడిగాను. ఎన్నిసారులో అడిగాను. నది నవ్వింది. నిన్ను చూచి, నన్ను చూచి నవ్వింది. మన తప్పునుచూచి గలగలా నవ్వింది. నీరు నీరులో కలుస్తుంది. వయసు వయసుతో కలుస్తుంది. నీ కొడుకు ఇక్కడ సుఖంగా వుండలేడు. నీవే నదిని అడుగు. ఏమి చెపుతుందో విను.''

కరుణ పుట్టిపడుతూవున్న వాసుదేవునిముఖాన్ని చూచాడు సిద్ధార్థుడు. ఆ ముఖంలో ఎన్నో ముడతలు-ప్రతిదీ అతనిలోని మంచితనానికి ఒక గుర్తు. సిద్ధార్థుడు చాలా బాధ పడ్డాడు. ''మిత్రమా! ఎలా వదలుకోగలను! కొద్దికాలం చూస్తాను. అతనిహృదయాన్ని అందుకోవలెనని ప్రయత్నం చేస్తున్నాను. ప్రేమతోనూ ఓర్పుతోనూ అతనిని నావైపు త్రిప్పుకుంటాను. ఒకనాటికి అతనితో కూడా నది మాట్లాడకపోదు. అందుకే అతడు వచ్చాడనుకుంటాను'' అన్నాడు.

వాసుదేవుడు నవ్వుతూ ఈలా అన్నాడు: ''నిజమే. అతడుకూడా నిత్యజీవితానికి చెందినవాడే. కాని అతడు ఎందుకు వచ్చాడో-అతనిమార్గం ఏమిటో - అతడు చేయవలసిన పనులు ఎట్టివో - అతని దుఃఖాలు ఏవో - నీకు నాకు తెలుసునా? అతని దుఃఖాలు తేలికైనవిగా వుండవు. అతని హృదయంలో చాలా అభిమానం వున్నది. చాలా కఠినమైనది. బహుశా అతడు చాలా కష్టాలు అనుభవిస్తాడు.

ఎన్నో అకృత్యకార్యాలు, ఎన్నో పాపాలు చేస్తాడు. మిత్రమా! ఆ కుర్రవానికి నీవు చదువు చెపుతున్నావా? నీకు విధేయుడుగా వుంటున్నాడా? నీ వేమైనా అతనిని దండిస్తున్నావా?''

''లేదు, నేను ఏలాటి దండనలు చేయడంలేదు.''

''నాకు తెలుసును. నీవు అలా చూడవు. కాఠిన్యం కంటే సాధుత్వం, హింసకంటే ప్రేమ బలీయమైనవే. కాని నీ ప్రేమ అతనికి సంకెల అవుతున్నది. నీ మంచితనం, నీ సహనం అతనికి అవమానించడంగా తోస్తున్నది. నీవూ నేనూ రెండు అరటిపండ్లు తిని బ్రతుకుతాము. ఈలాంటి మనతో ఈ గుడిసెలో అంత అహంభావం కలవానిని నిల పడం బలవంతం చేయడం కాదా? మన భావాలు వేరు. అతని భావాలు వేరు. మన హృదయాలు ముదురు బారినవి. అతని హృదయం ఇంకా లేతగా వున్నది. నీవు చేసే దంతా అతనికి నిర్బంధంగానే వుంటుంది.''

''అయితే నన్ను ఏమి చేయ మంటావు?''

''అతనిని నగరంలో తల్లి యింటికి తీసుకొని వెళ్ళు. అక్కడ ఎవ్వరూ లేకపోతే నగరంలో ఏ గురువుదగ్గరనైనా చేర్చు. అక్కడ చదువు అబ్బుతుందని కాదు. తోడి బాలురతో బాలికలతో సహవాసం కుదురుతుంది. అతనికి సంబంధించిన ప్రపంచంలో పడతాడు.''

''ఈ విషయం నేనుకూడా ఆలోచించాను. ఇంత మూర్ఖుడు ప్రపంచంలో ఏలా మెలగగలడు? అంత స్వాతి

శయం కలవాడు భోగాలకు లొంగకుండా వుంటాడా? నేను దిగిన రొంపిలోకి వాడూ దిగితే? కడకు సంసారకూపంలో మునిగిపోతాడేమో."

"ఆ సంగతి ఆ నదిని అడుగు. ఆ నది ఏమి చెప్తుందో విను. నీవు తప్పులు చేశావంటే, మళ్ళా ఆ తప్పులు చేయకుండా నీ కొడుకును రక్షించుకోవలెనని చేశావా? సంసారంలో దిగకుండా నీ కొడుకును నీవు రక్షించుకో గలవా? ఏలాగు? బోధల వల్లనా? ప్రార్థనల వల్లనా? ఉపదేశాల వల్లనా? మిత్రమా! ఒకప్పుడు నీవు నాకు చెప్పావు: బ్రాహ్మణయువకుడు సిద్ధార్థుని కథను. అది చాలా అర్థవంతమైన కథ. ఆ కథను మరచిపోయినావా? శ్రమణుడుగా వుండిన సిద్ధార్థుని సంసారంలో దిగకుండాను, పాపాలు చేయకుండాను, ఆశకు, లోభానికి లొంగకుండాను, తప్పులు చేయకుండాను ఎవరైనా రక్షించ గలిగారా? తన ఇష్టానుసారం బ్రతకదలచినప్పుడు, తన జీవితాన్ని మలినం చేసుకున్నప్పుడు, తన మార్గాన్ని తాను చూచుకున్నప్పుడు, ఏ తండ్రీ ఏ గురువు అడ్డుపడ గలిగారు? ఎవరికిగాని ఈ దారి తొక్కక తప్పుతుందా? నీ కొడుకుకు తప్పుతుందా? అతనికోసం నీవు పది జన్మలెత్తు. అతని విధిని అణుమాత్రం నీవు మార్చలేవు."

వాసుదేవుడు ఎన్నడూ ఇంతగా మాట్లాడలేదు. సిద్ధార్థుడు లోపలికి వెళ్ళి పండుకున్నాడు. కాని నిద్రపట్టలేదు. అదివరకు తాను అనుకోని సంగతి వాసుదేవుడు క్రొత్తగా చెప్పింది ఏమీ లేదు. అతనికి పిల్లవానిమీద ప్రేమా, అతడు తనకు కాకుండా పోతాడేమోనన్న భీతీ

అధికంగా వున్నవి. ఇదివరకు ఎన్నడూ ఎవ్వరినీ అతడు అంత అంధప్రాయంగా అంత ఆశతో ప్రేమించలేదు. కాని ఆ ప్రేమలో అతనికేదో ఆనందం కనిపిస్తున్నది.

మిత్రుని సలహావెంట నడవడానికి అతనికి మనస్కరించలేదు. పిల్లవానిని వదులుకో లేకపోయినాడు. వాడు తనయెడల మర్యాదమీరి ప్రవర్తించినా మాట్లాడకుండా సహించేవాడు. పైగా ఆదరం చూపేవాడు. వాసుదేవుడు కూడా మౌనంగా సహనంతో గమనిస్తూ వున్నాడు. ఓర్పులో ఇద్దరూ అందెవేసిన చేతులే!.

ఒకప్పుడు కమల అన్నది అతనితో : "ప్రేమించడం నీచేత కాదు" అని. అందుకు తానూ ఒప్పుకున్నాడు. తన్ను తాను మరచేటంతగా ఒకరిని ప్రేమిస్తూ ఆ ప్రేమలో పూర్తిగా మునిగిపోవడం అతడు ఎన్నడూ ఎరగడు. తనలో అదేగొప్పతన మనుకుంటూ వచ్చాడు. ఈ నాటికి ఈ కొడుకుమీది ప్రేమవల్ల తానూ మామూలు మనిషి అయినాడు. ఆ ప్రేమ అతని కళ్ళను కప్పివేసింది. ఆ ప్రేమ అతనిని అవివేకిని చేసింది. ఇంతకాలానికి అతనికి ఒక ప్రేమ బంధం చుట్టుకున్నది. దానివల్ల ఎంతో బాధపడుతున్నాడు.

ఈ పుత్రప్రేమ అన్నది మనుషులకు సహజంగా కలిగే చిత్తవికారం – ఇదే సంసారం – ఒక సుడిగుండం వంటింది : ఈ సంగతి అతనికి తెలుసును. కాని అది పనికి మాలింది కాదనీ, అవసరమైందేననీ, అది తనలో సహజంగా పుట్టినభావ మనీ, అది కూడా అనుభవించవలసిందే ననీ సరిపెట్టుకునేవాడు.

ఆ కుర్రవానికి తండ్రిపట్ల భక్తి భయము రెండూ లేవు. తండ్రి మంచితనం అతనికి నచ్చలేదు. తనను ఈ పాడుగుడిసెలో నిలిపిపెట్టాడు. తాను ఎంత పెంకెతనం చేసినా చిరునవ్వుతో మెత్తగా, దయగా మాట్లాడుతాడు. అదంతా ఆ కుర్రవానికి వట్టి నక్కవినయంగా తోస్తున్నది. ఇంకా తన్ను హింసపెట్టడమే ఇంతకంటే మేలనుకున్నాడు. తండ్రి ప్రవర్తన అతనికి అసహ్యాకరంగా వున్నది.

ఒకరోజు సిద్ధార్థుడు కట్టెల పోగుపెట్టమని కొడుకుతో చెప్పాడు. కుర్రవాడు కదలలేదు. తండ్రికి ఎదురుగా నిలబడి ఈలా అన్నాడు :— "నీ కట్టెలు నీవే పోగుపెట్టుకో - నేను నీ నౌకరును కాను. నీవు చూపే ఆపేక్ష అంతా నాకు శిక్షగా వున్నది. ఏమో తెలిసినట్టుగా నటిస్తూ నీ లాగా నేనూ చేతులు ముడుచుకుని ఈ గుడిసెలో పడివుండవలె నని నీ కోరిక. నీ మీద కసితీర్చుకోడానికైనా సరే నేను దొంగతనం చేస్తాను. హత్యలు చేస్తాను. నరకానికైనా వెళ్తుతాను. నీవు నా తండ్రివి కావు. నా తల్లికి నీకు ఎలాంటి సంబంధంవుండనీ !"

కడుపులో వున్న కోపాన్నంతా ఒక్కసారి వెళ్ల గక్కి వడివడిగా ఎక్కడికో పరుగెత్తాడు. సిద్ధార్థుడు కదల కుండా నిల్చున్నాడు వెళ్ళుతూవున్న కొడుకువైపు చూస్తూ. ఆ రాత్రి పొద్దుపోయిన తరువాత తిరిగి వచ్చాడు. మరునటి రోజు ఉదయాన చూస్తే ఎక్కడా కనిపించలేదు. వాసు దేవుడు దాచుకున్న రూకలబుట్ట కూడా కనిపించలేదు.

రేవుకు వెళ్ళి చూడగా పడవ అవతలిగట్టున వున్నది. కుర్రవాడు లేచిపోయినట్టు తేలింది.

ముందురోజు ఆలా మాట్లాడినందుకే బాధపడుతూ వున్న సిద్ధార్థునికి కొడుకు కనపడకుండా పోవడం మరీ దుర్భర మైంది. "పసివాడు ఒంటరిగా అడవిలోపడి ఎక్కడికి వెళ్ళాడో! ఏమి అపాయం జరుగుతుందో! నేను వెంటనే వెళ్ళి వెదకక తప్పదు" అన్నాడు వాసుదేవునితో.

"కుర్రవాడు పడవను అవతలి వొడ్డుకు చేర్చాడు. నదిని దాటడానికి మనం ఒక చిన్న తెప్పను కట్టుకోవలె. కాని, సిద్ధార్థా! అతడు పసిబిడ్డ కాడుగదా! తన సంగతి తానే చూచుకుంటాడు. అతని ఇష్టంవచ్చిన చోటికి పోనీయ రాదూ? నగరానికి వెళ్ళివుంటాడు. అతడు చేసింది మంచి పనే నిజానికి. నీవు ఉపేక్షించిన పనిని తానే స్వంతంగా చేశాడు. తన కర్తవ్యాన్ని తానే నిర్ణయించుకున్నాడు. తనకు నచ్చిన దారిని పోయినాడు. మిత్రమా! నీవు బాధ పడుతున్నావని నాకు తెలుసును. కాని, నవ్వుకోవలసిన దానికి నీవు దుఃఖిస్తున్నావు. త్వరలో నీవే నవ్వుకుంటావు" అన్నాడు వాసుదేవుడు.

సిద్ధార్థుడు ఏమీ జవాబు చెప్పలేదు. అప్పుడే గొడ్డలి పట్టుకొని వెదురుతో తెప్ప కట్టడానికి ప్రారంభించాడు. వాసుదేవుడు అతనికి సహాయం చేశాడు. ఇద్దరూ కలిసి తెప్పను సిద్ధం చేశారు. ఆ తెప్పమీద నదిదాటి అవతలి వొడ్డుకు చేరారు. వాసుదేవుడు గొడ్డలి వెంటబెట్టుకొని వచ్చాడు. "గొడ్డలి తెచ్చావెందుకు?" అని సిద్ధార్థుడు

అడిగాడు.'' ''మిత్రమా! మన తెడ్డు పడవలో వుంటుందని నాకు నమ్మకం లేదు'' అన్నాడు వాసుదేవుడు.

వాసుదేవుడు పడవలోకి దిగి అటుగంతా వెదకి చూచాడు. తెడ్డు కనబడలేదు. నవ్వుతూ సిద్ధార్థుని వైపు చూచాడు. ఆ నవ్వులో, ఆ చూపులో సిద్ధార్థునికి ఈ భావం వ్యక్తమైంది: నీవు వెంబడించడం నీకొడుకుకు సమ్మతం కాదు. అని నోటితో ఆమాట అనకుండా వాసుదేవుడు వేరొక తెడ్డును తయారుచేశాడు. సిద్ధార్థుడు కొడుకును వెతకడానికి బయలు దేరాడు. వాసుదేవుడు అతనిని అభ్యంతరపెట్టలేదు.

సిద్ధార్థుడు అడవిలో చాలాసేపు తిరిగాడు. ఇంకా తాను వెదకడం వృథా అనిపించింది. అప్పటికే కుర్రవాడు అడవిదాటి నగరం చేరి వుండవలె. లేదా తనకు కనిపించకుండా ఎక్కడనైనా దాక్కొని వుండవలె. బాగా ఆలోచించిన మీదట తన కొడుకుకు అడవిలో ఏలాటి అపాయం జరిగివుండదని ఎందుకో స్ఫురించింది. అయినా ముందుకు సాగిపోయినాడు. తన కొడుకును రక్షించుకోవలెనని కాదు. ఆ కుర్రవానిని ఒక్కసారి మళ్ళా చూడవలెనని సిద్ధార్థుని భ్రాంతి. తిన్నగా నగరాన్ని సమీపించాడు.

అదుగో కమలతోట – ఆతోటవాకిట నిలబడ్డాడు. గతమంతా అతని కళ్ళకు కట్టినట్టు కనబడుతూ వున్నది. పెరిగిన గడ్డంతో, దుమ్ముకొట్టుకున్న శిరోజాలతో, శ్రమణ యువకుడు సిద్ధార్థుడు నిలబడివున్నాడు. కమల పల్లకి వచ్చింది. కమలను కళ్ళార్పకుండా చూచి తలవంచుకున్నాడు సిద్ధార్థుడు – కమల చిరునవ్వుతో తల వూపింది.

ఆ భ్రమలోపడి చాలాసేపు అలాగే నిల్చున్నాడు. తోటలోపల చెట్లక్రింద భిక్షుకులు తిరుగుతున్నారు. అతనికి ఆభిక్షుకులు కనబడడం లేదు. ఆ చెట్లనీడల్లో యువక సిద్ధార్థుడూ సుందరి కమలా తిరుగుతున్నారు. కమల ఆ యువకుని మొదటిముద్దు పెట్టుకుంటున్నది.

అంతలో కామస్వామి, అతని నౌకరులు, అక్కడి విందులు, జూదరులు, పాటలు, ఆటలు, అన్నీ కనబడినవి. బంగారుపంజరంలో పిట్ట కనిపించింది. సంసారాన్ని ఈది యీది, అలసట పుట్టి అసహ్యం వేసి పరుగెత్తిపోయి నదిలో దూకి చావడానికి సిద్ధపడిన క్షణంలో ఓంకారం వినిపించిన వరకు తన బ్రతుకంతా ఒక్కసారి గోచరించింది.

అలాగే తోటవాకిట చాలాసేపు నిల్చున్నాడు. మంచుతెర విచ్చింది. "ఇక్కడికి రావడం ఎంత తెలివి మాలిన పని! ఆ కుర్రవానిని నేను రక్షించడ మేమిటి? నా యిష్టానుసారం నడవ మని నేను బలవంత పెట్టడ మేమిటి? ఎంత అవివేకం!" అనుకున్నాడు. కాని కొడుకు మీద ఇంకా ఏదో మమకారం. ఆ మమకారం అతని గుండెలో ఒకగాయంగా తయారైంది. "ఈ గాయం సెల వేసి చిర కాలం వుండేది కాదు. అదే మానిపోతుంది" అనుకున్నాడు.

గాయం వెంటనే మానకపోవడం అతనికి దుఃఖంగా వున్నది. తాను కొడుకును వెదుక్కుంటూ వచ్చాడు. అక్కడ కనిపించింది వట్టిశూన్యం. తనలో ఏదో చచ్చి పోతున్నట్టు తోచింది. ఇంకా సుఖ మేమిటి అనుకున్నాడు. క్రుంగిపోయి క్రింద కూలబడ్డాడు. ఏదో వినబడుతుం దని

ఓర్పుతో ఎదురు చూస్తున్నాడు. ఈలా చూడడం అతనికి ఆ నది నేర్పింది. ఆ రస్తాలో దుమ్ము ఏమి చెపుతుందో నని చూచాడు. తనలో ఆయాసంగా కొట్టుకుంటూ వున్న గుండె ఏమి చెపుతుందో నని చూచాడు. అలా చాలా సేపు చూచాడు. ఏమీ కనబడలేదు. ఏమీ వినబడలేదు. దిక్కూ దారీ తెలియక శూన్యంలో పడిపోయినాడు. మళ్ళా గాయం బాధగా వున్నది. లోలోపల ఓంకారాన్ని ఉచ్చరించుకున్నాడు. ఓంకారం అతనిలో నిండు కున్నది. కొంత సేపటికి భిక్షుకులు అతనిని చూచారు. తలంతా దుమ్ము కొట్టుకొని నేలమీద పడివున్నాడు. ఒక భిక్షుకుడు అతని వద్దకు వచ్చి, రెండు అరటిపండ్లు ముందుపెట్టాడు. ఆ భిక్షుకు డెవ్వరో అతడు చూడలేదు.

ఒకచేయి అతనివీపును తాకి మైకంలో నుంచి మేలు కొల్పింది. ఆ స్పర్శను అతడు గ్రహించాడు. లేచి వాసు దేవుని కౌగిలించుకున్నాడు. ఇద్దరి ముఖాలలో చిరునవ్వు మొలకెత్తింది. సిద్ధార్థుడు తనముం దున్న అరటిపండ్లను తీసుకున్నాడు. ఒకటి వాసుదేవుని కిచ్చి ఒకటి తాను తిన్నాడు. వాసుదేవుడు ముందూ, అతడు వెనకా మౌనంగా నడిచివెళ్ళారు. అడవిదాటారు. నది రేవుకు చేరారు. కుర్రవాని సంగతి ఒక్కరూ ఎత్తలేదు. గాయంబాధను సిద్ధార్థుడు చెప్పనూలేదు. వాసుదేవుడు అడగనూలేదు. సిద్ధార్థుడు గుడిసెలోకి వెళ్ళి పక్కమీద పండుకున్నాడు. వాసుదేవుడువెళ్ళి చూచేటప్పటికి మంచి నిద్రలో వున్నాడు.



# 7. ఓం



చాలా కాలం సిద్ధార్థుని ఆ గాయం బాధపెడుతూనే వున్నది. అతడు ఆనదిమీద ఎందరో ప్రయాణికులను దాటిస్తూవుండేవాడు. ఆ ప్రయాణికులతో కూడ మగపిల్లలు, ఆడపిల్లలు వుండేవాళ్లు. వాళ్ళను చూచినప్పుడు అతని మనస్సు చివుక్కుమనేది. ఈర్ష్యపడేవాడు. ఆ సుఖము ఆనందము అంతమందికి వుండగా తనకుమాత్రమే ఎందుకు లేకపోవలె. దుర్మార్గులకు దొంగలకు కూడా బిడ్డలు వుంటారు. ఆ బిడ్డలను ప్రేమించుకుంటారు. వాళ్ళ ముద్దు ముచ్చటలను అనుభవిస్తారు. సిద్ధార్థుని మనస్సు అంత పసితనంగానూ, అంత అవివేకంగానూ ఆలోచిస్తున్నది. అతనికి అంత పామరత్వం కలిగింది.

ఇప్పుడు ప్రజలపట్ల అతనికి మునుపటిభావం లేదు. అతని దృష్టి మారింది. తానే మహా తెలివిగలవాడ నన్న గర్వం పోయింది. అందరినీ ఆదరంతో ఆసక్తితో ఆప్యాయంగా చూస్తున్నాడు.

మామూలు ప్రయాణికులను దాటించేటప్పుడు మునుపటిమాదిరి తనకు పరాయివాళ్లుగా కనబడడం లేదు. వాళ్ళ కష్టసుఖాలన్నీ తనకు అర్థం కాకపోవచ్చు. వాటిలో తాను పాల్గొనకపోవచ్చు. కాని వాళ్లు చెప్పుకునే సంగతులన్నీ ఇష్టంగా వినేవాడు. తనకున్న ఆత్మసంస్కారం వాళ్లకు లేకపోవచ్చు. అయినా ప్రతి మనిషినీ సోదరభావంతో చూచేవాడు. వాళ్ళదజ్ఞాలు కానీ, అల్పభావాలు కానీ అతనికి హేయంగా తుచ్ఛంగా తోచేవికావు. వాళ్ళను అర్థం చేసుకొనేవాడు. ప్రేమచూపేవాడు. గౌరవించేవాడు.

ఒకతల్లి తనబిడ్డను ప్రేమిస్తుంది. ఒకతండ్రి తన ఏకపుత్రుని ప్రేమిస్తాడు. ఒక స్త్రీ సొమ్ములను, చీరలను ప్రేమిస్తుంది. ఒకయువతి యువకుని ప్రేమిస్తుంది. అలా ప్రేమించడం గుడ్డితనం కావచ్చు. వివేకం కాకపోవచ్చు. పేలవం కూడా కావచ్చు. కాని ఆ ప్రేమవెనక ఒక తీవ్రమైన ప్రేరణ వున్నది. ఆ ప్రేమలో గాఢమైన ప్రాణ శక్తి వున్నది. అట్టి ప్రేమ తృణీకరించ తగిందికాదనుకున్నాడు సిద్ధార్థుడు. దానికోసమే మనుషులు బ్రతుకుతున్నారు. మహాకార్యాలు సాధిస్తున్నారు. దేశాలన్నీ తిరుగుతున్నారు. యుద్ధాలు జరుపుతున్నారు. ఎన్నో బాధలు పడుతూ వాటిని సహిస్తున్నారు. అందుకే వాళ్లమీద అతనికి ఆదరం కలిగింది. వాళ్ల వాంఛలలోనూ, అవసరాలలోనూ జీవశక్తినీ చైతన్యాన్నీ బ్రహ్మపదార్థాన్ని కూడా చూస్తున్నాడు. గుడ్డితనంగా కనిపించే వాళ్లసంబంధబాంధ

వ్యాలు వాటిలో వాళ్ళు చూపే బలము పట్టుదల అవన్నీ ఆదరించ తగినవి, హర్షించ తగినవి.

అయితే ఆలోచనాపరునికి సిద్ధపురుషునికి తెలిసిన ఒక్క స్వల్పవిషయం మాత్రం వాళ్లకు తెలియదు. జీవరాశి అంతా ఏకం అన్నవిషయం వాళ్లకు తెలియదు. మిగతా విషయాలలో వాళ్లు సిద్ధపురుషునికి ఆలోచనాపరునికి ఏవిధంగానూ తీసిపోరు. ఈ జీ వైక్యభావం అంత ముఖ్యమైందా? ఆలోచనాపరుల మనుకునే వారు తమ గొప్పతనాన్ని ప్రకటించుకోడానికి చెపుతూ వుంటారు, అంతా ఒకటే నని. అనుభవంలో వారుకూడా అల్పులే, పసివారే. ఈ మాటలు చెప్పడంలో తప్ప వారు దేనిలోనూ మామూలు ప్రజలకంటే ఘనులు కారు. ఇంకా నికృష్టులు కూడా.

వాస్తవంగా జ్ఞానమంటే ఏమిటి? చిరకాలంగా తాను చేస్తూవున్న అన్వేషణకు ఫలితాంశం ఏమిటి? అన్న విషయం సిద్ధార్థునికి క్రమక్రమంగా గోచరిస్తున్నది. అతనిలో పరిపాకం పొందుతూ వున్నది. ఇదే ఆ జ్ఞానం. జీవితంలో ప్రతిక్షణమూ ఏకత్వాన్ని గమనిస్తూ భావిస్తూ దానినే ప్రకటిస్తూ వుండగల రహస్యకళ అది. ఆత్మకు ఆ శక్తిని సంపాదించడానికి చేసే ప్రయత్నం, సాధన, ఇదే జ్ఞానం. ఈ భావం అతనిలో నెమ్మదిగా పరిపక్వం అవుతూ వున్నది. ఈ భావమే వాసుదేవునిముఖంలో ప్రతిఫలిస్తూ వున్నది. ఈ ప్రపంచం నిత్యమైంది, పరిపూర్ణమైంది, ఏకమైంది. ఈ రహస్యాన్ని తెలుసుకోవడమూ, జీవితంలో సమత్వదృష్టిని

కలిగి వుండడమూ, ఇదే జ్ఞాన లక్షణం. ఈ లక్షణం వాసు దేవునిముఖంలో ముద్ర వేసినట్టుగా వున్నది.

ఇంకా సిద్ధార్థుని గాయం లోపల బాధిస్తూనే వున్నది. కొడుకుమీద మమకారం తగ్గలేదు. కొడుకు వెళ్లిపోయి నందుకు దుఃఖం అలాగే వున్నది. పైగా, అదే ఆలోచనతో మమకారాన్ని పెంచుకుంటున్నాడు. ఆ బాధ నంతా అనుభ విస్తూ వున్నాడు. గాయం దా నంతట అది మానేటట్టుగా లేదు.

ఒకనాడు సిద్ధార్థుడు ఆవేదనను పట్టలేకపోయినాడు. పడవమీద నదినిదాటి అవతలి ఒడ్డుకు వెళ్ళాడు. కొడుకును చూడవలెనన్న భ్రాంతికొద్దీ వెదకడానికి నగరానికి వెళ్లుదా మనుకున్నాడు. అది యెండకాలం. ఆ నది నెమ్మదిగా పారు తున్నది. కాని దానిగొంతుక [illegible]గా మోగుతూ వున్నది. అది నవ్వుతూ వున్నది. ఆ నవ్వు స్పష్టంగా వినిపిస్తూ వున్నది. అతనిని చూచి ఆ నది ఉల్లాసంతో గలగలా నవ్వుతూ వున్నది.

సిద్ధార్థుడు నది వొడ్డున కదలకుండా నిల్చున్నాడు. ఆ నవ్వును బాగా వినవలెనని నీటిమీదికి వంగాడు. నెమ్మదిగా పారుతూవున్న నీటిలో తనముఖం ప్రతిఫలించింది. ఆ నీడను చూడగానే ఏదో మరుపుతగిలినవిషయం స్మృతికి వచ్చింది. ఒక్కక్షణం ఆలోచించాడు, ఫలానా అని గుర్తుకు వచ్చింది. తనముఖంలో తనతండ్రిపోలిక కనిపించింది.

ఒకనాడు తాను యువకుడుగా వున్నపుడు – శ్రమణు లలో చేరుదా మనుకున్నాడు. తండ్రిని ఒప్పుకొమ్మని బల

వంత పెట్టాడు. ఆయన కష్టంమీాద ఒప్పుకున్నాడు. ఇల్లు వదలి వచ్చాడు. మళ్లా తండ్రిదగ్గరకు వెళ్ళలేదు. ఆ కథంతా జ్ఞప్తికి వచ్చింది. ఈ నాడు తన కొడుకుకోసం అనుభవిస్తూ వున్న బాధను ఆ నాడు తనకోసం ఆ తండ్రి అనుభవించి వుండడా? మళ్ళా తనను చూడకుండానే ఆయన ప్రాణాలు విడిచాడు. ఆగతే తనకూ పట్టింది. విధిఘటన చక్రంలాగా తనతండ్రి దగ్గరనుంచి తనదాకా తిరిగిరావడం విచిత్రంగా లేదూ? ఇదంతా ఒక ప్రహసనమూ ?

నది నవ్వుతూనే వున్నది: అవును అది "అంతే" అన్నట్టుగా. ఏదికాని చివరిదాకా అనుభవించకుండా, తుదిముట్టకుండా, అనుభవానికి మధ్య తెంపుకలిగితే, అది తిరిగి వచ్చి చుట్టుకుంటుంది. అవే దుఃఖాలను ' తిరిగి అనుభవించక తప్పదు.

సిద్ధార్థుడు పడవ నెక్కి వెనక్కు వెళ్ళాడు. దారి పొడుగునా తన తండ్రిని తన కొడుకును తలచుకుంటూ వున్నాడు. ఆ నది తనను చూచి ఎగతాళిగా నవ్వింది. తనతో తనకే పోరాటంగా వున్నది. ఏ క్షణానికి ఆక్షణం నిరాశ పొందుకుని వున్నది. తనను చూచుకున్నా, లోకాన్ని చూచినా బిగ్గరగా నవ్వుదా మనిపి స్తున్నది.

ఇంకా గాయం బాధపెడుతూనే వున్నది. ఇంకా తన విధితో ఎదురుతిరిగి పోరాడుతూనే వున్నాడు. ఇంకా శాంతి కలగలేదు. తనబాధను జయించ లేదు. కాని ఏదో ఆశ కనిపిస్తూనే వున్నది.

గుడిసెదగ్గరకు వెళ్లాడు. వాసుదేవునికి తన బాధను దాపరికం లేకుండా విప్పిచెపుదామనుకున్నాడు. తన దుర్బలత్వాన్ని దోషాన్ని అతని ముందు ఒప్పుకుందామనుకున్నాడు. అతనికి చెప్పుకోవలెనన్న కోరిక తీవ్రంగా కలిగింది. వినడంలో నేర్పుగలవాడు వాసుదేవుడు. అతడు గుడిసెలో కూర్చుని బుట్టలు అల్లుకుంటున్నాడు. చూపు మందగించింది. దేహంలో సత్తువ సన్నగిల్లింది. కాని అతని ముఖంలో సంతోషము, శాంతి, స్థిమితత్వము, మాయకుండా వెలుగుతూ వున్నవి.

సిద్ధార్థుడు అతని పక్కన కూర్చొని మెల్లగా మాట్లాడడానికి ప్రారంభించాడు. తన కొడుకును వెనుకుతూ నగరానికి వెళ్ళినప్పుడు వాడు కనబడకపోగానే తన మనస్సులో కత్తిపోటులాగా గాయం పడడము; బిడ్డలతో కలిసి వెళ్ళే ప్రియాణికులను చూచి తనకట్టి సుఖం లేనందుకు తాను ఈర్ష్యపడడము; ఆలాంటి భావం కలగడం దోషమని తెలిసికూడా తనలో తాను తెంపులేకుండా పోరాడడము, ఈ సంగతులన్నీ, ఇదివరకు ఎన్నడూ చెప్పనివి చెప్పడానికి కష్టమైనవి, వాసుదేవునికి వినరంగా చెప్పాడు. ఆ నాడు మళ్లా నగరానికి వెళ్ళవలెనని నదిని దాటడము; ఆ నది తనను చూచి అపహాస్యంగా నవ్వడము; వెంటనే తాను వెనక్కు తిరిగిరావడము – అంతా చెప్పాడు. తనగుండెలో ఇంకా సెలవేస్తూవున్న గాయాన్ని పూర్తిగా విప్పిచూపాడు.

సిద్ధార్థుడు మాట్లాడుతూ వున్నంతసేపూ, వాసుదేవుడు ప్రశాంతంగా వింటున్నాడు. అతడు జాగ్రత్తగా వింటున్నాడని సిద్ధార్థుడు బాగా గ్రహించాడు. తన బాధలు తన ఆవేదన తన లోపలి ఆశలు వాసుదేవుని స్పృశించి తిరిగి తనలోకి వస్తూవున్నట్టుగా తోచింది. వాసుదేవునికి తన గాయాన్ని విప్పిచూపడం ఆ నదిలో దానిని కడిగి మంటను చల్లార్చుకున్నట్టుగా వున్నది.

మధ్యలో సిద్ధార్థునికి ఒక భావం కలిగింది. తన మాటలను వింటూవున్నది వాసుదేవుడు కాదనిపించింది. చలనం లేకుండా కూర్చున్న ఆ వ్యక్తి ఆ నది ఒకటే అనిపించింది. నిత్యసత్యమైన బ్రహ్మపదార్థమే ఆ వ్యక్తి అనిపించింది. ఈ భావం తనను ఆవేశించేకొద్దీ అది సహజంగానే తోచింది. తాను పూర్తిగా గ్రహించకపోయినా వాసుదేవుడు ఎప్పుడూ ఆలాగే వుండినట్టుగా తోచింది. నిజానికి తనకూ అతనికీ భేదమే లేదనిపించింది. ఈ దర్శనం ఎక్కువ కాలం నిలిచేది కాదనిపించింది.

వాసుదేవుడు అతనివైపు చూచాడు. మాట్లాడలేదు. అతని ముఖంలో ప్రేమ, శాంతి, జ్ఞానం, వెల్లివిరుస్తూ వున్నవి. సిద్ధార్థుని చేయి పట్టుకున్నాడు. నదివద్దకు తీసుకొనివెళ్లాడు. ఇద్దరూ ప్రక్కప్రక్కన కూర్చున్నారు. వాసుదేవుడు నదినిచూచి నవ్వాడు. "ఈ నది నవ్వువిన్నావు కాదూ? కాని నీవు పూర్తిగా వినలేదు. నీవు ఇంకా వినవలసింది వున్నది. విందాము" అన్నాడు.

ఇద్దరూ వింటున్నారు. ఆ నదిపాట వేయిగొంతుక లతో మృదువుగా మోగుతున్నది. సిద్ధార్థుడు ఆనదిలోనికి వంగి చూచాడు. ఆ నీళ్ళలో ఎన్నో బొమ్మలు తేలాడుతూ వున్నవి. తనతండ్రిబొమ్మ కనిపించింది. ఒంటరిగా తనకోసం దుఃఖపడుతూ వున్నాడు. తనబొమ్మ కనిపించింది. పరుగెత్తి పోయిన కొడుకుకోసం ఒంటరిగా బాధపడుతూ వున్నాడు. తనకొడుకుబొమ్మ కనిపించింది. ఆసక్తితో సంసార సుఖాల కోసం ఒంటరిగా సాగిపోతూ వున్నాడు. ఎవరిదృష్టి వారి లక్ష్యం మీదనే వున్నది. ముగ్గురూ బాధపడుతూనే వున్నారు. నదిగొంతుక దిగులుగా మోగుతున్నది. ఆశతో విచారంతో పాడుకుంటూ తన గమ్యస్థానానికి ప్రవహిస్తూవున్నది ఆ నది.

"వినబడుతున్నదా" అన్నట్టు వాసుదేవుడు సిద్ధార్థుని వైపుచూచాడు. సిద్ధార్థుడు తలవూపాడు. "బాగా విను" అని వాసుదేవుడు అతని చెవిలో వూదాడు.

సిద్ధార్థుడు శ్రద్ధగా వింటున్నాడు. తన తండ్రిబొమ్మ తనబొమ్మ తన కొడుకుబొమ్మ ఒకదానితో ఒకటి కలిసి ప్రవాహంలో కొట్టుకొని పోయినవి. కమలబొమ్మకూడా కనిపించి కొట్టుకుపోయింది. అలాగే గోవిందుని బొమ్మ ఇంకా ఎందరివో బొమ్మలు లేచి కొట్టుకుపోయినవి. అన్నీ నదిలో లీనమై పోయినవి. ఆశలతో, వాంఛలతో, బాధ లతో బ్రతికిన అందరికి గమ్యస్థానం ఆ నదే. ఆ నది గొంతుకలో ఆశ వాంఛ బాధ నిండుకొనివున్నవి. నది గమ్యస్థానానికి ప్రవహిస్తూ వున్నది.

నది వడిగా ప్రవహిస్తున్నది. అందులో తన బొమ్మను తన బంధువుల బొమ్మలను తా నెరిగిన అందరి బొమ్మలను చూచాడు సిద్ధార్థుడు. అన్ని బొమ్మలు నీళ్ళలో కొట్టుకొని పోతూవున్నవి. ఆ నీళ్ళు జలపాతానికి సముద్రానికి వేర్వేరు గమ్యస్థానాలకు పరుగెత్తిపోతూ వున్నవి. ఒకదాని వెనక ఒకటిగా అన్ని గమ్యస్థానాలను చేరుకుంటవి ఆ నీళ్ళు.

నీరు ఆవిరిగా పైకి పోతుంది. వానగా నేలమీంద పడుతుంది. సెలయే రవుతుంది. నది అవుతుంది. ఈలా మారుతూ ప్రవహిస్తూ వుంటుంది. ఆ నదిగొంతుకలో సంతోషము, దుఃఖము, మంచి, చెడు, నవ్వు, ఏడుపు, ఒక వేయి ధ్వనులు మోగుతూ వుంటవి.

సిద్ధార్థుడు అన్ని గొంతుకలను జాగ్రితగా విన్నాడు. వినడం ఎలాగో పూర్తిగా నేర్చుకున్నాడు. నదిలో ఈ గొంతుకలన్నీ ఇదివరకూ విన్నాడు. కాని ఈనాడు ఇంకో రకంగా మోగుతున్నవి. సంతోషధ్వని, దుఃఖధ్వని, బాల ధ్వని, స్త్రీధ్వని, పురుషధ్వని అన్నీ విడదీయరాకుండా వున్నవి. ఆ ధ్వనులన్నీ ఒకదానితో ఒకటి మిళితమై పెన వేసుకుని వున్నవి. అన్నిధ్వనులు, అన్నిగమ్యాలు, అన్ని ఆశలు, అన్ని దుఃఖాలు, అన్నిసుఖాలు, అన్నిశుభాలు, అన్ని అశుభాలు అన్నీ కలిసిందే ఈప్రపంచం; ఈసంసారం.

వేయి గొంతుకలతో పాడే ఆ నదిపాటను శ్రద్ధగా విన్నప్పుడు—ఒక సుఖధ్వనికి ఒక దుఃఖధ్వనికి కట్టుబడకుండా అన్నిటినీ తనలో లీనం చేసుకున్నప్పుడు—అన్నిటినీ విన్న

ప్పుడు ఆ వేయిగొంతుకల పాట సిద్ధార్థునికి ఒక్క మాటలో మోగింది. ఆ మాట "ఓంకారం" అనగా పరిపూర్ణం.

"విన్నావా" అన్నట్టు వాసుదేవుడు సిద్ధార్థుని వైపు చూచాడు. వాసుదేవుని చిరునవ్వు వెలిగిపోతూ వున్నది. అతనిముఖంలోని ప్రతి ముడతలోనూ ఆవెలుగు ప్రసరిస్తూ వున్నది. ఆ నది గొంతుక లన్నీ కలిసి ఓంకారంగా వినిపించినట్టు. ఆ వెలుగునవ్వుతో చూచాడు సిద్ధార్థునివైపు. అతనిముఖంలో కూడా అదేనవ్వు మొలకెత్తింది. అతనిగాయం మానిపోతున్నది. అతడు ఏకత్వంలో చేరిపోతున్నాడు.

ఆ క్షణంనుంచి సిద్ధార్థుడు తనవిధితో పోరాటం మానాడు. జ్ఞానంవల్ల రాగల శాంతి లభించింది. రాగ ద్వేషాల సంఘర్షణ అంతరించింది. సర్వజీవితంలో సామరస్యం కుదిరింది. సర్వభూత ప్రేమ కలిగింది. నదీప్రవాహంలో లీనుడైనాడు. సర్వైక్యభావం ప్రాప్తించింది.

వాసుదేవుడు లేచాడు. సిద్ధార్థుని కళ్ళలోనికి చూచాడు. అందులో జ్ఞానతేజస్సు గోచరించింది. ఆశీర్వదిస్తున్నట్టుగా అతని వీపుమీద తట్టి అన్నాడు: "సిద్ధార్థా! ఈ క్షణం కోసం ఎదురుచూచాను. ఆ సమయం వచ్చింది. దీర్ఘకాలం నేను పల్లెకారిగా వాసుదేవునిగా వున్నాను. అవసరం తీరింది. కుటీరమా! శలవు. నదీ! శలవు సిద్ధార్థా! శలవు."

సిద్ధార్థుడు వంగి నమస్కారం చేశాడు. "నాకు తెలుసును నీవు అడవిలోనికి వెళ్ళుతున్నావా ?" అన్నాడు. "అవును అడవిలోకి వెళ్ళుతున్నాను. సర్వైక్యస్థితిలోకి వెళ్ళుతున్నాను" అన్నాడు వాసుదేవుడు. వెళ్ళుతూవున్న వాసుదేవునివైపు చూస్తూ సిద్ధార్థుడు నిలబడ్డాడు. అతని అడుగులో శాంతి, అతని ముఖంలో పరమసుఖం, అతని ఆకారంలో తేజస్సూ నిండివున్నది.



# 8. గోవిందుడు



బౌద్ధభిక్షుకులకు కమల సమర్పించిన తోటలో విశ్రాంతికోసం గోవిందుడు కొన్నాళ్లు వున్నాడు. సమీపంలో నదివొడ్డున ఒక పల్లెకారి వున్నట్టూ, అతడు గొప్ప సిద్ధుడు అయినట్టు చెప్పుకోగా విన్నాడు. ఆ పల్లెకారిని చూడ వలెనని బయలుదేరాడు. గోవిందుడు భిక్షుక నియమాలను శ్రద్ధతో పాటించేవాడు. అతడంటే తోడిభిక్షుకులకు చాలా గౌరవంకూడాను. కాని అతనిహృదయంలో అశాంతి ఇంకా వదలలేదు. అతని సాధన ఇంకా ఫలించలేదు.

గోవిందుడు నదిదగ్గరకు వచ్చాడు. నదిని దాటించ మని పల్లెకారిని అడిగాడు. అవతలి గట్టుకు చేరి పడవ దిగిన తరువాత గోవిందుడు పల్లెకారితో ఈలా అన్నాడు: ''భిక్షు కులమీదను ప్రయాణికుల మీదను నీవు చాలా దయ చూపుతున్నావు. నీవు ఎంతమందినో ఈ నదిమీద దాటించి వుంటావు. నేను ధర్మపథంలో సాధనచేస్తూ వున్నాను. నీవుకూడా నాలాంటి సాధకుడ వేమో?''

సిద్ధార్థుడు నవ్వుతూ: "అయ్యా! మీరు సాధకులా? మీరు భిక్షుక వేషంతో వున్నారు. పైగా వృద్ధులు, మీకు ఇంకా సాధన ఏమిటి?" అన్నాడు.

"నేను వృద్ధుడనే, కాని నేను ఎప్పుడూ సాధన చేస్తూనే వున్నాను. ఈ సాధనను ఎన్నటికీ మానుకోను. సాధన చేస్తూ వుండడమే నా పాలిటివిధిగా తోస్తున్నది. నీవుకూడా సాధనచేసినట్టు కనబడుతున్నది. నీ అనుభవం ఏమిటో చెప్పగలవా?" అన్నాడు గోవిందుడు.

"నీకు ఉపయోగించే విషయం నేను ఏమి చెప్పగలను? నేను చెప్పగలిగింది ఇంతే. బహుశా నీవు అతిగా సాధనచేస్తూ వుంటావు. దాని ఫలితం ఏమంటే నీకు సిద్ధి కలగడం లేదు."

"అ దేమిటి?"

"ఒకడు సాధనచేస్తున్నాడంటే, దేనికోసం సాధన చేస్తున్నాడో అదే అతనికి గోచరించడం సహజం. ఇంకొక విషయం అతనికి గోచరించదు. ఇతర విషయాలను అతడు జీర్ణించుకోలేడు. కారణం ఏమంటే తాను దేనికోసం సాధన చేస్తున్నాడో దానిని గూర్చే ఆలోచిస్తాడు. అతనికి ఒక లక్ష్యం వుంటుంది. ఆ లక్ష్యంవైపే వుంటుంది అతనిచూపు. సాధన అనగానే దానికి ఒక లక్ష్యం వుంటుంది. కాని పరమార్థాన్ని తెలుసుకోవలెనంటే, ఏలాటి నిర్బంధం వుండగూడదు. అన్నిటినీ గ్రహించగలిగి వుండవలె. ఒకటే లక్ష్యమంటూ వుండగూడదు. మీరు సాధకులు కావచ్చు. కాని

మీా లక్ష్యంకోసం ప్రయత్నిస్తూ మీాకళ్ళముందున్న అనేక విషయాలను గ్రహించలేకపోతున్నారు.''

''నీవు చెప్పేది నాకు అర్థం కావడం లేదు. నీ అభిప్రాయం ఏమిటి ?''

''చాలాకాలం క్రిందట మీారు ఈ నది వద్దకు వచ్చారు. అక్కడ ఒక మనిషి నిద్రపోతున్నాడు. అతను నిద్రలేచే వరకు కాపలాగా ప్రక్కన కూర్చున్నారు. కాని ఆ మనిషిని గుర్తుపట్టలేదు.''

''సిద్ధార్థుడవా నీవు? ఈతడవకూడా నిన్ను గుర్తుపట్టలేకపోయినాను. నిన్ను చూడడం నాకు మహానందంగా వున్నది. నీవు చాలా మారిపోయినావు. ఇప్పుడు పల్లెకారిగా వున్నావా ?''

''అవును. నేను పల్లెకారిగా వున్నాను. చాలా మందికి ఎన్ని విధాలనో మారక తప్పదు. ఎన్నో వేషాలు వేయక తప్పదు. అందులో నేనొకడను. గోవిందా! నా వెంట రా. ఈ రాత్రి నా గుడిసెలో గడుపుదువుగాని.''

ఆ రాత్రి గోవిందుడు ఆ గుడిసెలో పండుకున్నాడు. ఇద్దరు చిన్ననాటి స్నేహితులు. గోవిందుడు సిద్ధార్థుని ఎన్నో సంగతులు అడిగాడు. సిద్ధార్థుడు తన జీవితాన్ని ఏలా గడిపిందీ, తాను ఏలాంటి అనుభవాలు పొందినదీ అన్ని వివరాలు చెప్పాడు.

మరుసటిరోజు ఉదయాన గోవిందుడు ప్రయాణం అవుతూ కొంచెం సందేహంగా సిద్ధార్థునితో ఈలా అన్నాడు:

"సిద్ధార్థా! నేను వెళ్ళేముందు నిన్ను ఇంకొక ప్రశ్న అడగవలెనని వున్నది. నీకు ఒక సిద్ధాంతమంటూ వున్నదా? నీ జీవితానికి నీ ధర్మసాధనకూ ఉపకరించే ఒక ప్రత్యేక విశ్వాసమూ, జ్ఞానమూ కలదా?"

సిద్ధార్థుడు: "మిత్రమా! నీకు తెలుసును. నీవూ నేనూ అడవిలో శ్రమణులతో కలిసివుండి నప్పుడుకూడా ఒక సిద్ధాంతమన్నా, గురువులన్నా నాకు విశ్వాస ముండేదికాదు. ఇప్పటికీ నా మనస్సు ఆలాగే వున్నది. కాని నాకు కూడా చాలామంది గురువులతో సంపర్కం కలిగింది. ఒక చక్కని వేశ్య నాకు గురువుగా వున్నది. ఆమె దగ్గర చాలాకాలం శుశ్రూష చేశాను. ఒక గొప్ప షాహుకారు, జూదరులు నాకు గురువులైనారు, ఒకప్పుడు ఒక బౌద్ధ భిక్షుకుడు గురువైనాడు. ఆతడు మార్గాన వెళ్లుతూ అడవిలో నేను నిద్ర పోతూ వుండగా నా ప్రక్కన కూర్చున్నాడు. అతనివల్ల కూడా కొంత నేర్చుకున్నాను. అతనికి నేను ఎంతో కృతజ్ఞుడను. అందరికన్నా ఈ నదివల్లనూ, నాకు ముందు ఈ గుడిసెలో వుండిన వాసుదేవుని వల్లనూ చాలా విషయాలు గ్రహించాను. ఆ వాసుదేవుడు కేవలం సాధువు. మామూలు మనిషిగానే వుండేవాడు. పెద్ద ఆలోచనా పరుడు కాడు. కాని బుద్ధభగవానునిలాగా పరమార్థాన్ని తెలుసుకున్నవాడు. అతడొక సిద్ధపురుషుడు."

గోవిందుడు: "సిద్ధార్థా! ఇంకా నీ చమత్కారం ఆలాగే వున్నది. నీవు చెప్పేమాట నాకు నమ్మకమే. నీవు ఏ గురువునూ అనుసరించలేదని నాకు తెలుసును. కాని నీకు

స్వయంగా ఏదో సిద్ధాంతం, ఏవో భావాలు లేవా? నీకు ఉపకరించిన ఏదో ఒక విధమైన జ్ఞానాన్ని నీవు సంపాదించ లేదా? ఆ విషయాన్ని తెలుసుకోవలెనని నాకు కుతూహలంగా వున్నది."

సిద్ధార్థుడు: "అవును. నాకు ఏవేవో భావాలు వుండేవి. ఏదో జ్ఞానంకూడా అక్కడక్కడ సంపాదించాను. ఒక్కొక వేళ ఒక రోజో ఒక గంటో నాకు జ్ఞానం అంటే ఏమో తెలిసేది. నాకు కలిగిన భావాలన్నీ చెప్పడం కష్టం. కాని, నాకు అచ్చు గుద్దినట్టుగా నిలిచిపోయిన భావం ఒక్కటే. జ్ఞానం అనేది ఒకరు చెపితే తెలుసుకోతగింది కాదు. జ్ఞానాన్ని మాటలతో చెప్పడం సాధ్యంకాదు. కొందరు జ్ఞానులనిపించుకున్నవారు మాటలతో జ్ఞానాన్ని ఉపదేశించడానికి ప్రయత్నం చేస్తారు. ఆలాంటి ఉపదేశం ఎప్పటికీ వృథా."

గోవిందుడు: "నీ వేమి చమత్కారంకోసం మాట్లాడుతున్నావా?"

సిద్ధార్థుడు: "చమత్కారం కాదు. నేను తెలుసుకున్న విషయాన్నే నీకు చెపుతున్నాను. విజ్ఞానం వేరు. జ్ఞానం వేరు. విజ్ఞానాన్ని మాటలతో ఒకరికి చెప్పవచ్చును. జ్ఞానాన్ని తెలుసుకోవచ్చును. అనుభవంలోకి తెచ్చుకోవచ్చును. అది మనకు రక్ష కావచ్చును. దాని ద్వారా ఎన్ని మహాత్ములైనా సాధించవచ్చును. కాని దానిని చెప్పడం, ఉపదేశించడం అసాధ్యం. ఈ సందేహం నాకు

చిన్నతనంలోనే కలిగింది. అందుకే నేను ఏ గురువును ఆశ్రయించలేదు.''

''నీకు ఇంకొక విశేషం చెపుతున్నాను. ఇదికూడా నీకు చమత్కారంగా తోచవచ్చు. ప్రతి విషయానికీ వ్యతిరేకంగా ఇంకొక విషయం వుంటుంది. ఇది ఎంత సత్యమో అదీ అంత సత్యమే. ఒక సత్యానికి ఒకవైపును మాత్రమే మనము మాటలతో చెప్పగలము. మనసుతో ఆలోచించేదీ, మాటలతో చెప్పేదీ, ఏదైనాసరే అది ఒకవైపే మనకు గోచరిస్తుంది. అది సగం సత్యమే. దానికి సంపూర్ణత్వం, సమగ్రత్వం, ఏకత్వం వుండవు. బుద్ధభగవానుడు ప్రపంచానికి బోధించవలసినప్పుడు సంసారం, నిర్వాణం, మాయ, సత్యం, దుఃఖం, విముక్తి అంటూ రెండుగా విభజించక తప్పింది కాదు. ఎవరికైనా ఇంకొక మార్గం లేదు.''

కాని, మనచుట్టూ, మనలోపల ఉన్న ప్రపంచం ఒక్కవైపే కలది కాదు. ఒక మనిషికాని, ఒక పనికాని పూర్తిగా సంసారమూ కాదు. పూర్తిగా నిర్వాణమూ కాదు. ఏ మనిషికానీ ఎన్నటికీ పూర్తిగా సిద్ధుడూ కాడు, పూర్తిగా పాపీ కాడు. కాలం సత్యపదార్థం అన్న భ్రమలో, మనం ఉండడంవల్లనే ఈ దోషదృష్టి కలుగుతూ ఉన్నది. కాలం సత్యపదార్థం కాదు. ఈ విషయం నేను ఎన్నిసారులో గ్రహించాను. కాలం సత్యపదార్థం కానప్పుడు, ఈ ప్రపంచాన్నీ, శాశ్వతత్వాన్నీ, దుఃఖాన్నీ సుఖాన్నీ, మంచినీ చెడ్డనూ, విడదీసే రేఖకూడా భ్రాంతి కాక తప్పదు.''

గోవిందుడు : ''ఏలాగు?''

సిద్ధార్థుడు: "మిత్రమా! విను. నేను పాపిని. నీవు పాపివి. కాని ఒకనాటికి ఈ పాపి నిర్వాణాన్ని, బ్రహ్మత్వాన్ని పొందుతాడు. ఒకనాటికి బుద్ధుడు కాగలడు. ఈ 'ఒకనాటికి' అన్నది భ్రాంతి. ఒక స్థితిని వే రొకస్థితికి పోల్చి చెప్పేమాట అది. ఒకపాపి బుద్ధస్థితికిపోతూ వుండడమంటూ లేదు. అతడు పెరిగి ఆ బుద్ధస్థితిని అందుకోవడం కాదు. మనం ఇంకోవిధంగా ఆలోచించడం సాధ్యంకాదు. కాబట్టి అలా అంటున్నాము. ప్రతిపాపిలోనూ గూఢంగా బీజరూపంగా బుద్ధుడు ఇదివరకే వున్నాడు. అతని భవిష్యత్తుకూడా వర్తమానంలో ఇమిడే వున్నది. నీలోనూ నాలోనూ ప్రతివ్యక్తిలోనూ గూఢంగా బీజరూపంగా బుద్ధుడు ఉన్నాడని గ్రహించవలె."

"ఈప్రపంచం అసంపూర్ణంగావుండి ఏనాటికో నెమ్మదిగా పూర్ణత్వాన్ని పొందబోవడం లేదు. ప్రతిక్షణమూ పూర్ణంగానే వున్నది. ప్రతిపాపంలోనూ అనుగ్రహం ఇమిడి వున్నది. ప్రతి బాలుడూ బీజదశలో వున్న వృద్ధుడే. పాలుత్రాగే ప్రతి శిశువులోనూ మృత్యువు దాక్కొని వున్నది. మృతినిపొందే ప్రతిమనిషిలోనూ శాశ్వతస్థితి గుప్తంగా వున్నది. ఒకవ్యక్తి ఏ స్థితిలో వున్నదీ చెప్పడం సాధ్యం కాదు. దొంగలోనూ, జూదరిలోనూ బుద్ధుడు వున్నాడు. బ్రహ్మపదార్థంలోనే దొంగ వున్నాడు."

"ఏకాగ్ర మైన ధ్యానస్థితిలో కాలాన్ని త్రోసివేసి, ఒక్కసారిగానే భూతభవిష్యద్వర్తమానాలను చూడడం సాధ్యపడుతుంది. ఆ స్థితిలో అంతా మంచిదే, అంతా

పూర్ణమే, అంతా బ్రహ్మమే. కాగా మృత్యువు కానీ, జీవం కానీ, పుణ్యం కానీ, పాపం కానీ, జ్ఞానం కానీ, అజ్ఞానం కానీ అన్ని పదార్థాలు మంచివనే నాకు తోస్తుంది. ప్రతిదీ అగత్యమైందే. అయితే మనం దేనినిగాని ప్రేమపూర్వకంగా అర్థం చేసుకొని ఆమోదిస్తే అన్నీ మంచివే. దేనివల్లనూ మనకు హాని కలగనేరదు.''

''నేను పాపం చేశాను. కామసుఖం అనుభవించాను. ధనం సంపాదించాను. వెగటు పుట్టింది. నిరాశ కలిగింది. వాటిని నిరోధించకుండా అనుభవించడం నేర్చుకున్నాను. ఈ ప్రపంచాన్ని ప్రేమించడం నేర్చుకున్నాను. నాకు ఇష్టమైన ఏదో ప్రపంచాన్ని ఊహించి దానితో ఈ ప్రపంచాన్ని పోల్చి చూడడం లేదు. ఎక్కడో పరిపూర్ణం వున్నదని వూహించి దానితో దీనిని పోల్చుకోవడం లేదు. ఈ ప్రపంచాన్ని ఉన్నదానిని ఉన్నట్టుగా గ్రహిస్తున్నాను. ప్రేమిస్తున్నాను. నేను దీనికి సంబంధించి వున్నందుకు సంతోషిస్తున్నాను. ఈ అనుభవమంతా అవసరమని నా దేహం ద్వారాను, నా ఆత్మద్వారాను నేర్చుకున్నాను.''

''ఈ రాయిచూడు—కొంత కాలానికి ఈ రాయి మట్టి కావచ్చు. ఆ మట్టిలో ఒక మొక్క పుట్టవచ్చు. అటు తరువాత ఒక జంతువు, ఒక మనిషి కావచ్చు. ఇదివరకైతే: 'ఈ రాయి రాయిమట్టుకే, దీనికి విలువ లేదు. ఈ రాయి వట్టి మాయ'—అనేవాడను. ఇప్పుడు 'ఈ రాయి రాయిమాత్రమే కాదు. ఇది జంతువు, మనిషి, భగవంతుడు, బుద్ధుడు అన్నీకూడా' అంటాను. ఈ రాయి

ఈనాడు రాయిగావుండి ముం దెప్పుడో బుద్ధుడు కాబోతు న్నదని కాదు దానిమీద గౌరవం. ఇదివరకే అన్నీ అందులో వున్నవి. ఎప్పుడుకూడా అన్నిగానే వున్నది ఈ రాయి. దీని గరుకులోనూ, నునుపులోనూ, వన్నెలోనూ, ధ్వనిలోనూ విలువను అర్థాన్ని చూస్తున్నాను. ఒక్కొక్క రాయి ఒక్కొక రకంగా ఉంటుంది. ప్రతిరాయి తన మార్గంలో 'ఓం'ను జపిస్తూ ఉన్నది. ప్రతిరాయి బ్రహ్మ పదార్థమే. బ్రహ్మపదార్థంగా వుంటూనే రాయిగా కనిపిస్తు న్నది.. ఈ భావమే నాకు ఆనందాన్ని కలిగిస్తున్నది. ఇందుకే ఈ రాయి నాకు ఆశ్చర్యకరంగాను, పూజనీయం గాను కనిపిస్తున్నది. ఈ భావాన్ని ఇంతకంటే తేటతెల్లంగా చెప్పలేను. భావాలను మాటలు పూర్తిగా వ్యక్తీకరించ లేవు. మాటలతో చెప్పినప్పుడు ఆ భావాలకు అపార్థం కలగవచ్చు. ఇంకొకవిశేష మేమంటే ఒక మనిషికి సార్థక మైంది, జ్ఞానప్రదమైంది వేరొకమనిషికి కాకపోవచ్చు. అదికూడా న్యాయమే నంటాను. దానికీ నేను సంతో షిస్తాను.''

గోవిందుడు : ''రాయిని ఉదాహరణగా ఎందుకు తీసు కున్నావు?''

సిద్ధార్థుడు : ''అందులో ప్రత్యేకమైన ప్రుద్దేశం ఏమీ లేదు. ఈ రాయిలాగానే ఆ నదిని అన్నివస్తువులను ప్రేమి స్తాను. అన్నిటివల్ల నేర్చుకుంటాను. గోవిందా! ఇవన్నీ వస్తువులు. మనం వస్తువులను ప్రేమించగలము. మాటలను ప్రేమించజాలము. అందుకే మాటలతో చేసేబోధలు

ప్రయోజనం లేనివి అంటాను. ఆ మాటలకు కరుకు, మెత్తన, వన్నె, వంపు, వాసన, రుచి ఇ వేవీ లేవు. వస్తువు లను వదిలి మాటలను పట్టుకోవడంవల్లనే నీకు శాంతి కలగలేదు. సంసారం, నిర్వాణం అన్నవికూడా మాటలే. నిర్వాణం ఒక వస్తువు కాదు.''

గోవిందుడు : ''మిత్రమా! నిర్వాణం వట్టిమాట కాదు. అది ఒక భావం.''

సిద్ధార్థుడు : ''అది భావం కావచ్చు. భావానికి మాటకు అంత వ్యత్యాసం లేదు. వస్తువులకే నేను ప్రాధాన్యం ఇస్తాను. నేను రాకముందు ఇక్కడ పడవను నడుపుతూ వుండిన వాసుదేవుడు గొప్ప సిద్ధుడు. అతడు నాకు గురువు కూడా. అతడు చాలాకాలం ఈ నదిని మాత్రమే నమ్మేవాడు. ఈ నది అతనితో మాట్లాడేది. ఈ నది అతనికి అన్ని విషయాలు బోధించేది. ఈ నదే అతనికి భగవంతుడు. ప్రతిగాలి, ప్రతి మబ్బు, ప్రతిపక్షి అన్నిటిలో దివ్యత్వం వున్నదనీ అన్నీ ఈ నదిలాగానే బోధించగలవనీ తరువాత తరువాత గ్రహించాడు. అతనికి అన్నీ తెలుసును. గురువులు లేకుండా గ్రంథాలు లేకుండా ఈ నదిని నమ్మి అతడు సిద్ధుడైనాడు.''

గోవిందుడు : ''నీవు వస్తువు అనేదానికి నిత్యత్వం వున్నదా? ఈ దృశ్యమంతా మాయాకల్పితం కాదా?''

సిద్ధార్థుడు : ''ఈ వస్తువులన్నీ భ్రాంతి అయితే నేను కూడా భ్రాంతే. వాస్తవంలో అవీ నేనూ ఒకటే నన్న

మాట. అందుకే వాటిని నేను ప్రేమిస్తాను. ప్రపంచంలో ప్రధానమైంది ప్రేమ ఒక్కటే. గొప్పపండితులు ప్రపంచాన్ని గూర్చి విమర్శించవచ్చు. తర్కించవచ్చు. ఇదంతా తుచ్ఛం అనవచ్చు. కాని ప్రపంచాన్ని ప్రేమించవలెననీ, దాన్ని నిరసించరాదనీ, పరస్పరద్వేషాన్ని పోనాడి ప్రపంచాన్ని, మనలను, అన్ని జీవులను ప్రేమతో గౌరవంతో చూడవలెననీ నా వుద్దేశం.''

గోవిందుడు : "నాకు అర్థమైంది. కాని బుద్ధభగవానుడు ఈ ప్రపంచాన్ని క్షణికమనీ, మిథ్య అనీ అన్నాడు. ఆయన భూతదయ వుండాలని కూడా చెప్పాడు. అయితే ఐహికమైన ప్రేమవ్యాపారాన్ని ఆయన నిషేధించాడు.''

సిద్ధార్థుడు : "నాకు తెలుసును. ప్రేమ అనడంలో నా భావానికి, బుద్ధభగవానుని బోధకు స్థూలంగా వ్యత్యాసం కనపడుతుంది. అందుకే మాటలంటే నాకు నమ్మకం లేదు. గౌతముని బోధకు నా భావానికి నిజంగా వ్యత్యాసం లేదు. ఆయన క్షణికవాదాన్ని బోధించినా మానవులను ప్రేమించాడు. ఆలాంటి ప్రేమ లేకపోతే మానవులను ఉద్ధరించడానికి తన జీవితాన్నంతా ఆ విధంగా సర్వసమర్పణ చేసి వుండడు. ఆయన విషయంలోనూ నేను ప్రధానంగా పాటించేది ఆయన బోధకాదు. నాకు ముఖ్యమైనవి ఆయనచేసిన పనులు. 'ఆయనజీవితం – ఆయన సిద్ధాంతాలలో కన్నా ఆయన చూపులోనూ, చిరునవ్వులోనూ, చేతికదలికలోనూ నాకు ఎక్కువ అర్థం గోచరిస్తుంది. మాటలలో కాదు,

పనులలో, బ్రతుకులో గౌతముని మహాపురుషునిగా భావిస్తాను.''

సిద్ధార్థుడు గోవిందుడు చాలాసేపు మౌనంగా వున్నారు. గోవిందుడు ప్రయాణానికి సిద్ధమై ఈలా అన్నాడు. "మిత్రమా! నీ భావాలను వివరంగా తెలిపినందుకు కృతజ్ఞుడను. నీ భావాలు కొన్ని వింతగా వున్నవి. అవన్నీ వెంటనే నేను అవగాహన చేసుకోలేకుండా వున్నాను. అయినా నీవు తీసుకున్న శ్రమకు వందనాలు.''

"ఈ సిద్ధార్థుడు విచిత్రపురుషుడుగా తోస్తున్నాడు. ఇతనిభావాలు కూడా విచిత్రంగానే వున్నవి. కాని, ఆ భావాలలో ఒక క్రమం కనిపించడంలేదు. బుద్ధభగవానుడు ఏది చెప్పినా తేటగా సూటిగా తెలిసేటట్టుగా వుండేది. సిద్ధార్థుని భావాలు ఏలా వున్నా ఇతని చూపులు చిరునవ్వు ముఖవైఖరి ఎంత ఆకర్షకంగా వున్నవి! బుద్ధభగవానుడు నిర్వాణం చెందినతరువాత ఆయనవలె నాదృష్టిని ఆకర్షించి, నా మనస్సును కదిలించిన వ్యక్తి ఈ సిద్ధార్థుడు ఒక్కడే. ఇతడు నిస్సందేహంగా సిద్ధపురుషుడు. ఇతని భావాలు వింతగా తోచవచ్చు. ఇతని సంభాషణ తికమకగా తోచవచ్చు. కాని ఆపాదమస్తకం ఇతనిరూపం – ఆముఖంలో స్వచ్ఛత, శాంతి, సాధుత్వం, పవిత్రత ఒక్క బుద్ధభగవానునియందు తప్ప ఇంకెక్కడా చూడలేదు.'' ఈ విధంగా గోవిందుడు తనలో తాను అనుకున్నాడు.

గోవిందుడు సిద్ధార్థుని పాదాలముందు మోకరించి నమస్కరించి ఈలా అన్నాడు. "సిద్ధార్థా! మనం వృద్ధుల

మైనాము. ఈ జన్మలో మళ్ళా ఒకరినొకరు చూచుకోక పోవచ్చు. నీకు శాంతి లభించినట్లుగా నాకు స్పష్టమైంది. నాకు శాంతి లభించలేదు. నా సాధనకు అనుకూలించేది, నాకు అర్థమయ్యేది, ఏదైనా ఒక ఉపాయాన్ని నీ వల్ల తెలుసుకోవలె నని నా మనస్సు ఆరాటపడుతున్నది. ఎటు చూచినా నాకు చీకటిగా వున్నది. దారి కనిపించడం లేదు. ఏలాగైనా నీవే నన్ను కడతేర్చవలె."

సిద్ధార్థుడు మౌనంగా కూర్చున్నాడు. ఒక్కసారి శాంతంగా మందహాసంచేస్తూ గోవిందుని వైపు చూచాడు. గోవిందుడు నిశ్చలంగా అతనిముఖంలోనికి చూస్తున్నాడు. ఆకాంక్ష, ఆవేదన, అన్వేషణాసక్తి వీటితో పాటు ఆశా భంగమూ గోవిందుని ముఖంలో కనిపిస్తూవున్నవి. సిద్ధార్థుడు ఆ ముఖాన్ని చూచాడు. గ్రహించాడు. చిరునవ్వు నవ్వాడు.

సిద్ధార్థుడు గోవిందుని దగ్గరకు రమ్మని సైగ చేశాడు. "దగ్గరకువచ్చి నా నుదుటిమీద ముద్దుపెట్టుకో" అన్నాడు. గోవిందునికి ఆశ్చర్యం కలిగింది. అంతవరకు అతనిమనసులో సిద్ధార్థుని పరిసంగమే మోగుతూ వున్నది. కాలం లేదను కోవడం ఏలాగు? నిర్వాణము సంసారము ఒక్కటే అను కోవడం ఏలాగు? ఈ ప్రశ్నలు తేలక అతని మనస్సు మధనపడుతూ వున్నది. కాని, సిద్ధార్థునిపై గౌరవమూ తనలో కలిగిన ప్రేరణా వీటిబలంవల్ల గోవిందుడు వెంటనే ముందుకుపోయి నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు. తక్షణం అతనికి ఒక అద్భుతమైన అనుభవం కలిగింది.

సిద్ధార్థునిముఖం కనపడడం లేదు. ఏవో ముఖాలు, ఎన్నో ముఖాలు, వందలు వేలు వరుసలుగా ముఖాలు, వస్తూపోతూ, మారుతూ మళ్ళా కనపడుతూ ఈ విధంగా వున్నవి. కాని ఇవన్నీ సిద్ధార్థునిలోనే. ఒక చేప కనిపించింది. ఒక తిమింగిలం కనిపించింది. చేపను తిమింగిలం మింగుతూ వున్నది. అప్పుడే పుట్టిన బిడ్డముఖం కనిపించింది. ఏడుస్తూవున్నాడు. ఒక హంతకునిముఖం. ఎవరినో కత్తితో పొడవబోతున్నాడు. హత్యచేసినందుకు ఉరితీస్తున్నారు. ఉరితాడు తగిలించిన ఆముఖం కనిపించింది. కామపరవశులై పురుషులు స్త్రీలు దిసమొలలతో భోగిస్తున్నారు. ఏవో శవాలు కనిపించినవి. ఎలుగుబంట్లు, మొసళ్లు, ఏనుగులు, ఎద్దులు, పక్షులు ఏవేవో జంతువులు కనిపించినవి. అగ్నిదేవుడు కనిపించాడు. శ్రీకృష్ణుడు కనిపించాడు.

ఈ ముఖాలు, ఈరూపాలు వీటికి ఒక దానితో వేరొకదానికి వేయిసంబంధాలు, ప్రేమలు, ద్వేషాలు, హత్యలు, చావులు, పుట్టుకలు, చచ్చిన ప్రతిజీవికి తిరిగి పుట్టుక – కొత్తరూపం – కొత్తముఖం. ఈ రూపాలన్నీ ఒక ప్రవాహంలో మునుగుతున్నవి. తేలుతున్నవి. మునిగేటప్పుడు ఒకరకం. తేలేటప్పుడు ఇంకొకరకం. వీటినన్నింటిని ఆవరిస్తూ సిద్ధార్థునిముఖంలో చిరునవ్వు – ఈ జననమరణప్రవాహంమీద, ఈ సహస్రరూపాలపైన ఒక్కరకంగా వెలుగుతూ వున్నది ఆ చిరునవ్వు. సిద్ధార్థుని చిరునవ్వు.

గోవిందుడు బుద్ధభగవానుని చిరునవ్వు చూచాడు. ఆ చిరునవ్వులో - ఏ శాంతి, ఏ దయ, ఏ జ్ఞానం, ఏ వెలుగు గోచరించిందో అచ్ఛంగా ఆ విధంగానే గోచరిస్తున్నది సిద్ధార్థుని ముఖంలో చిరునవ్వు.

కాలమంటూ ఒకటి ఉన్నదో లేదో అతనికి తెలియదు. ఈ దృశ్యమంతా గోచరించినది ఒకక్షణమో, ఒక యుగమో అతనికి తెలియదు. గౌతముడు సిద్ధార్థుడు తాను ఉన్నారో లేరో తెలియదు. ఏదో దివ్యవేదన, దివ్యానందం - అంతే. ఈ వేలకొలది రూపాలన్నీ అద్దంలో కనిపించినట్లు కనిపించి, అంతరించగానే సిద్ధార్థుని ముఖం ఆ చిరునవ్వు - అలాగే కనిపించినవి గోవిందునికి. బుద్ధభగవానుని చిరునవ్వు సిద్ధార్థుని చిరునవ్వు ఒకటే - వేరుకాదు.

గోవిందునికి కన్నీళ్ళు ధారలుకడుతున్నవి. అతనిలో దివ్యమైన ప్రేమభావం - వినయం - భక్తి - నిండివున్నవి. ముఖంలో దివ్యమందహాసం చిలుకుతూ నిశ్చలంగా కూర్చున్న సిద్ధార్థుని పాదాలకు సాష్టాంగనమస్కారం చేశాడు గోవిందుడు. అతనికి జీవితపరమార్థం గోచరించింది. గోవిందుని ముఖంలోనూ అదే చిరునవ్వు.

